

# లోకైకమతము - భగవన్మతము

లేక

# లోకకళ్యాణేంద్రియ విజయ యుద్ధము

---

గీత 3 అ 31 శ్లో॥ యేమేమతమిదం నిత్యమనుతిష్ఠన్తి మానవాః।
శ్రద్ధావన్తోఽనసూయన్తోముచ్యన్తేతేఽపి కర్మభిః॥
అను శ్లోకార్థమున కాంద్రబాష్యముగా గ్రహింపనగును.

భగవదర్చనా సహితమైన భౌతికవాదమే యిహ పర సౌఖ్యఫలదాయక మగు నదిగాని, భగవదర్చనారహితమైన భౌతికవాదము యిహసుఖమే గాని పరసౌఖ్యమిడదని ధర్మమార్గమున ప్రశ్నించిన సమాధానమిచ్చుటకు సంసిద్ధుడనై యుంటిని.




భగవత్సేవకుడు - గ్రంథకర్త:

కవిరాజ **జినపనీని సూర్యనారాయణరాజు,**

**తణుకు** (సజ్జాపురం).



***1956***




మూల్యము: 2-8-0

# అంకితము



పరమేశ్వరితో నిత్యము సంతసించుచుండెడి
పరమేశ్వరునకీ కృతికన్య నిడితిని.
అతడు మమ్ము సర్వత్ర రక్షించుచుండుగాత!

సీ॥ ఆంధ్రదేశమునందు ♦ నవతరించినవాఁడ
గణనాథుపూజలు ♦ గడపువాఁడ
భవనాశరాజస ♦ ద్మాభిని శాంతమాం
బకు తనూభవునిగ ♦ బరగువాఁడ
పావనంబౌ భట్ట ♦ పదమను బిరుదముల్
గల రాచకులమున ♦ గలిగినాఁడ
దగు నైషధాది గ్రం ♦ థంబులు రచియించి
యీశునకే ♦ కృతు లిచ్చినాఁడ
గీ॥ బ్రాహ్మణామర వేద గో ♦ భక్తియుతుఁడ
ధాత్రియందు నాంగిరస ♦ గోత్రజుండ
జనపనీని గృహాఖ్యను ♦ జెలగువాఁడ
సూర్యనారాయణనృపుండ ♦ సుజనహితుఁడ॥

ఓ మానవశరీరధారీ! నీవు ధనికుడవైనను, నిరుపేదవైనను నిష్కామమునగాని, సకామమునగాని భగవదర్చనచేయుటే మానవజన్మ మెత్తినందులకు పరమావధి. లేనియెడల అట్టిజన్మ నిరుపయోగము, భూభారము, పాపభూయిష్ఠమైనదిగా గ్రహించుము. గాన దివ్యదృష్టి, దివ్యసృష్టివలననే మానవుని కిహపరసుఖములన, భుక్తి ముక్తుల నిచ్చు ననెడి భావముతో లోకకళ్యాణప్రదమునకై నాచే యీ గ్రంథము వ్రాయబడినదిగాన ఆచరించి కైవల్యము నొందుము. (☞ వ్యాకరణ నియమములు పాటించలేదు.)

# కృతజ్ఞత

-:-

నాచే రచింపబడిన ఈగ్రంథమును జూచి సంతసించి, దీన లోకైకకళ్యాణమగునని తలంచి దీని ముద్రింపించుటకు-

1. శ్రీ సంకు సత్యనారాయణగారు,
ల్యాండు లార్డు, ఋవ్వనపల్లి
2. శ్రీ కొండ్రెడ్డి రామచంద్రరావుగారు,
ల్యాండులార్డు, రావులుపఱ్ఱు
3. శ్రీ పడాల నర్సిరెడ్డిగారి కు॥ వెంకటరెడ్డిగారు,
ల్యాండులార్డు, సత్యవరం.
4. శ్రీ గుడిమెట్ల చినవీర్రెడ్డిగారి దత్తత కుమార్డు
వెంకటరెడ్డిగారు,
కమీషన్ మర్చంటు, వెలగలేరు.
5. శ్రీ కాకిలేటి సుబ్బయ్యగారు,
టీచరు, బోర్డు హైస్కూలు, తణుకు.

ధనసహాయ మొనర్చి యశము నందుచున్నారు. వీరు చేసిన సహాయమునకు సంతసించి విద్యాదానము చేసికొనుటకు కొన్నిపుస్తకములు వీరి కిచ్చితిని. ఇతరులెవరైన చేసిన యెడల నిట్లేచేయబడును.

☞ ఈగ్రంథమునుగాని, యిందలి భాగములనుగాని నాఅనుమతి లేనిదే అనువదించుటగాని, ముద్రించుటగాని చేయరాదు.

తణుకు,
(సజ్జాపురం)
ప॥ గో॥ జిల్లా.

ఇట్లు,
జినపనీని సూర్యనారాయణరాజు,
గ్రంథకర్త.



# లోకైకమతము లేక భగవన్మతము లేక భగవద్రాజ్యము లేక లోకకళ్యాణేంద్రియ విజయ యుద్ధము



భూలోకములో అన్ని జాతులమానవులు స్త్రీలు ఆచరింపదగినదే భగవన్మతము లేక లోకైకమతము. నిర్గుణబ్రహ్మము - సర్వశక్తివంతుడు. భగవన్ - పరాత్పరా మొదలగు నామముల ఉచ్ఛరించుట, జపధ్యానములుచేయుట, వానితో పరమేశ్వరునిపూజించుట. సగుణమన శివ, కృష్ణ, రామ, అల్లాది నామాదులతో పూజించుట. మతం అన పూజ. 'మ' అన ఈశ్వరుడు, విష్ణు, నిర్గుణబ్రహ్మము. అతనినిగురించి ధ్యానాదులుసేయు మార్గములు, అతనిని జేరుమార్గములు, అతను మానవునిజేరి బ్రహ్మర్షిగామార్చు మార్గములు. 'త' అన కలది - బోధించునది. భగవంతుడు కలడనియు అతడొకడని చెప్పునది మతము. భగవన్మతమన అవతారపురుషుల, బ్రహ్మర్షుల వాక్యములుచదివి, విని

దేవుని పూజించుమార్గము. భూలోకములో చిన్నపెద్ద మత ములన్నియు యీపత్ భేదముగా సత్కామమార్గము చరిం చదగునని, దుష్కామమార్గమున నడువరాదని బోధించును. అక్కడక్కడ దేశాచారములబట్టి ధర్మముమారుచుండును. ఉ॥ ఇంగ్లండు చలిదేశము. దాన ద్రాక్షసార త్రాగవచ్చును. దానతప్పుకాదు. భారతదేశాన సారాత్రాగరాదు. సమ శీతోష్ణదేశము. త్రాగినమహాపాపము. అన సర్వాయవ ముల సద్బలము నశింపచేసి దుర్బలమునిచ్చునందురు. వ్యభి చారము సర్వదేశములను సర్వజాతులను దోషమునిర్ణ యింపబడినది. అసురీసంపద మానవులు వ్యభిచారము దోషముకాదందురు. ఉ॥ పరాశరాదిబ్రహ్మర్షుల పేర్కొం దురు. బ్రహ్మర్షులచే సంతతిగనుట భగవంతుడగు అవ తారపురుషుని, సూర్యుని, పొందుటదక్క, యింద్రాదిదేవ తలగాని, భర్తనుదక్క పరపురుషులగాని పొందుటమహా పాపమిదునని పురాణమతము. మొత్తమున వ్యభిచారము దోషమిడకమానదని ఋషులంగీకారము. స్త్రీలకు భర్త దేవుడుగా నిర్ణయింపబడెను. అందుచే భగవంతుని అపర మూర్తి బ్రహ్మర్షి. అవతారపురుషుడు. సూర్యుడు. గాన వీరినిపొందిన దోషములేదని పురాణమతము. ప్రస్తుతము కలిలో బ్రహ్మర్షులరుదుగానున్నారు. వారిచే సంతతిగనుట కలియుగధర్మముగాదు. ప్రస్తుతము అవతారపురుషులులేరు, సూర్యుడు క్రిందికివచ్చుటలేదు. గాన వ్యభిచారము దోష

మనే నిర్ణయింపదగును. పులినిచూచి నక్కవాతపెట్టుకొన్నట్టు సర్వపాపహారులగు బ్రహ్మర్షులవలె శుష్కవేదాంతులు, అల్పులు, మహాపాపయుక్తులు, అగు ఆసురీసంపదవారు చెప్పువాక్యధర్మములు జనులాచరింపరాదు.

భూలోకసర్వవిధమతములలో చెప్పిన సద్ధర్మమార్గములకు, దుష్టమార్గములకు కొద్దిభేదముగా ఫలములు భారతమతగ్రంథములలో గలవని నాయూహ. భారతమతగ్రంథలన ఉపనిషత్తులు, వేద, స్మృతి. పురాణేతిహాస, దర్శనాదులు, భగవద్గీతాది సద్గ్రంథములు. భూలోకములో బైబిల్ మొదలగు మతగ్రంథములలో లేని నిష్కామమార్గము అనగా మానవుడు బ్రహ్మర్షిగా అనగా నిర్గుణస్వరూప భగవంతునికి అపరమూర్తియగు సగుణస్వరూప భగవంతుడుగా మారుమార్గము. భగవద్గీత, ఉపనిషత్తులు, పురాణేతిహాసాదులలో విపులముగా చెప్పబడినది. కాన యీభారతర్షిగ్రంథములలోగల లక్షణలక్ష్యములనే యీ భగవన్మతమునవ్రాసి తక్కినబైబిలాదిగ్రంథముల విడిచితినిచూడుడు.

క్రీస్తుమతము:- దేవునికుమారుడు యేసనుటలోనే దేవుడొకడున్నాడని బైబిలే చెప్పును. మహమ్మదీయమతము:- ఖురాన్‌లో అల్లాఅన దేవుడొకడేయనిగలదు. ఇందు పరసాధుమతముల ద్వేషింపక సద్గుణియై సాధుజనుల హింసించుటమాని భగవంతుని శాంతముగా ప్రార్థించుటలేక తనకు శక్తియున్నంతవరకు ఆపదలోనున్నవానివలె సంబోధన

నామములతో కేకలువేసి భగవంతుని అర్చించుటచే రక్షణ కల్గునని భావము. వీరు నమాజుచేయుచుండిన దాని భావ మిదియే. గాని భగవంతుని అంతటనుచూచు దివ్యదృష్టి యీకాలమునఉండుట మరింత శుభప్రదము. భారతమత మున గజేంద్రమోక్షము చదివినవారికి తెలియును. అంత టను భగవంతుని రూపముచూచుచు ప్రేమతో ఆపదలలో నున్న దీనతతో గజేంద్రుడు, శాంతముగాను ఆపదనుండు టచే కేకలలోను భగవంతు నర్చించినాడు. తన కేక భగవం తునికి వినబడి అతనువచ్చి రక్షించునని భావము. తనకు శక్తియున్నంతవరకు భగవన్నామముల పెద్దకేకలతో భగ వంతునిపిల్చుట లేక ప్రార్థించుట యీ పెద్దకేకల ప్రార్థనలో రెండవతలంపురాక అతనినే అర్చించుట జరుగును. మానవు డట్టి విధినర్చించిన రెండవతలంపు రాదని గ్రహించగలము. దీన భగవంతుని సర్వేంద్రియార్చన చేసినవాడగును. అవా జ్మానగోచరుడగు భగవంతుడు సగుణమూర్తియై అనగాకండ్లకు గోచరుడై గజేంద్రుని రక్షించినట్లును సాలోక్య, సామీప్య, సారూప్య, సాయుద్యపదవులలో ఇహమున సారూప్యపదవి అనగా గజేంద్రుడు విష్ణురూపత్వముతో నొప్పుచున్నట్లు భాగ వతమునకలదు. ఋషులు నేకులు భగవంతుని సంబోధన, నామ, నాట్యగానములతో అర్చించినట్లు భారతదేశ గ్రంథములు చెప్పు చున్నవి: క్రీస్తు, మహమ్మదీయ, బౌద్ధ, హిందూమతాలని ద్వేషింకొనుటేగాని ఆగ్రంథాలలో సత్యముగ్రహించి మానవు

లాచరించి ఫలము తేల్చుటలేదు. దాన ద్వేషమెక్కుడై యుద్ధాలకు, కలహాలకు, అసూయతకు కారణమగుచున్నది. ఆచారములలో కొన్ని భేదములున్నను, యీమహమ్మదీయ మతములో, మనమతములో బ్రహ్మమొకడే దేవుడు. అతనిని సత్యాహింసాది మార్గాల అర్చించిన మానవుడు ఇహపర సుఖములు చెందుటనికలదు. ఈమార్గానికి సరిపోవుచున్నది.

## క్రీస్తుమతము - దేవునికుమారుడు - క్రీస్తుపూజ.

క్రీస్తుపూజ మనలో దేవునికి అపరమూర్తియగు అవతారపురుషునిగాని బ్రహ్మర్షినిగాని అర్చించిన యెట్టిఫలమో అట్టి ఫలముగల్గును. అట్లర్చించు మార్గములనడిచి మన పూర్వీలు, నేడును అక్కడక్కడ కొందరు - ఫలములు పొందినట్లు, బైబిల్ మార్గాలనడిచి వానిఫలముపొందినట్లు, క్రీస్తువంటికీర్తివంతు డొకడున్ను, క్రీస్తుతర్వాతనున్నట్లు రమారమి రెండు వేలేండ్లలో పశ్చిమదేశాల గానరాడు. కొంతకాలమునకు మూతబడి నిష్ఫలమార్గము దేవుడులేడని ప్రకృతిశాస్త్రజ్ఞులు విజృంభించి నాస్తికమతవృద్ధిచేతురు. అది కొద్దికాలముండి సత్య, ధర్మ, అహింసాది మార్గములవిడిచి నడచుటచే తొందరలో నశించుట, భూలోకధర్మము. ధర్మాధర్మమార్గములు భూలోకాన నిత్యము సూర్య చంద్రులవలె తిరుగుచుండును. మూఢమార్గము రాదు.

---

## బౌద్ధమతము

ఇది సత్య, అహింసల నెక్కుడు బోధించును. ఇతర దేవుడు లేడు. బుద్ధునే పూజించుటగలదు. బుద్ధమత కాలము నుండి నేటివరకు సత్య, అహింసల ఆచరించిన ఫలము అనుతస్థులలో నొకడును పొందినట్లు చైనాది దేశాల మన దేశమున చరిత్రగానరాదు. దాన మన దేశమునుండి చాల క్రిందటనే వెడలిపోయినది. ఇతర దేశాల దాని ఆచరణ నామమాత్రముగా నున్నది. గాని సత్యాహింసల వీరు పూర్తిగా ఫలముగలుగువరకు ఆచరించిన యీమతము నామ మాత్రము కాకుండెడిది. ఏమతమునైన సత్య, ధర్మ, అహింసలు ముఖ్యముకదా! సత్యముచే నిత్యజయము. సర్వసత్కర్మఫలమును, అహింసచే సర్వజీవరాసులు అతని సన్నిధిని విరోధము విడిచి మిత్రతలో మెలుగుట.

## హిందూమతము లేక భారతమతము

హిందువన సాధుపురుషుడని మేరుతంత్రగ్రంథమున గలదుచూడుము. హిందూమతమన సాధు మతమని పేరు. అదియే భారత దేశమతము. ఇతరులు హిందువననాస్తికుడనియు సింధునదినుండి సముద్ర మధ్యస్థుడు హిందువనియును యింకాఅనేకరీతుల అర్థము చెప్పిరి. ఈమతమున అనేక దేవతల, దిక్పాలురపూజలు, సూర్యాదులపూజలు, చెట్ల నదులపూజలు, పర్వతరాజపూజలు, కృష్ణాదిపూజలు,

బ్రహ్మర్షుల పూజలు చేయు మార్గములు కలవు. సత్య ధర్మ, అహింసాది మార్గములవల్లగల్గు ఫలములుగలవు. గీతాది గ్రంథములలో హృదయకమలమున ప్రతి దేహధారి యందు దేవుడు అనగా మాయాదేవినిగూడిన పురుషుడు శరీరమును అంటక సర్వమునకు సాక్షిగానుండి సర్వమును నడిపించుచున్నాడనియు, అతడే అంతటను నిండి సర్వదేహధారుల ధర్మాధర్మముల పాలించుచున్నాడనియుగలదు. ఇట్లే బ్రహ్మమొకడే దేవునిడయు అతనిచే సర్వసృష్టి స్థితిలయములు జరుగుచున్నవని ఉపనిషత్తులు, పురాణాదులు చెప్పుచున్నవి. మొత్తమునకు ఒకడా యిద్దరా దేవులన దేవుడొకడేనని తెల్పినవి – అతనిని జేరుమార్గములు, అతడు మానవుని జేరి బ్రహ్మిగామారు మార్గములు అందువల్ల గల్గుఫలములు విపులముగా వ్రాయబడియున్నవి.

రామగీత॥ శ్లో॥ "సదైవముక్తోహ మచింత్యశక్తిమా: నతీంద్రియజ్ఞాన మవిక్రియాత్మకః। అనంత పాదోహమహర్నిశం బుధై। ర్విభావితోహం హృది వేదవాదిభిః" ॥ అచింత్యశక్తి వంతుడు, అనంతపాదుడు, రాత్రింబవళ్ళు వేదాంతజ్ఞులచే హృదయముచే ప్రార్థింపబడువాడు ఎవడో అతడు నేనే అని రాముడు అగోచర భగవంతునికి తనకు – అభేదముగా చెప్పినాడు. అనగా సగుణబ్రహ్మరాముడనియు, నిర్గుణబ్రహ్మము హృదయవాసియగు భగవంతుడని తేలినది. ఇతడే అంతట ఆవరించియున్నాడని ఉపనిషదాదిగ్రంథాలగలదు. వీరిద్దరిలో

నెవని పూజించినను ముక్తిగల్గునని భావము. లనగా సగుణో పాసకుడు మొదటవిష్ణురూపముజెంది సర్వసౌఖ్యము లనుభ వించుచు అతని కాలానంతరము నిర్గుణబ్రహ్మమును జేరుచు ననికలదు. అది సర్వసౌఖ్యస్థానము నిర్గుణోపాసకుడు సరా సరి బ్రహ్మమునే జెందునని గలదు.

భగవద్గీత॥ అనగా భగవంతుని వాక్కు అని అర్థము. కృష్ణుడవతారపురుషుడు అనగా సగుణబ్రహ్మము. తన నెట్లు పూజింపవలెనో పూజింపఫలమేమిగల్గునో వివరముగా గలదు. ఈకృష్ణుడు తన్నుపూజింపమానినవారు, శ్లో॥ ఈశ్వరసర్వభూతే భ్యోహృద్దేశేర్జునతిష్టతి। భ్రామయన్ సర్వరూపాని యంత్రా రూఢానిమాయయా। తమేవశరణంగచ్ఛ సర్వభావేన భారత। తత్ప్రసాదాత్ పరాంశాంతిం స్థానంప్రాప్స్యసిశాశ్వతం॥ భగ వంతుడు తన మాయాదేవితో ప్రతిదేహధారి హృదయ మందున్నాడనియు అతనిపూజించిన ముక్తుడగునని చెప్పెను. దీనింబట్టి నిర్గుణబ్రహ్మమొకడే దేముడని తేలినది. అతనికి అపరమూర్తి కృష్ణుడని సగుణోపాసన చెప్పబడినది. విష్ణుని చేరినవాడు నిర్గుణబ్రహ్మమును చేరగలడని అభిప్రాయము.

పై నాల్గుమతములు లోకములో గొప్పమతములు. బౌద్ధమతము తక్క తక్కినవి దేవుడొకడున్నాడని చెప్పు చున్నవి. బౌద్ధమతమును సత్యాహింసాదులు బోధించు చున్నవి. ప్రకృతి సత్య, అహింసలు సామాన్య ఫలమిడి మానసికకష్టము కల్గించుచుండును. సామాన్య అహింసా

ప్రాణమున పరులకు తాను అపకారములు చేయకపోయినను దుష్టులగువారివల్ల కష్టములు, అవమానములు పడిరి. ఉ॥ బౌద్ధులు. భగవంతుని పూజించుచు సర్వమును దేవునిగా జూచుచు ఆదృష్టిలో పరులకు ధన విద్యాదులు దానము చేయుచు ఆదృష్టితో ఆహారాదులుతినుచు ఆదృష్టితో పశుల జూచి యజ్ఞములు రాజ్యపాలన వర్తక వ్యవసాయాదులు చేయుచు సత్యా, అహింసామార్గముననున్న వానికి సత్యముచే నిత్యవిజయము, అహింసచే సర్వవిరోధములేక సర్వమిత్రత్వ గల్గి ఎట్టిబాధలు యిహమున జెందక నిత్యసుఖమిడి తుదను కైవల్య సుఖములుగల్గును. ఈప్రకృతివికృతి సత్యపాలనయే శ్రేష్ఠమని భగవన్మత సిద్ధాంతము. పూర్వర్షులనేకు లాచరించి సర్వసౌఖ్యములొందిరి. నేడాచరించినవారును పొందగలరు. ప్రస్తుతపాశ్చాత్యులు ప్రకృతిసత్యమునే ఆరాధించి సామాన్యయిహసుఖము నందుచున్నారు. దీనిపైవీరు వికృతి సత్యము నారాధించిన సర్వసౌఖ్యముల ననుభవింతురు. దేవుని విడిచిన సత్యాహింసామార్గమగుట మొదటి కొద్దికాలము ప్రబలి కొలదికాలములోనే బౌద్ధమతము భారతమును విడిచినది. ప్రకృతిసత్యము కనుగొనుచున్న పాశ్చాత్యులు జగన్నాశనకర యుద్ధములుచేయ సిద్ధపడుచున్నారు. ప్రకృతి వికృతి సత్యముగ్రహించిన ప్రహ్లాదుడు దుష్టరాక్షసుల సన్మార్గులజేసి సర్వసౌఖ్యముగాపాలించినాడు. గాన భూలోక సర్వదేశస్థులీ ప్రహ్లాదమార్గమున చరించిన తమ గృహ

రాజ్యమున, సర్వసౌఖ్యము లనుభవింపగలరు. ప్రస్తుతము భారతదేశానప్రకృతి, సత్య, అహింసామార్గస్థులు చాలమంది గలరు. దానసామాన్యఫలము నందుచున్నారు. దీనికివికృతి, సత్య, అహింసలకల్పి ఆచరించిన సర్వసౌఖ్యము లొందగలరు.

తక్కిన భూలోకమతములన్నియు పైమతాలలోగల కొన్ని సన్మార్గములనే బోధించుచున్నవనినాయూహ. నిష్కామసన్మార్గము భారతమతమునతప్ప యితరమతగ్రంథముల నామమాత్రమున్నదాఅని అనదగియున్నది. ఒకవేళ యున్నదని కొందరుచూపించినను ఆమతములలో ఆచరించిన ఫలము జూపినవారరుదు. భారతమతములో పూర్వమున విశేషము గను, నేటికలియుగాన అక్కడక్కడను ఆచరించి ఫలము బొందుచున్నవారుగలరని నాయూహ. నిష్కామసన్మార్గము మోక్షమును, సకామసన్మార్గముస్వర్గమును, దుర్మార్గము నరకమును గల్గించును. ప్రతిమతమున సత్యము, అహింసా మొదలగు మంచిధర్మము లుండదగునని బోధించునుగానిఇహ ఫలము చెప్పబడలేదు. భారతమతమున ఇహఫలము చెప్పబడినది.

ప్రస్తుతము మనదేశముపాలించు నెహ్రూజీ, రాజేంద్రప్రసాదులు మతద్వేషములేనివారు. సర్వమతస్థుల గౌరవింతురు. కాన భూలోకసర్వదేశాధ్యక్షులు మంత్రులు వీరివలె మతద్వేషములు మానుటఅభ్యసించి ప్రజలకు బోధించుచు తమమతగ్రంథములు, యితరమతగ్రంథములుచదివి అందుగల

భేదాభేదములు గ్రహించి భేదముగలచోటసమత్వముగ్రహించి సమత్వమున, సమాత్వముజెందిన సర్వసమత్వ మేర్పడును. ప్రకృతి ఆచారములలో భేదము కన్పించునుగాని, వికృతి అనగా భగవదర్చనలో సర్వమతములు ఒకటేమార్గమున నున్నవి. చదివినవారికి తెలియును. చదువుకొననివారు చదివినవారివల్లవినిన తెలియును. సత్యమెన్నటికైన బయట పడకమానదు.

ప్రస్తుతము కొన్ని దేశాలమతము, పేదవారు, ధనవంతులని మానవులను వేరుచేయుట. ధనవంతులు పనికిరారు. గృహస్థులకు కూడుగుడ్డలుగడచు ఆస్తిమాత్రముఉండుటయే. ఎక్కువయుండరాదు. రాజ్యపాలకులు దర్జాలు, సౌఖ్యములు అనుభవించుట. ఇందు దేహసుఖముమాత్రము కొందరికి యెక్కువగలదు. దేవునిపూజించుటలేదు. ప్రస్తుతము కొన్ని దేశాలమతము, ధనవంతులకు యెక్కువ గౌరవముగలదు. పేదవారికి గొప్పగౌరవములేదు.

గృహస్థులెంతెంత ధనార్జనచేసుకొన్న చేయవచ్చును. ప్రకృతి సత్యము గనుగొనునంతశ్రద్ధ దేవునిదర్శించు మార్గముల నడచి సత్యము కనుగొనుటలో చాలతక్కువగాగలదు.

భారతమతము:— పేదవారు ధనవంతులని భేదము లేదు. పేదవారైన, ధనవంతులైన నిష్కామసన్మార్గులన్న, సకామసన్మార్గులన్న గౌరవము. పేదవారైన ధనవంతులైన దుర్మార్గులన్న గౌరవములేదు. దేవునిపూజించుమార్గములు

హరికథాది అనేకరూపముల ఒనులు వినుచుందురు. కొందరాచరించుచునే యుందురు. ఫలము తేల్చువారెక్కడెక్కడ యుండకమానరు. యెన్నిమతములు పాలించినను భారతమతము నశించక సజీవియైయుండుటకు హేతువు, ప్రకృతిసత్త్వముకన్న వికృతిసత్త్వము గొప్పదనియు దాని సత్ఫలము లప్పుడప్పుడు గనబడుచుండుటయే అయియున్నది. భూలోకములో ప్రకృతిసత్త్వవాదులవల్ల ధనముగల్గుట, దుష్టాహారవృద్ధియగుట. జగన్నాశనకరమగు ఆయుధసృష్టి దుష్టాహారముచే అనారోగ్యముగల్గుట దానిని బాగుచేసికొనుటలో మానవుడు కాలముపుచ్చుట గన్పడుచున్నది. ప్రకృతి వికృతి సత్యవాదులవల్ల — ప్రకృతి అన లక్ష్మి, వికృతి అన భగవంతుడు. ఈ స్త్రీ పురుషరూపుడగు భగవంతు నర్చించుటచే సాత్త్వికభోజనములుగల్గి పరమతాచి ద్వేషములువిడిచి రోగహీనులై ఇహపర సౌఖ్యములు చెందిరి. చెందుచున్నారు. చెందగలరు. గానభూలోకములో ప్రతిగృహస్థుడనురాజు, తన యింట, తనరాజ్యమున ప్రకృతి, వికృతి స్వరూపుడగు భగవంతు నర్చించుట, పరమతద్వేషములు విడుచుటచే సర్వ సౌఖ్యములు గల్గునని ఆచరించుచు, బోధింపదగును. తన తప్పక సర్వసౌఖ్యములుగల్గునని, భారతమతాభిప్రాయము.

భారతమున శాంతిపర్వము :— కృతయుగమున అందరు బ్రాహ్మణులు. అనగా బ్రహ్మజ్ఞానులు అనిగలను. పై రీతి ప్రకృతి వికృతి స్వరూపుడగు భగవంతు నర్చించి

సౌఖ్యములందిరి. ప్రస్తుతము కలియుగమున ఆచరింపువారు తక్కువ యగుదురనిగలదు. ఆచరించిన యీయుగమునను కృతయుగమువలెనే ప్రకాశించుననికలదు.

బ్రాహ్మణుడన ప్రతివస్తువును భగవంతునికి అర్పించువాడు. ప్రతి వస్తువును దేవునిగా జూచువాడు. ఇట్లు చేయువారు గృహస్థులలోను, ఋషులలోను చాలమందిపూర్వము గలరు. రాజులలో భాగవతమున అంబరీషుడు మొదలగు రాజులనేకులుగలరు. ఓమనుష్యుడా! ఈమార్గము నీకున్న జ్ఞానముతో సత్యాసత్యము విమర్శింపుము. సత్యమని తోచిన ఫలముకల్గువర కాచరింపుము. దాన ఇహపరసుఖములు గాంతువు నీవుఈమానవరూపమున భూలోకములో నెక్కువ కాలముండవు. నీవెక్కడనుండి వచ్చితివో యెక్కడికిపోదువో అనుప్రశ్న నీకుగల్గిన ఈనీగురహంకారము నశించి యీలోకము నుండుట నిత్యముగాదని గతమును విచారించక ముందుసుఖమునకు, ప్రస్తుతసుఖమునకు నీకు మార్గముకన్పడను.

స్త్రీ పురుషులవల్లనే మానవ సృష్టిగల్గుట నిజమే. అదిశుక్రశోణిత సంయోగమున కల్గుచున్నది. అదిఅన్నమున అది భూమి పండుటను, అది వర్షసహాయమున అది సూర్యునివల్ల గల్గుచున్నది. అనగా జీవుడు సూర్యుని దగ్గర నుండి వచ్చుచున్నాడు. పోవుచున్నాడు. ఇది ప్రత్యక్షము, ఆసూర్యుని వద్దకు యితర లోకాలనుండి వచ్చుచున్నారనియు సర్వలోకపాలకుడు గలడనియు గ్రంథములు చెప్పుచున్నవి.

ఇది తక్షణము ప్రత్యక్షముగాకున్నను యెక్కువ కాలము కృషిచే అట్టిదేవుని, దేవతల చూచినామనువారు మన దేశమున, యీమధ్యకాలాన రామకృష్ణపరమహంసాదులుగలరు. ఆమాటలునమ్మి 'శాస్త్రార్థ సత్యమార్గమునపోయిన కొంత కాలమునకు దూరమునఅగోచరముగానున్న దేవుడు గజేంద్రునికివలె ప్రత్యక్షము కాకమానడని లోకైకమతసిద్ధాంతము, మొత్తమున మనభారతమతమున అన్నిమతాల సత్యమార్గములు గలవని నాయూహ. భారతీయులు మన మతగ్రంథాలను పరమతగ్రంథాలలో కల్గినమార్గములు లేనిమార్గములు చూపిన ద్వేషము ఉభయులకు నశించి సఖ్యతగల్గును. భూలోకసర్వమతగ్రంథాలగల సామాన్య ధర్మములుగాక జీవన్ముక్తికిసాధనమగు సద్ధర్మము భారత మత గ్రంథాలలో లేవనువారికి నేను ఆధర్మముల భారతమత గ్రంథాల చూపింపగలను. సత్య, ధర్మ, అహింసాదిమార్గములు ఆచరించిఫలముచూపిన, రాజుల, ఋషుల చరిత్రల వంటి చరిత్రలు పాశ్చాత్యదేశ, మహమ్మదీయ దేశచరిత్రల లేకుండుటను పరమతగ్రంథధర్మములన్నియు భారతమత గ్రంథములలో కలిగియుండుటను మానవుడు బ్రహ్మర్షియగు మార్గము భూలోకయితర మతగ్రంథాలలేకుండటను భారత మతగ్రంథములను, చరిత్రలను ఆధారముగావ్రాసితిని.

ఇంతమాత్రమున భారతమతమునకే గొప్పగల్గెనని యితరమతస్థులనుకొనక ధర్మాధర్మఫలముల మాత్రమే గ్రహించి తామాచరించినతత్ఫలము జెందగలరు. మాన

వుడు బ్రహ్మర్షి గాఅన భగవంతునిగా మారుమార్గము భూలోకయితర మత గ్రంధములలో ఉన్నదని కొందరు చూపించినను ఆచరించి ఫలము జెందినవారు భారతదేశమునకలరుగానియితర దేశాలలో అరుదనదగును. క్రీస్తుమహమ్మదుల తరువాత అట్టిగొప్పవ్యక్తులు మరలపుట్టలేదు. గొప్పధర్మములు జనులకు తెలుప ఉద్దేశముతో యిదివరకున్న మతనామములు మాని భూలోకమున అందరికి సరిపోవుమార్గమునకే భగవన్మతమని పేరిడితిని. గాని యిందెంతమాత్రము అతిశయోక్తి లేదు.

## సామవేదము - గూఢారుణికోపనిషత్తు.

"బ్రహ్మచర్య మహింసాచ సత్యం చాపరిగ్రహం, యత్నేన హేరక్షత హేరక్షత హేరక్షతేతి" బ్రహ్మచర్య, అహింసా, సత్యాదులు - ఓమనుష్యులారా యత్నముచే రక్షించుకొనుడు రక్షించుకొనుడు. రక్షించుకొనుడు. భారతదేశ షట్దర్శనములు, షట్శాస్త్రములు, శృతి, స్మృతి పురాణేతిహాసములు, వేదములు, ఉపవేదములు, ఉపనిషత్తులు, మరియు ఋషికృతములగు గ్రంధములు యీభగవన్మతమునకు ఆధారములు. ఇందాచరించిన ఫలమిదు అర్ధము గ్రహించి పడమట దేశ సైన్టిష్టులవలె ప్రత్యక్షఫలము చెందువరకాచరించునది. "భూభూతసంబంధమగు" వస్తుసంయోగమునగల్గుఫలము పాశ్చాత్యసైన్టిష్టులెక్కడు కనుగొన్నారు.

మనపూర్వులు అట్టిప్రకృతిసత్యమును భగవద్ధ్యాన జపాదులు అన ఆకాశజనితధ్వనిశబ్ద సంయోగఫలము కనుగొనిరి. అందు అగోచరులగు దేవతల, దిక్పాలుర బ్రహ్మ, విష్ణు, శివుల దర్శించుట, భాషించుట మరియు సర్వేశ్వరుడగు బ్రహ్మము నైక్యసిద్ధిచెంది బ్రహ్మర్షిగామారుట గల్గినట్లు వ్రాసిరి. యిది "ఆకాశభూతిసంబంధము"

"జలభూతమున" స్వచ్ఛజలస్నానాదులచే మహాపాపముల బాపుకొని బ్రహ్మజ్ఞానులయినట్లు వ్రాసిరి "అగ్నిభూతమున" యజ్ఞాదుల హవ్యాదులతో హోమములు జేసి దేవతల యింద్రాదుల దర్శించినట్లు వ్రాసిరి. "వాయుభూతమున" కుంభకాదియోగాదులతో ఆయుర్వృద్ధి, రోగరహితము, యోగసిద్ధి, బలముకల్గినట్లు వ్రాసిరి. భూభూతమున పంశుద్ధభూమిపంటలు, ఫలములతో రోగరహితాహారము, బలము ఆయువు చెందిరి. మరియు పుణ్యభూముల చరించిన సర్వపాపములుహరించి సుజ్ఞానము కల్గినట్లువ్రాసిరి. ఇట్టిస్థితి పరమతగ్రంథాల బహుస్వల్పముగా గలదని నాయూహ.

భగవద్గీతాదులు లక్షణగ్రంథములు — పురాణాదులు లక్ష్యగ్రంథములు. లక్షణప్రకారమాచరించిన లక్ష్యము పొందినట్లు పూర్వముజరిగినచో మనమాఫలమందువరకు, యేఅర్థప్రకారమాచరించి పూర్వులా ఫలముజెందిరో ఆమారము గ్రహించినగాని ఆఫలము గల్గదు. ఈగ్రంథము లబద్ధ

మనువారు తామాచరించిన మార్గము వెల్లడించి పెద్ద జీతుల, కవులవద్ద విమర్శకుపెట్టిన సత్యమార్గము భారత దేశజులు చెప్ప లేని కాలమింకనురాలేదు. ఈ గ్రంథము లబద్ధమంవారు తమసత్యమార్గములనైన వెల్లడింపదగును. వెల్లడించుట లేదు. వెల్లడించిన అన్యాయము, అధర్మము నాస్తికము అగు మార్గము తమదని ప్రజలు తెలిసికొందురని వెల్లడించక గ్రంథములు మాత్రము మంచివికావందురు. కొందరికి పురాణములు మంచివి, కొందరికి వేదములు కొందరికి యితర గ్రంథాలుమంచివి. మాకు ప్రకృతి వికృతి సత్యఫలమిచ్చు సర్వ గ్రంథాలు మంచివే. ఇహపరసౌఖ్యములేక నిష్ఫలమిచ్చు గ్రంథాలు చదువరాదు. కాదని చదివెడువారు ఇహపరసుఖములు పొందక నానాకష్టములపాలగుదురు. భారతమతగ్రంథములలో ఆచరించిన ఫలమిడనిచో విశ్వామిత్రునివలె మరల మరల అర్థముచెప్పి ఆప్రకారమాచరణ బహిర్గియగువరకు చేయుటేకాని మానరాదు. దాన యీమార్గస్థునిచే పరులకెట్టి యుపకారము సాధారణముగాయుండదు.

## మా అభిప్రాయము

మన దేశగ్రంథాలుగాని బైబిల్, ఖురాన్, బుద్ధమతాది గ్రంథాలుగాని ఆచరించిన ఫలమిడు గ్రంథమార్గము లన్నిటిని అంగీకరింతుము. ఫలము లేనిచో వదలుకొందుము. ఆ అర్థములో తప్పైన మరల అర్థముచెప్పి మరలఆచరించిన ఫలము లేనిచో వదలక మరల ఆచరించునది. ఋషులు

సత్యవంతులుగాన వారిగ్రంథములు అసత్యప్రాతంబుగావు. తప్పక ఆమార్గములు సత్ఫలములిడును. అనుభవనీయులైన పెద్దలవద్ద అర్థము చెప్పించుకొని ఆచరించిన తప్పక ఫలించును పైవేదమునకు పతంజలి, ఫలమిదు అర్థము చెప్పినాడు.

పతంజలి సూత్రములు (దర్శనము) "బ్రహ్మచర్యప్రతిష్ఠాయాం వీర్యలాభః" బ్రహ్మచర్యం అని భగవంతుని ధ్యానజపాదుల శ్రద్ధతో నిత్యముచేయువానికి పరిశుద్ధశుక్ర వృద్ధియగును. దాన పూర్ణాయువు గల్గును. శుక్రము లేని వారికి ఆయుర్వృద్ధిగాదు. శుక్రము శరీరికిగోడవంటిది. గోడల మధ్యనున్న దీపము ఆరిపోవనియట్లు పరిశుద్ధశుక్రావరణలో నున్న జీవుడు ఆయువు పోగొట్టుకొనడు. "శరీరమాద్యంఖలు ధర్మసాధనం" గాన శరీరమున్నగాని ధర్మమార్గమున నడచి సత్ఫలము చెందలేడు. భగవద్ధ్యానాది సత్కర్మములు విడిచి దుష్టాహారముచే శుక్రమువృద్ధిచేయువాడు దుర్మేధగల్గి నానారోగములతో బాధపడుచు అకాలమృత్యువు చెందును. కాని పూర్ణాయువుపొందడు. పొందిననూ జ్ఞానహీనుడు అసౌఖ్యవంతుడుగానుండును. గృహస్థబ్రహ్మచర్యమున అనగా భగవద్ధ్యానాది సత్కర్మములుచేయుచు సాత్వికాహారము తినుచు భార్యతో ఋతుకాలమునమాత్రము సంయోగ యజ్ఞముచేయువాడు పూర్ణాయువుచెందును. గృహస్థబ్రహ్మచారులు వసిష్ఠాదిఋషులు, నైష్ఠికబ్రహ్మచారులు హనుమద్భీష్మాదులు.

ఆగ్రంథముననే "అహింసాప్రతిష్ఠాయాం తత్సన్నిధౌ వైరత్యాగః" సత్యమైన అహింసమార్గస్థునిదరి విరోధము చేరలేదు. అనగా విరోధజంతువులు వైరమువిడిచి స్నేహమున తిరుగును. ఈలక్షణమునకు తగిన ఫలము రామాయణ భారతాదిగ్రంథముల కణ్వాది ఋష్యాశ్రమముల విరోధ జంతువులు అనురాగమున చరించినట్లు గలదు.

బుద్ధమతములో సత్యాహింసలు మొదటకొందరాచరించినను, నీచాచారులు, ఆసురీసంపద జనులందులో ప్రవేశించుటచే అసత్యహింసలు వర్ధియై ఆమతము నశించినది. బౌద్ధమతము పోయినదన్నారుగాని సత్యాహింసాదిధర్మమార్గము లెన్నిమతములు పుట్టినను మారవు. సర్వకాలముల అనకృతయుగాదుల కలియుగమున సమానఫలమునే యిచ్చుచుండును. మతకర్తలు, సంఘకర్తలు, యితరులు ఏకాలమునను వాటినే ఆచరింపుడని చెప్పుటజూడ యింతకన్న సత్ఫలమిడు మార్గాలేలోకాన లేవు. భగవన్మతము భూలోకమంతటికి ఒకటేగాన వాటి ఫలముగల్గువరకు ఆచరింపుడని చెప్పను. డాంభికాచరణ యేమతమైన ఫలమిడదు. గాన మానవుడు పట్టుపట్టిన విశ్వామిత్రునివలె నేడును జయము పొందగలడు. సర్వమును దేవునిగాజూచుటగాని, పురుషులను తండ్రిగురువులవలెను, స్త్రీలను తల్లి చెల్లెలు, అక్కలవలెను; యితరములగు క్రిమి, కీటక, గోవ్యాఘ్రాది, మార్జాలమూషకాదులు తనకు సాయపడు ముఖ్యస్నేహితులవలె

గాని, పుత్రులవలెగాని; పరమాణువులు, స్త్రీలు, జంతు
జాలము కనబడకుండా జూడనేర్చినవాడే సిద్ధిగాంచగలడు.
ఈదృష్టిగలవాడు అపకారముచేయలేడు, అపకారము నొంద
లేడు.

బృహస్పతి స్మృతి:—సాధువు భక్షించునీరు ఆహార
మందున్న జీవులు వానిలో ప్రవేశింప సంతోషించు చున్నవి.
దుష్టమతిను ఆహారజీవులు ఏడ్చుచున్నవనిగలదు. "అన్నం
రుదతి" దుష్టమతినుఅన్నము, ఏడ్చుచున్నదనుటఅన్నములో
గలజీవులని అర్థము. ప్రహ్లాదుడీ దృష్టినభ్యసించుటచే వాని
విరోధులగు రాక్షసులు బాధించి బాధించి విరోధము వదలి
మిత్రులైరి. ప్రహ్లాదుడు వారి క్రూరకర్మములచే నెట్టిబాధలు
పొందలేదు. పూర్ణముగ ప్రహ్లాదుని చంపనెంచిన తండ్రి
యగు హిరణ్యకశిపుని భగవంతుడగు విష్ణువు నశింపజేసెను.
కాని ప్రహ్లాదుడు చంపలేదు. ఇతడు దివ్యజ్ఞానసిద్ధుడు.
కణ్వాది ఋషులు ఇందు సిద్ధులగుటచే దుర్మార్గ సన్మార్గ
జంతుజాలముచే నెట్టిబాధ తమకుండక వాటికి వారి దర్శనా
దులచే బాధలుకల్గకుండా చేయగల్గిరి. మొత్తమున భగవ
ధ్యానజపాది సత్కర్మములుచేయుచు సత్యాహింసాది మార్గ
స్థులకే పైపూర్ణఫలము కల్గునుకాని అట్టిఆచరణలేక సత్య
ధర్మ అహింసలు మంచివనిచెప్పుచు ఆచరించువారివలె దంభా
చరుణులగువారికి మొదటకొద్ది లాభమున్నను తుదకు నానా
దుఃఖములిడును. భూలోకములో ఎన్నిమతములవారు చెప్పి
నను అహింసకు ఇంతక్షమించినఫలముండదని నానిర్ణయం.

## సత్యము

పతంజలిసూత్రము:—"సత్యప్రతిష్ఠాయాం క్రియాఫలా శ్రయత్వమ్" సత్యాచరణపరులకు సంన్యసత్కామనిష్కామఃకర్మ ఫలమిచ్చును. ఉ॥ హరిశ్చంద్రుడు చండాల కింకరుడయ్యు తన జాతి సత్కర్మత్యాగియై ఇతర ధర్మమున నిష్కాముడై చరిం చుటచే యిహపరసౌఖ్యమునందినట్లు గలదు. ప్రకృతి సత్య ముచే లక్ష్మియు ఆరోగ్య ధనాది లక్ష్ములు గల్గుటయు ప్రకృతి వికృతి సత్యముచే భగవంతునియొక్క లక్ష్మియొక్క కృపకల్గుట జరుగును. కొందరు తల్లిని పూజించుచున్నారు. కొందరు తండ్రిని పూజించుచున్నారు కొందరు తల్లిదండ్రులను పూజించుచున్నారు. వారువారు తగినఫలము పొందు చుందురు. ఇట్లే పరమేశ్వరీ పరమేశ్వర పూజాఫలముకలుగు చుండెను. "సత్యేన లోకాన్ జయతి" సత్యముచే లోక మును జయించును. సర్వలోకప్రభువగు పరమేశ్వరిలోనుండు పరమేశ్వరుని. సత్యమార్గము నర్చించువాడు తండ్రి ఆస్తిపై కొంతకాలమునకు పుత్రునికి పెత్తనముకల్గినట్లు బ్రహ్మర్షియై సర్వలోకముల ధర్మకళ్యాణమార్గమున పాలించు శక్తివంతు డగును. (కలియుగమున భూలోకములో మతముల పేరిట ఆచా ర్యులై కొందరు, రాజులైకొందరు, కొందరికి కష్టములు కొంద రికి సుఖములు కలుగజేసి తాముమాత్రము సమస్తసంపదలు జెంది నిరంకుశులై ఇహమున స్వసౌఖ్యములు అనుభవించిరి.

రాజుకన్న ప్రజానాయకుడు గొప్పవాడని రాజు ప్రజలు ఆమతా చార్యుని పూజించిరి. సత్యధర్మపాలకుడగు రాజర్షికన్న సత్య ధర్మనామాంతరం బ్రహ్మర్షి అధికుడు. అతడే సర్వమునకు సంపత్తు అని పురాణమతము. కలిలో జరిగినది. రాజ్యభ్రాం తిచే గొప్పమతకర్త అనిపించుకొనే భ్రాంతిచే పూర్ణసత్యము విడచి తమ ఇష్టమువచ్చినట్లు పరుల బాధించిరి.

ఉ॥ ఔరంగజేబు హిందువులపై, శివాజీ మహమ్మదీయు లపై మతకారణములచే అసూయగలవారైరి. రెండుమత ముల ఆచారముల కొద్దిభేదమున్నను సత్యధర్మ అహింసలు అన్నిమతముల ఒకటియే అన్నమాట. వారు ఉభయులు గ్రహించిన అట్టి కలహములు జెందయుండరు. ఇట్లు ఎందరో గతించిరి. విష్ణుమతము, శివమతము, దేవీమతము, గణేశ మతము, సూర్యమతమని ఇట్లు అనేక మతములతో హిందూ మతము భిన్నము చెందబడియున్నది. కాని ఆయాగీతాగ్రంథ ములన్నియు దేవుడొకడేయని అనగా అంతయు విష్ణువు అన్నచో యితరులు లేరుగదా! అప్పుడు దేవుడు ఒక్కడే అయ్యెను. ఇట్లేశివ, గణేశాది మతాభిప్రాయము అనిగ్రహిం చిన ఒకేమతము అగును. గీత, ఉపనిషత్తులు, పురాణములు ఇట్టిరీతినే చెప్పుచున్నవి.

భూలోకములో నానావిధమతములవారికి కర్మేంద్రియ ములు, జ్ఞానేంద్రియములు, అంతరేంద్రియములు, హృదయ మున జీవుడుండుట సమానమేగదా. అందరు వాటితోనేగదా

దేవుని పూజించుట. ప్రకృతియనగా మాయా దేవి. ఆమెతో గూడిన భగవంతుడని నిర్ణయిస్తిమి. అంతట నిండియుండి సర్వమును పాలించువాడు. దేహధారిచేయు సర్వమునకు సాక్షిగాను, కర్మఫలమిచ్చుటకును, సర్వదేహధారి హృదయముల శరీరమునంటక నివసించియున్నాడు. అతనికే ఇంకా అనేక నామములు గలవు అతనిని దుర్మార్గమునగాక నిష్కామమార్గమునో, సత్కామమార్గమునో, భక్తిజ్ఞానముల, సత్కర్మముల, సేవించుచు, అనగా ప్రేమతో భగవంతుని అంతటనుచూచుచు, సత్కర్మఫలము అతనికి, అర్పించుచు అంతరేంద్రియములద్వారా జప, స్తోత్రాదులతో అర్పించుచు సాధువులకు ఉపకారముచేయుచు సామాన్యమార్గులకు నీతి బోధించుచుండవలెను. (పూర్ణదుర్మార్గులు అనగా రాజైజనసహాయముగల దుర్యోధనుని వంటివారు ఏమిచెప్పినను వినరు.)

వారిని దేవుడు, రాజ్యమేలువారే శిక్షింపవలయును. ఇతరమార్గములచే వారు ధర్మమార్గమున బడరు. గాన వారి మార్గశోధల విడచునది. ఇతరసహాయము లేని పూర్ణదుష్టుడగు వాల్మీకి నారదోపదేశమున దుర్మార్గమువిడిచి బ్రహ్మర్షియైనట్లు, పరసహాయము లేని పూర్ణదుష్టులు ఒకప్పుడు ధర్మమార్గమునబడి సౌఖ్యపడుదురు. న్యాయమార్గమున ధనార్జనచే కుటుంబపోషణచేయుచు సాధు స్త్రీని వివాహమ్మాడి గృహస్థుడై లోకోపకారముచేయు మహాత్ములు, మహాత్మరాంద్రు

అగు సంతానమును తనకు, లోకకళ్యాణమునకు గనుచు పైట కొలదికాలము సాధువులతో గడపుచు, సత్య, అహింస, శమ, దమ, శౌచ, క్షమాది సన్మార్గముల వాటి ఫలము గల్గువరకు ఆచరించుచు రాజ, సేవ, వర్తక, వ్యవసాయాది వృత్తులలో నిష్కామసన్మార్గమున చరించుచు (లంచగొండి తనము దుష్టవృత్తులువిడిచి) బ్రహ్మర్షియని తన్ను సాధుజను లంగీకరించువరకు అనగా సర్వశక్తివంతుడు తానగువరకు అన తనబలము తనకు తెలియుచుండును. వట్టినే దేవుడని తాననుకొనుటకాదు.) భగవంతుని యందెట్టి శక్తిగలదని శాస్త్రనిర్ణయముగలదో అట్టిశక్తి తనకుగల్గువరకు బ్రహ్మో పాసన భూలోకప్రతిమానవుడు, ప్రతిస్త్రీ చేయుటే భగవన్ మతము. మతము లెన్నిమారినను జాతులెన్నియున్నను కుల ములు, సంఘములు ఎన్నిమారినను సత్య, అహింసాదిమార్గ ములు మారవు. గాన వాటిపైనడచుచు భగవంతునిగూర్చ జపతపోవృత్తినున్నగాని మానవులు బాగుపడరు. గాన భూలోకసర్వమానవులు మతద్వేషములు, జాతి, కుల, సంఘ ద్వేషములుమాని సంఘములుగానుండక యెవరికివారే సత్య, అహింసాదిమార్గముల వాటిఫలము గల్గువర కాచరించుచు, భగవంతునిపూజించుచు కాలముగడుపుటే భగవన్ మతము. హిందుమతసారమె భగవన్ మతము. ఏదోమార్గమున భూలో కములో యేదోమూల కొద్దిప్రదేశమును పాలించుటకో, ఆరాజ్యమున కోట్లకొలది ధనార్జనకో మానవుడూహించి

మతము పేరిట, సంఘము పేరిట సంచరించి ధనకీర్తులు సంపాదన చేయుచున్నాడేగాని తానున్నమత సంఘములలోగల సన్మార్గఫలము. దనకు గల్గువరకు ఆచరించుటలేదు. అట్లైనను కొంత బాగుండెడిది. మానవుడు రాజ్యము సంపాదించినను కోట్లార్జించినను, ప్రొద్దున్న, సాయంత్రము సోలెడుఅన్నము కన్న తినజాలడు. దుర్మార్గుడగువాని ధనము, రాజ్యము తొందరలో పరులపాలగును. రాజ్యమున్నవాడును, ధనవంతులును నిష్కామసన్మార్గమున రాజ్యపాలనచేయుట తనకై, పరులక్షేమమునకై నిష్కామముగా ధనమువ్యయముచేయుట గల్గిన సోలెడు అన్నము తింటూ లోకకళ్యాణము చేసినట్లే అయి జీవన్ముక్తినిడును. ఇది మంచిప్రారబ్ధము గలవారికి జరుగుచుండును. వీరే గీతలో చెప్పిన కర్మయోగులని నా యూహ. బలహీనప్రారబ్ధముగలవారే పేదలు. వీరే గీతలో చెప్పిన సాంఖ్యులని నా యూహ. ఈపేదవారును తన్ను, తన కుటుంబమును న్యాయార్జితధనముచే పోషించుకొనుచు నిష్కామముగా పరోపకారము, జ్ఞానదృష్టిచే చేయుచున్న వీరును జీవన్ముక్తి అనగా బ్రహ్మసిద్ధిత్వము చెందగలరు. ఈభగవన్మార్గమున సంఘములు పనికిరావు. రాజ్యభ్రాంతిలేదు. దుర్మార్గమున నడువరాదు. ఈభగవన్మతమార్గములు విని ప్రతి గృహస్థుడు తాను, భార్య, పిల్లలు గృహముననుండి నడచుకొని దాని ఫలముపొందుటేగాని వేరుమార్గము లేదు. కాన

భూలోకమున మానవు లందరీ భగవన్మత సంఘమేగాని వేరుసంఘములు లేవు. ఇందు రాజ్యముకన్న, కోట్లధనమున కన్నమించి సర్వశక్తివంతునిజేయు బ్రహ్మర్షిత్వము చెందిం చునట్టి మార్గములుగలది. భగవన్మతము సర్వలోకపాల కుడగు భగవంతుని సమునిచేయుమార్గము. అనగా బ్రహ్మర్షిగా చేయునది భగవన్మతము. గాన రాజ్యసంపాదన, కోట్లార్జనగలవానికినిగూడా నిష్కామునిచేసి జగత్కల్యాణమూర్తిని చేయునది భగవంతునిపూజ. భగవన్మతములో సంఘములు లేవు. ప్రతివారు సత్యధర్మాదుల ఆచరించుచు భగవంతుని పూజించుచు దాని ఫలముచెందుటే. తనకాఫలము తప్పిన పుస్తకములు తప్పనక, మరలఆచరించి ఫలము చెందుటేగాని విడువరాదు. భగవన్మతములోనివి సత్య, ధర్మ, అహింసాది మార్గాలందరికి తెలియును. అర్థము తెలిసి ఆచరించుటే ముఖ్యము. భగవంతుని నిత్యముసేవించుట ముఖ్యము, భూలోకములో ప్రతివారు ప్రతివస్తువున భగవద్దర్శనము చేయుచుగాని (అనగా ఇట్లుచూచువాడు బ్రాహ్మణుడనబడును.) లేక బ్రహ్మర్షిఅనగా బ్రహ్మైక్యసిద్ధిచెందిన వాడైగాని సత్య, అహింసాది సద్ధర్మములతో చరించుటే మేము చెప్పుభగవన్మతము.

దేవునివిడిచి సత్య, అహింసాదిసద్ధర్మములగల్గి చరించుటే బౌద్ధమతము, దీనినే శంకరాదులు దేవుఁడులేనిది సత్యాహింసాదులు నడుపజాలవని నాస్తికమతమనిరి. సత్యాదుల ఫలముగల్గువరకైన ఆచరించమని బుద్ధుడు బోధించినట్లుగూడగానరాదు.

"సత్యేన లోకాన్ జయతి" సత్యముచే లోకముల మానవుడు జయించుచున్నాడు అనిభావము. "సత్యమేవజయతినానృతం" సత్యమేజయించును. అనృతము మొదట జయించునట్లు గాన్పించినను తుదకు అపజయము నిశ్చయముగా పొందును. ఉ॥ ధర్మరాజు దుర్యోధనుడు ద్యూతాది మార్గములు. హరిశ్చంద్రుడు, విశ్వామిత్రుడు, ధర్మరాజు ప్రకృతి వికృతిసత్యములరెంటిని సంపాదించినవారు. తుదకు జయమునొందిరి.

పతంజలియోగశాస్త్రము:—"అహింసా ప్రతిష్ఠాయాం తత్సన్నిధౌ వైరత్యాగః" అహింసాప్రతిష్ఠుని దరినివిరోధ జంతువులు స్నేహమున మెలంగును. భారతములో కణ్వాశ్రమమున యిట్లుజరిగినట్లుగలదు. కణ్వుడు రాజ ప్రజా పూజ్యుడు. యితనికి లోకాన విరోధులే లేరు. దేవుడు లేడనిననూ యిట్టిఫలములు గన్పడువరకు సత్యఅహింసాదులు ఆచరింపుమనియైన బోధించిన కొందరు గాకున్న కొందరైన జగత్కల్యాణకారకులై యుందురు.

సత్య అహింసాదులు బోధించుటచే దేశమేలురాజా మతముదీసికొనిన ప్రజలుగూడ ఆమతస్థులగుట జరిగెడిది. రాజంగీకరించిన ప్రజలును అంగీకరించెడువారు. యిట్లుబౌద్ధ మతము ప్రబలి భారతదేశమునుండి వెడలిపోయినది. యీ మతమునగల అహింసామార్గము దుష్టులెదిరించిన నాడు జయించలేదు. సాధులదరి పనిచేసినది. అశోకునితర్వాత

మహామ్మదీయులచే బౌద్ధరాజ్యపాలన ఓడించబడినది. గాన యుద్ధమక్కర లేకుండగనే భాగవతములో జడభరతుడు, ప్రహ్లాదుడు అహింస, శాంతి దివ్యదృష్టులచే దుష్టుల జయించిరి. "బైబిలులో" క్రీస్తు, యితనిని పూజించిన పాపములబాసి స్వర్గము చేర్చును. యిందు మిగిలినపుణ్యమును గూడా బాపి మానవుని దేవునిగాజేయు మార్గము గానరాదని నాయూహ. క్రీస్తు సత్కర్మమార్గాల బోధించినాడు. భారతర్షులువలెకొన్ని మహిమలు చూపినాడు. తరువాత మహామ్మదీయమతముగూడా పాపములుబోగొట్టి స్వర్గఫలమిడునది: గాని పాపపుణ్యములబాపి జీవుని దేవునిగామార్చు మార్గము లేదని నా యూహ. హిందూమతములో శివకేశవోపాసకు లనేకులు జయమునొంది సర్వశక్తివంతులైన బ్రహ్మర్షులైనట్లుగలదు. గాన దేవుని సత్యమార్గముననే కనుగొనగలదు.

బైబిల్ లోగాని, ఖురాన్ లోగాని దేవునిగాచేయు మార్గములున్ననూ ఆమతస్థులు ఆమార్గా లవలంభించి సిద్ధి చెందినట్లు గానరాదు, "బ్రహ్మసత్యంజగన్మిథ్య" అనగా భగవంతుడు సత్యము, జగము నిత్యము మార్పు చెందునది.

దీనిఫలములు పూర్ణిసత్యమిడజాలవు. భగవంతుడన "వికృతియనియు" పరమేశ్వరి అనప్రకృతి, మాయఅనిపేర్లు.

సద్గుణియై సత్య, అహింసలతో ప్రకృతి వికృతి స్వరూపుడగు భగవంతు నర్చించుటచే "సత్యేనలోకాన్ జయతి" సర్వవిజయుడై జీవన్ముక్తుడగును. "సత్యంపద్మాశ్రితా సదా" (రామాయణము) ప్రకృతిసత్యముచే లక్ష్మి అనగా ధనాదులు గల్గును. వికృతిస్వరూపుడగు భగవదర్చన లేనిచో ప్రకృతిసత్యముచే కొలదిసుఖమున్నను నానాబాధలు లోలోననే బాధించుచుండును.

ఉ:- అమెరికాలో ప్రకృతిసత్యమగు ఆటం. దాని సత్యము తెలిసియుండుటచే పరులకు చెప్పిరని రోజనబర్గు దంపతులు ఉరితీయబడిరి. మన దేశములో పూర్వము ప్రకృతి సత్యపరులు బాధపడినట్లుగలదు. ప్రకృతి వికృతి సత్యపరులగు ఋషులు అణురూపులగుజీవుని, మనస్సును భగవదర్చన చేయుటలో అతని దర్శనస్పర్శనైక్యములుజెంద పగులగొట్టి వారు సుఖపడిరి. (ప్రస్తుతము అమెరికా ఆటం జగన్నాశనముచేసి రాజ్యముసంపాదించుటకే మొదటచేయబడినది. తర్వాత ఉపకారమార్గములు వెదకుచున్నారు. ఈ అమెరికా ఆటంపగిలినందున మానవులు బ్రహ్మర్షులుగా మారక వ్యర్థముగా భగవంతుని సమముగా చేయదగిన మానవ జన్మము బోగొట్టుకొనుచున్నారు. దీనిచే దేశములుజయించినను ప్రజల ప్రేమలేనిచో పాలించుటకష్టము. లేనిచో వారినందరినిజంపి బోడినేలను నెత్తిబెట్టికొని పాలించవలసి వచ్చును, ప్రజలకు ప్రేమగల్గిన పురుషుడు ఎట్టి ఆయుధ

ములులేక భూలోకము నంతయు సౌఖ్యముగా నేలగలరు.)
సర్వమును భగవన్మయముగా జూచువారగుటచే సత్యమైన
మహాత్ములనబరగి ఎట్టి ఆయుధములు లేకయే తమవాగ్బాణ
ముచేతనే దుష్టులజయించి నిర్భయులై నిష్కాములై సాక్షా
త్కారము చేయుచు సర్వాత్మర్గవ్యతిరేకులపై రాజపూజితులు,
సర్వజనపూజితులైరి. మరియు రాజర్షి ఋషి, మహర్షి,
బ్రహ్మర్షి పదవుల నొందినను రాజర్షులనం బరగి నిష్కామ
ముగా ప్రజలను పిల్లలవలెచూచుచు, వారిని ప్రేమతో సజ్జ
నులచేసి రాజ్యములేలిరి. ఉ॥ అంబరీష, దశరధాది రాజ
ర్షులు. అమెరికాఆటంచే దేశములు జయించినను ప్రజల
ప్రేమ లేనిచో వారి కెట్టిలాభముండదు. న్యాయపాలన జరు
గదు. గాన పశ్చిమ దేశపు ప్రకృతిసత్యవాదులకు నిష్కామ
మార్గము తెలియకుండుటచే ఏదోవిధభయముచేతనే చరించు
చున్నారు. రోజన్ బర్గునుంచి అది మరింతవృద్ధియైనది. ఏది
జగన్నాశనకరమో దానినుండియే జగదుపకారము గన్నొ
నిన కొంత బాగుండెడిది. ఉ॥ గరళము, నాభి ప్రాణము
తీయును. ప్రాణముతీయురోగమును హరింప తెలిసిన వైద్యులు
వాడెదరు. అనగా యిదితెంటికి ఉపయోగమగుటచే కొందరు
వైద్యులుమాత్రమే వాడుచున్నారు. అమెరికావారి ఆటం
అనగా భగవంతుని విభూతిరూపమని నాయూహ. దాని
పేరు వినగనే భగవంతుని పూజింపని దేశప్రజలు, దేశా
ధ్యక్షులు, కొన్ని దేశముల భగవంతుడున్నాడని చెప్పుటయే

కాని అతనిపూజించుమార్గము తెలియని ప్రజలు, ప్రధానులు, అధ్యక్షులు రాజులు భయముతోగడగడలాడుచు ధర్మప్రసన్నాలు చెప్పుచు అమెరికావారిని దూషించుచు కొందరు గౌరవించుచు కొందరు కాలముజరుపుచున్నారు. మరియు తాముపాలించు దేశజులకు సౌఖ్యముగా రకరకాల భోజనాలుతినుట, స్త్రీలతో కామతృప్తిపడుటే మానవజన్మసాఫల్యముగా తేల్చుచున్నారు.

భారతదేశమున సత్య, అహింసాది సన్మార్గముల నడచుచు బ్రహ్మర్షిత్వముజెందుటే రాజ్యమేలుటకన్న, కోట్లార్జించుటకన్న గొప్పదని సాధ్యమైనంతవరకు ఆచరించుచు చెప్పువారు కొందరును, ఆచరింపకున్నను ధర్మముబోధించువారు కొందరును విని ఆచరించి సత్యాసత్యము లెరుంగువారు కొందరును నేటికినిగలరు. గాన యీకాలాన భారతీయులే జగమునకు సత్య, అహింసాదిమార్గాలు, భగవదర్చనచేయు మార్గాలుబోధించిన (ఇతర దేశగ్రంథాలలో పూర్ణముగాలేవు గాన) భూలోకజనులారీతి నడిచి రాజ్యభ్రాంతి, ధనభ్రాంతి వదలి ఇది భోజనాది ప్రకృతిసౌఖ్యములకు తప్ప ఇతర సౌఖ్యమెక్కుడు నిడవని గ్రహించి నిష్కామముగా సత్య, హింసాది మార్గాల రాజ్యధనాలపాలించుచు భార్యబిడ్డల ధర్మమార్గానపోషించుకొనుచు భగవంతునిపై ప్రేమగల్గిపూజించుచు దేవునిజేరుటే మానవజన్మసాఫల్యమనియెంచి గొప్ప మార్గమునబడి యిహపర సుఖములు పరభయాదులులేక పొందగలరు.

## భారతదేశము,పాఠశాలలు,పశ్చిమదేశజులు,మహమ్మదీయులు

భారతదేశమును యితరమతస్థులెందరు పాలించినను, హిందూమత మనేకభేదములుగలదై రాజులేనిదైనను యీ మతముతో భగవంతునిజేరదగు ఐక్యమనదగు శాస్త్రీయ స్వచ్ఛమార్గములుగల గ్రంథరాజములుండుటను, అవిసంస్కృతభాషలో చదువువారెక్కుడుండి ప్రచారము చేయువారుండుటను యజ్ఞాదులుచేసి స్వర్గాది లోకాల సుఖముపొందు మార్గాలనడచువారు తక్కువైనను, భగవంతునిపూజించు వారుమాత్ర మేకాలమునను మిగులుచునేయున్నారు. దాన భారతదేశమున భగవన్మతము నశింపక సజీవముతోనున్నది. భారతదేశము పశ్చిమదేశజుల పాలనకాలమున బాలురకు వారిప్రకృతిశాస్త్రములు చదువుట వారి ఉపయోగార్థము రాజసేవకులనుగా తయారుచేయు గ్రంథములచదువుట వారి మతము పొందినవారికి ఉద్యోగము లిచ్చుటచేసి రేగాని భగవత్ జ్ఞానపరులుగాచేయు సద్గ్రంథాల పాఠశాలలు పెట్టక పోవుటచే ప్రకృతివిజ్ఞాను లెక్కువై భగవంతుని పూజించుట మాని సత్య, అహింసాది ధర్మమార్గములు తెలియక విడచి రాజ్యభ్రాంతి ధనభ్రాంతిపరులై తల్లి దండ్రి, గురువులయందు అన్నదమ్ముల, అక్కచెల్లెండ్రియందు ప్రేమిభావమువిడిచి భగవంతునియందు పూర్ణభక్తిలేక పాశ్చాత్యులవలె నడచు

వారున్నను. ఆవిద్య నేర్చియు భారతదేశ గ్రంథములుచదివి భగవంతునర్చించుచు తల్లి దండ్రి గురువు సాధుజనుల పూజించుచు, అన్నదమ్ముల అక్కచెల్లెండ్రయందు గౌర వముంచుచు గొప్పగాకాలము గడిపిన వారునుగలరు. ఉ॥ బాలగంగాధరతిలక్, వివేకానందులు నేటిపారశాలలలో భగవంతునర్చించు శాస్త్రములు పశ్చిమదేశఖనిజరసాయ నాది సత్యశాస్త్రములతో పాటు చదివినట్లుచేసిన ధర్మమార్గ మున ధనమార్జించుచు సత్సంతానము గనుచు తమకు, పరు లకు ఇహసుఖముగల్గించుచు భగవంతునిపూజించుటచే పరసుఖము చెందగలరు. దాన భారతగ్రంధముల పురుషార్థ ములో గొప్పవగు చతుర్విధ పురుషార్థములగు ధర్మార్థకామ మోక్షములు అనగా ధర్మమార్గమున ధనార్జనచేయుట ధర్మ మార్గమున వివాహమాడి సత్సంతతిగనుట, ధర్మమార్గమున నడచి కైవల్యము చెందుట పొందగల్గుదురు. ధర్మమనగా సత్యముతో గూడిన మార్గముగలది అనిఅర్థము. గాన సత్య మార్గస్థులు పొందని సత్ఫలముండదు.

భారతదేశమున పూర్వపు "యం. ఏ." లగు ద్రోణ, కృప భీష్మాచార్యాదు లనేకులు ప్రకృతి, వికృతి శాస్త్రవి ద్వాంసులగుటచే యిహమున గొప్పగౌరవములు సౌఖ్యములు చెంది భగవదర్చన పరులగుటచే నిరోగులై నిత్యానందులై తుదను భగవంతుని జేరిరి. ప్రస్తుతము పశ్చిమ దేశజులచే నిర్ణయమై "బి. ఏ. యం. ఏ" లు చదివినవారు భారతదేశ పూర్వపు యం. ఏ. లంత యశోవంతులుగాక సామాన్యధనా

ర్జనచేయుచు యిహాసుఖము నామమాత్రమందుచున్నారు.

వీరుచదివిన గ్రంథాలలో భగవదర్చనచేయు స్వచ్ఛ మార్గములు తెలియనందున భగవంతుని పూజించుటమాని ధనార్జనచేయుటే ముఖ్యమనుచు దాని సంపాదించి కొద్ది యిహాసుఖముతో కాలముగడుపుచున్నారు. ప్రకృతి వికృతి విద్యల పిల్లలను చదివించిన కొందరు రాజసేవకులై కొందరు వర్తక వ్యవసాయకులై, కొందరు కార్మికులై భగవంతుని ర్చించుచు సత్సంతానముగనుచు రాజ్యమునకు సహాయులై పరరాజులభయము లేక మనగలరు. ఇట్లు తాము బ్రహ్మచర్య గృహాశ్రమముల 55 ఏండ్లుగడిపి తర్వాత జీవితమంతయు అడవులయందు, మునిపల్లెలనిర్మించి అచ్చట కొందరు, ఇంటను వేరేయుండికొందరు భగవంతుని సేవించి రాజర్షి, ఋషి, మహర్షి, బ్రహ్మర్షి పదవులు తొల్లిబొందిరి. నైష్టికబ్రహ్మచారులు విద్యాభ్యాసముమానిన తర్వాత కాలమంతయు భగవత్సేవకులై సాధుమార్గములు భగవంతుని జెందుమార్గములు జనులబోధించుచు రాజర్ష్యాది పదవులు బొందిరి. నేడునట్లే గృహస్థులు, బ్రహ్మచారులు ఆచరించిన పొందగలరు. గాన పశ్చిమదేశీయిజములన మతసిద్ధాంతాలు విడిచి భారతదేశసకామ, నిష్కామ శాస్త్రమార్గముల భూలోకస్థులు, భారతదేశస్థులందరు నడచిన యిహాపరసుఖములందురనుట కేసందియముండదని నొక్కి చెప్పుచున్నాను. ఇదేభగవన్మతము, ఇదిలోకమునంతటికి చాలినమతము.

ఈ మార్గమే అనగా సత్కామ నిష్కామ మార్గాల సత్య ధర్మ, అహింసాదులతో భగవంతునర్చించుచు లోక కళ్యాణముగా ప్రజలను, పాలించువారు నడిచిన లోకైక భగవన్ మతరాజ్యము అగును. అనగా భూలోకము ఒకే భగవంతుడను అభిప్రాయముగలది. అతని పూజించుమార్గము గల రాజ్యమగును. దాన నానావిధమత భేదములులేక మత యుద్ధములుగల్గక భగవంతునిద్వారా భూలోకసర్వవిధ మానవులకు సత్ఫలములుగల్గుచుండును. ఇదియే ఇంద్రియ విజయయుద్ధము. మానవుడు యింద్రియముల దుష్టయుద్ధములకై పురిగొల్పక తాను యింద్రియముల సన్మార్గమున నడిపించి, పరోపకారము చేయుచు భగవంతునిగూర్చి సర్వేంద్రియార్చన సేయుట అయియున్నది. మరియులోకైక భగవన్‌మతరాజ్యమన సర్వలోకములలో భూలోకమొకటే భగవంతుని పూజించుటకు దగినరాజ్యము. ఇతరలోకములు ఇచ్చటచేసిన కర్మఫలము లనుభవింపదగినవిగాన భూలోక ప్రతిమానవుడు బాల్యమునుండి భగవంతుని పూజించుచు బ్రహ్మచర్య గృహాశ్రమ ధర్మముల చరించి 55 ఏండ్లు దాటిన తర్వాత పుత్రులపై భారముంచి తన గృహాదులపై కామమువిడిచి నేడు ఉద్యోగము వదలినవారివలె సౌఖ్యముగాతిని వ్యర్థముగా కాలముపుచ్చక రాజర్షిత్వ, ఋషి, మహర్షి, బ్రహ్మర్షిత్వసిద్ధిజెంద గట్టిప్రయత్నము చేయదగును. చేయకున్నను మానవుడీలోకాన స్థిరముగా నుండడుగదా!

తానెక్కడినుండియోవచ్చి కొలదికాలమిచ్చటనుండి తర్వాత మరియొకచోటికి బోవుచున్నట్లందరెరింగినదేకదా! దానినుంచి యైన ముందుగలఊరికి ప్రయాణముపోవువారు తగు సామాగ్రి తోపోయిన సౌఖ్యమును, సామాగ్రిలేకున్న కష్టమును పొందుదురు. అట్లే ముందుచేరు లోకానికి తగిన ధర్మమార్గమున సకామ నిష్కామముగా భగవంతుని పూజించి దానిసత్ఫలమను సామాగ్రితో చేరిన సౌఖ్యము గల్గును. కానిచో కష్టముగల్గునని తెలియుచున్నది. సత్యముతో సమాన ఫలమిడునది ఇంకొకటిలేదు.

## పతంజలి - అపరిగ్రహము.

"అపరిగ్రహ స్థైర్య జన్మకథంతా సంబోధః"

భోగసాధనవస్తువులను స్వతంత్రముగా సంపాదించుచు భార్యాబిడ్డల తన్ను సేవకాదులు పోషించుట అపరిగ్రహము. పరులనుండి దానముపట్టుట అనగా జలధారతో పుచ్చుకొనుట పరిగ్రహము. తన్నుండి తిరిగి ఉపకారములేక పరుల ధనాదులు గొని జీవించుట పరిగ్రహము. అపరిగ్రహమునకు పూర్వజన్మమున తానెవరైనదియు తెలియబడును. అపరిగ్రహమునకు జగత్కళ్యాణముచేయు శక్తి యెక్కువగును. ఇతడు భగవంతుని పూజించిన త్వరలో జీవన్ముక్తి అనగా బ్రతికియుండగానే బ్రహ్మనిష్ఠత్వ సిద్ధిగల్గును. పరిగ్రహాకాల

ములో యిచ్చువానిని తన్ను దేవునిగా జూచువాడు దాని దోషము జెందడు.

స్కాందోపనిషత్తులో- "భైక్షం దేహరక్షణే" అని కాలముసరిగా లేనపుడు బిక్షతో జీవించి యోగసిద్ధి చెందదగు ననిగలదు. ఇతర కామములపై చిత్తవృత్తినిరోధించి భగవంతుని ప్రేమతో చిత్తధ్యానము చేయువాడును, పరిగ్రహ దోషము చెందడు. భోగవస్తువులు స్వంతముగా పండించి సంపాదించినను, అడవినుంచి తెచ్చుకొన్నను చెట్లు మొదలగు వాటిలో జీవులున్నారు గాన వాటినుంచి గ్రహించినట్లగునుగాన, అన్నాదుల, ఫలముల చెట్లను దేవునిగాజూచి తెచ్చి అన్నాదుల ఫలముల నీళ్ళను దేవునికి నివేదించి తన్ను వాటిని దేవునిగా జూచి తినువాడే స్వతంత్రముగా సంపాదించి తినువాడు. భార్యా, పిల్లలు, తానేగాన వారినిగూడ దేవునిగా చూడదగినది. దేవునిగాజూచి సేవకులకు దీనాదులకు ధనాదులిడువాడే పూర్ణమైన అపరిగ్రహుడు. పూర్వజన్మము చెడ్డదైన! దాని దుష్ఫలము తొలగించుకొనుటకు మంచిదైన తొందరలో జీవన్ముక్తుడగుటకు అపరిగ్రహము తోడ్పడును. మరియు దుర్మార్గధనాదుల సంపాదించరాదు. దుష్టధనముగాని దుర్మార్గమున జీవింపరాదు. దుష్టులగు వాతాపి యిల్వలుల ధనముగొని అగస్త్యునివలె నిష్కామ మార్గమునగాని లేకసత్కామమార్గమునగాని అర్థవ్యయం చేయుచు. జీవింపదగును. సాధ్వన్నము అనగా "బ్రాహ్మణా

న్నమమృతం" బ్రాహ్మణుడు బ్రాహ్మణి అనగా ప్రతివస్తు వును భగవంతునిగా జూచువారు. లేక వస్తువులలో దేవుని చూచువాడు బ్రాహ్మణుడు. బ్రాహ్మణి అనగా భర్తను మాత్రము దేవునిగా జూచునది. యితరులను దేవునిగా చూడనిది. తనయందు దుష్కాములగు వారిని ఆపదకాలముల దేవునిగా దాపితి, దమయంతులవలె ఆయాయాపదలనుండి తప్పుకొనినది. బ్రాహ్మణి సాధారణముగా పరపురుషుల తండ్రివలె అన్నదమ్ములవలె, స్త్రీలను తల్లివలె అక్కచెల్లెండ్ర వలెజూచి భాషించునదిలేక పరుల యింద్రాదిదేవతలగాజూచు వారు రెండవరకపు బ్రాహ్మణబ్రాహ్మిణులు ఇట్టి బ్రాహ్మణ బ్రాహ్మణులున్న ఏకచక్రపురమున. దేవునివలెగాని, యింద్రా దులవలెగాని భిక్షయిడువారిని జూచుచు భిక్షాన్నము సంపా దించి దేవునికిడి పాండవులు దానిని కొంతపరులకిడి కొంత భక్షించి జ్ఞానవృద్ధులైరి. అందు బకాసురునిజంపి భీముడు వారికి మహోపకారము చేసెను. ఇట్లే పాంచాలమున భిక్షాన్న భక్షణముచేసి బలవంతులై రాజులనందరిని జయించి ద్రౌపదిని పెండ్లాడిరి. ఆవివాహమున తా మింద్రులమనియు ధర్మరాజా దులుగా పుట్టినట్లు తెలిసికొనిరి. పైగూడారుణికోపనిషత్తు లో సత్య, అహింస, బ్రహ్మచర్య, అపరిగ్రహముల మనుష్యు లారా రక్షించుకొనుడని మూడుసార్లు చెప్పుటచూడ పూర్ణా యువుగలవారే తమతోనున్న దేహధారులతో మిత్రతతో మెలంగుచు తామెచ్చటినుండివచ్చినారో గతజన్మ తెలిసి

కొని సత్యమార్గానజీవించుచు సత్యము మాట్లాడువాడు కైవల్యముజెందుననుట కేసందియముండదని భావము. ఇందుకు యితరుల సాయమక్కర లేదు. సంఘములో చేరనక్కర లేదు. కులము, జాతి పేర్లక్కర లేదు. మానవుడొక్కడే ఆచరించిచూచు కొనవచ్చును. కాన యీభగవన్మతమున పరసహాయము సంఘ,కులములతోపని లేదు. యెవరికివారేకర్మేంద్రియ, జ్ఞానేంద్రియ అంతరేంద్రియములు, తాను, దేవుడుకలసి ఒకసంఘము పరునితో గూడిన యీసంఘము చెడునని పూర్వీకులందురు. ఒంటరిగానుండి ఆచరించి ఫలముగాంచిరి.

కొందరు భార్య అర్ధాంగియనియు, పుత్రుడన తండ్రికి రెండవరూపమనియు యూహించి గృహస్థులై యితరులచేర నీయక పైసత్యాదులాచరించి ఫలముగాంచిరి. ఉః— అత్రి అనసూయాదులు. ఇందుశిష్యులను పుత్రసములగా చేసిరి. గాన వారిని మాత్రము ఆశ్రమముల నుండనిచ్చిరి. ఇతరులు వచ్చినను పనితీరిన వెంటనే పంపివేసెడివారు. సకాములు స్వర్గమును, నిష్కాములు కైవల్యమును యిహసుఖము నొందిరి.

పతంజలిసూత్రము :—“ అస్తేయప్రతిష్ఠాయాం సర్వరత్నోపస్థానం ” దొంగతనములేనివానికి శాస్త్రముచే నిర్ణయింపబడి రత్నములకు చెప్పబడిన ఫలమిదు సత్యమగు రత్నములు చేరును.

ఉ:— వైఢూర్యము- ఇది తాల్చినవారి దరి ౖతాచు పాము తెల్లయిశ్వరిదరినున్న దానివలె మెదలక పోవును. ఇది కేతురత్నము రాహురత్నము గోమేధికము ఇదిపాలిచ్చు ఆవుపైనుంచి పాలుపితికిన పాలు ౖకిందపడవు. అనగా ధరించిన శుౖకఃనష్ట కుసుమాది రోగహరమగునని భావము. ఇట్లే తమశక్తికి గలఫలమిచ్చు యితర రత్నములును జేకును. వాటిధారణచేత తక్కువ జాతకులు నవగ్రహాది దోషములు చెందక జీవింతురని నమ్మదగియున్నది. అందుచే రాజులు, రాణులు, గృహస్థులు పూర్వమెక్కడగా ధరించెడివారు. నేడును ధరించిన నట్లే ఫలముగల్గును. దొంగవానికిరత్నములు దొరికినను వాటిఫలము తెలియక తేలిక ధనమునకు విౖకయిం చును. హిందూమతములో లోకములోగల అన్ని మతముల గొప్పధర్మములు చేరియున్నవనదగును. హిందూమత మనేక భిన్నమతములుగానున్నది. హిందూమతసారమే యీభగవన్ మతము. అనగా భూలోక సర్వమతసారమే భగవన్ మతము. ఏదో లోకమునుండి యీలోకముచేరిన మానవుడు ఆచరించిన మొదట రాజర్షిగా తర్వాత ఋషిగా, తర్వాత మహర్షిగా తర్వాత ౖబహ్మర్షిగా చేయుమార్గములు బోధించునదే భగవన్ మతము.

మనుస్మృతి:—2వ అ॥— ౖబాహ్మణుడే సర్వమిౖతుడు. ౖబాహ్మణుడన భగవంతునిగా ౖపతివస్తువును చూచువాడు. లేక ౖబహ్మైక్యసిద్ధుడు ౖబహ్మర్షి. సర్వమిౖతుడు అని పేర్లుగలవు.

బ్రహ్మర్షికి పూర్ణాయువు సర్వమిత్రతన, నిష్కామసత్యమార్గ జీవనముగల్గునని భావము. అంత్యజులలో మతంగఋషి బ్రాహ్మణుడు. శూద్రులలో విదురుడు బ్రాహ్మణుడు. వైశ్యులలో దశరథుని శపించినఋషి (గుడ్డివాడు) బ్రాహ్మణుడు. క్షత్రియులలో విశ్వామిత్రుడు బ్రాహ్మణుడు. బ్రాహ్మణులలో వసిష్ఠుడు బ్రాహ్మణుడు. బ్రాహ్మణుడైనవానికి శాపానుగ్రహశక్తియుండును. వీరు వేదాంతబ్రాహ్మణులు. మతంగమహర్షి తన ఆశ్రమమున రక్తపుబొట్లు పడినందున శపించెను.

అవి వాలిచే పడినవిగాన ఋష్యమూకమను పర్వతమునకు రాజై బలవంతుడయ్యు పరీక్షించుటకైనను వాలివచ్చుట భయపడి మానినాడు. ఈభగవన్మతము యెవరికి వారికే గాని యేకుటుంబమునకు ఆకుటుంబమునేగాని బ్రాహ్మణ బ్రాహ్మణులుగా జేయునది. అట్టి గృహస్థులతో నిండిన గ్రామము ఋషిపల్లెయనై ప్రకాశించు గ్రామమగును. అట్టి పల్లెలలో పెద్దదిపట్టణము. అట్టి పల్లెల పట్టణములతోగూడినదే రాష్ట్రము. అట్టి రాష్ట్రములతో గూడినదే దేశము. అట్టి దేశములతో గూడినదే సర్వసౌఖ్యయుత భూలోకము. గాన భూలోకగృహస్థులగు స్త్రీ పురుషులందరు బ్రాహ్మణ బ్రాహ్మణులుగా తయారైననాడు నేకాలమునను కృతయుగము, సత్యమగు స్వారాజ్యమిచ్చునది యగును. లేనినాడు దుష్ట యుద్ధాదిక్రూరకర్మలు, చోరులు, త్రాగుబోతులు, వ్యభిచారి

ణులు, ఆతతాయిలు. మొదలగు దుష్టులతోనుండి గృహస్థ ధర్మములు, రాజ్యపాలనము, సత్సంతానవృద్ధి, సుఖజీవనము సాధుమార్గ ధనార్జనాది సన్మార్గవర్తనాగక నిరంతరభయ దుఃఖములతో భూలోకము నరకతుల్యముగా ప్రకాశించును. గాన ప్రతి గృహస్థుడు భగవన్మతమన భగవంతుని పూజించుమార్గము తెలిసికొని ఆచరించుచు జీవించుటే శుభప్రదము. రాజర్షిత్వాది బ్రహ్మర్షిత్వములు జెంద సంఘు మనవసరము. మార్గము తప్పినానని అనుమానము చెందిన గురువును జేరిగాని యోగ్యులగు పరగృహస్థుల జేరిగాని సదర్థమున్గ్రహించి వెంటనే యింటికి జేరునదిగాని వారి యింట ఉండరాదు, కొంతకాలము సదర్థవిచారణ చేయవలసి వచ్చినచో యౌవనస్త్రీలను చూడరాదు. చూచిన పల్కరాదు. విచారణ అయిన వెంటనే యిల్లుచేరి ఆచరించునది.

మనుస్మృతి 2 వ అ॥ —" జప్యేనైవతు సంసిద్ధేత్ బ్రాహ్మణోనాత్ర సంశయః " కుర్యాదన్య న్నవాకుర్యాత్ మైత్రో బ్రాహ్మణ ఉచ్యతే॥

ప్రతివస్తువును దేవునుగా జూచువాడు లేక ప్రతివస్తువులో దేవునిచూచువాడు బ్రహ్మజ్ఞాని లేక బ్రాహ్మణుడు అతడు తక్కిన యజ్ఞములు చేసినను చేయకున్నను ఒక్కజపయజ్ఞముచేతనే బ్రహ్మర్షి కాగలడు. అతడే సర్వప్రాణిమిత్రుడు అగును.

స్కాందోపనిషత్తు:— "అభేదదర్శనంజ్ఞానం" అంతటను సర్వదేహాదారులను పంచభూతాది సర్వమును భగవంతుని చూచువాడు బ్రహ్మజ్ఞాని. భూలోకములో యేజాతిమానవుడైన అతడే బ్రాహ్మణుడు. ఈదృష్టిచే దుష్టజంతువులు దుర్మార్గము చేయలేక మిత్రత చెందును. సన్మార్గజంతువులు మరింత స్నేహము చూపునని భావము,

భాగవతము.— 5వ స్కంధము ఈదివ్యదృష్టి చెందిన జడభరతుని కాళీ మొదలైనవారు సంహరింపలేకపోయిరి. ఈదృష్టిచే అహింసావ్రత సిద్ధిగల్గును.

ఉ॥ అచ్చట విప్రసూనుడు। భయంబొకయించుకలేక। చంపగావచ్చినవారియందు। కరవాలమునందును, కాళియందు తా।నచ్యుతభావముంచి హృదయంబున పద్మదళాక్షు నెంతయున్। మచ్చికతోడనిల్పి అనుమానము నొందక నుండె నంతయున్॥

ఈదివ్యదృష్టి జడభరతుని నరుకుటకు తినుటకు సిద్ధముగానున్న వారినుండి అనగా మృత్యువునుండి తప్పించినది.

## భూలోకము - స్త్రీ పురుషులు

నానావిధజాతి మానవులకు దశేంద్రియములు, అంతరేంద్రియములు, హృదయమున జీవుడు, అంటకుండా భగవంతుడు గలడు. జీవుడు అంతరేంద్రియములు, దేవుడు అగోచరములు. స్వప్న, సుషుప్తి, తురీయావస్థలు అగోచరములు.

ఈ అగోచరేంద్రియములతో అగోచర జీవుడుజేరి, జ్ఞానేంద్రియ కర్మేంద్రియములతో జేరిన, జాగ్రదవస్థయై భూజగమున మానవాదులు ప్రత్యక్షమగు చుందురన గోచరింతురని భావము, జీవుడు అంతటను దేవుని జూచుచు భగవంతుని సర్వేంద్రియార్చన చేయుచున్న అవాఙ్మానస గోచరుడగు భగవంతుడు ధ్రువ, ప్రహ్లాద, గజేంద్రులకువలె భూలోకమున ప్రత్యక్షమై వరము లిడగలడు. భాగవతములో వామనజననమున అతని భావనలేని కండ్లకు గోచరింపని దేవుడు అతనిని ప్రేమతో భావించు అదితి కండ్లకుగోచరించి నీభర్తను దేవునిగా జూచిననాడు బ్రహ్మాండముపై నంతటను నిండియున్న నేను బ్రహ్మాండముతో భూలోకమునకు వత్తునని చెప్పినాడు. గాన భూలోకస్థులు అంతటను అనగా పంచభూతములను, అందుండు దేహదారులను భగవంతునిగా జూచుచు సర్వేంద్రియార్చనచేయు వారికి భగవంతుడు కనబడగలడు. ఇట్లు కనబడినాడని ఒకడు చెప్పినను ప్రతిమానవుడు అభ్యసించిన భగవద్దర్శనమగునని భాగవతాభిప్రాయము. ఈదివ్యదృష్టి సిద్ధించిన అనగా అంతట దేవునిచూచుట సిద్ధించిన సర్వపాపములు పోయినవని గ్రహింపనగును.

4అ॥గీత॥ శ్రేయాన్ ద్రవ్యమయాద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః పరంతప। సర్వంకర్మాఖిలం పార్థ జ్ఞానేపరిసమాప్యతే॥

ద్రవ్యసాధ్యములగు యజ్ఞములకంటె జ్ఞానయజ్ఞము గొప్పది. సర్వకర్మములు జ్ఞానముతో పూర్తి

యగును. తక్కువగా సత్కర్మములు నిష్కామముగా జేయుచు భగవంతునర్చించు, జ్ఞానయజ్ఞమున భగవంతు నంతట చూచువారు సాంఖ్యులు. ఎక్కువగా ధనాదులతో సత్కర్మములు నిష్కామముతో లోకకళ్యాణముగా జేయుచు, భగవంతు నంతటనుజూచుచు భగవంతు నర్చించువారు కర్మయోగులు. అని రెండు తెరగులు. మొదటివారు సాధువులగు పేదవారు. రెండవవారు సాధువులగు ధనవంతులని నాఅభిప్రాయము. పేదవారైననుధనవంతులైనను గొప్పదియగు జ్ఞానయజ్ఞమున సమఫలముచెందెదరు. 5అ. 5శ్లో. "యత్సాంఖ్యైః ప్రాప్యతేస్థానం తద్యోగైరపి గమ్యతే" సాంఖ్యులు పొందినస్థానమునే కర్మయోగులును పొందుదురని ధన, నిర్ధనులగు సాధువులకు తుల్యఫలము చెప్పినాడు.

"నహిజ్ఞానేన సదృశం పవిత్ర మిహవిద్యతే" జ్ఞానమువలె పవిత్రముచేయునది యింకొకటిలేదు. "శ్రద్ధావాఁ లభతే జ్ఞానం" శ్రద్ధ అనగా ఒకవస్తువును పొందగోరుయిచ్ఛ. అనగా దేవునియందు శ్రద్ధగలవాడు దానిని తొందరలోనో ఆలస్యముగానో పొందకమానడు. ఇది అందరెరింగినదే. ఇట్లు భగవంతునియందు యిచ్ఛగలవాడు భగవంతుని అంతట చూడగలడు. దాన భగవద్దర్శన మగును.

శ్లో॥ "అపిచేదసి పాపేభ్యః సర్వేభ్యః పాపకృత్తమః॥ సర్వంజ్ఞాన ప్లవేనైవ వృజినం సంతరిష్యతి" పాపులందరిలో పాపుడవని నిర్ణయింపబడినను ఆపాపమునంతయు జ్ఞానమను తెప్పచేదాటగలవు.

గర్భోపనిషత్తు:- "జ్ఞానాగ్నిర్మనసా" జ్ఞానాగ్ని మనస్సునకలదు. దర్శనాగ్ని నేత్రములకలదు. మనస్సు జ్ఞానేంద్రియములు చేరిననాడు అనగా భగవంతుని జేరుమార్గము శ్రద్ధతో విని నేత్రములతో స్త్రీ పురుష ద్వంద్వరూపుడగు భగవంతుని దర్శనాగ్ని వెలుగున జూడగలడు. ఆరూపము ప్రేమతో అంతటను జూచుటచే యితరకర్మములుచేయ వీలులేక ఘ్రాణేంద్రియము "సోహం" అనగా అతడు నేనే అని జపించును. అంతరేంద్రియములు దానిని కల్పి "సోహం" అని జపించు వానికి భగవత్శక్తి అతనియందు ప్రవేశించుచు కొంతకాలమునకు భగవంతుని రూపధారి యగును. అనగా సారూప్యపదవిచెందును. ప్రత్యక్షమన ఇంద్రియములకు తెలియబడుట. జ్ఞానేంద్రియములన యీఉపనిషత్తుప్రకారము భగవంతుని జూడగోరిక జీవునికి గల్గిననాడు అంతరేంద్రియములద్వారా మొదటిదగు మనస్సున యీకోరికచేర దాని వెలుగున జ్ఞానేంద్రియములు, జ్ఞానమన శ్రద్ధతో వినుట. శ్రద్ధతో చూచుట. శ్రద్ధతో వాసన చూచుచు. "సోహం" అని జపించుట. శ్రద్ధతో అంటుట. శ్రద్ధతో సాత్వికరసముగ్రహించుట. భగవంతుని స్మరించుట. యివిగల్గిన యింద్రియములుగాన జ్ఞానేంద్రియములని పేరు గల్గెనని నాఅభిప్రాయము.

ఇక కర్మేంద్రియము లనగా మనస్సుతోగూడినజ్ఞానేంద్రియముల సహాయమున భగవదర్చనకు కావలసిన పుష్పా

దులు తెచ్చి నిష్కామముగా జ్ఞానేంద్రియ సహాయమున ప్రేమతో రసవంతములగు భగవన్నామములు పల్కుచు భగవంతునిపై జల్లును. ఇది కర్మేంద్రియ జ్ఞానేంద్రియ నిష్కామ కర్మ భక్తిజ్ఞానమార్గము. అనగా నిష్కామముగా ప్రేమతో అంతట దేవునిచూచుట అని అర్థము. ఇదియు సర్వపాపహరమైనది. భగవంతునివంటి సత్సంతానము గనుట మలాదుల విడుచుట మిగిలిన కర్మేంద్రియముల పనిఅయియున్నది.

అంతటను దేవునిగాజూచు దివ్యదృష్టిఫలము భారతము శాంతిపర్వము, భీష్ముడు:— గీ॥ విష్ణుమయమగ్ని హవియును విష్ణుమయము। విష్ణుమయమయ్యె సర్వంబువిశదబుద్ధి। నిట్లగుటగందు గావున నింక కేని। కల్మషము నాకు లేకున్కి గానవచ్చు॥ దీన సర్వపాపములు పోయినట్లు పైలక్షణమునకు తగిన లక్ష్యమైనది. జ్ఞానదృష్టి అనగా అంతటను భగవంతుని చూచుట. తనశరీరములను ఆభగవంతుని పాదములపై సాష్టాంగనమస్కారములచే అంటుటను, కౌగలించుటను, తన శరీరముల భగవంతుని ఏకముచేయుటను, తన శరీరముల నంటియున్న సర్వపాపహరమగును. దానిచే నానావిధరోగములు, కష్టములు తగ్గిపోవుచుండును. ఇక పుణ్యముమిగులును. దాన సంతాన ధనాదులు వృద్ధియై వాని కేమిబాధలుకల్గునో యని మానసిక బాధలతో భయముతో నిద్రలేక కష్టములు నొందుచుండును. భగవంతుని చిత్తధ్యానముచే పుణ్యపాపములు రెండునశించి తేజోవంతుడు, ధైర్యవంతుడు, శీలవం

తుడు నిరోగి అయి భార్యాపుత్రాదిముల దేవునిగా జూచుటచే వారి బాధలు చాలవరకుఁ గ్గును. దాన నిర్భయుడై గృహా శ్రమమున నిత్యానందముతో యోగి చరించుచు కొంత కాలమునకు సర్వేంద్రియవిజయుడై తానొక్కడే భగవం తుని అంతటజూచుచు ధ్యానించి ధ్యానించి అతనిని తనయం దైక్యసిద్ధిజెంది బ్రహ్మర్షిత్వసిద్ధిగాంచి బ్రహ్మానందము నొందుచు అంతమున పరబ్రహ్మత్వము జెందును.

శ్రద్ధతో పలానిపట్టణము, దేశము ఫలాని-చోట గల దని సత్యవంతునివల్ల వినినవాడు ఆప్రకారముపోయిన అవి ప్రత్యక్షమగునుగదా. అట్లే అగోచరుడగుతాను అనగా జీవుడు అగోచరము లగు అంతరేంద్రియములద్వారా గోచర ములగు జ్ఞానకర్మేంద్రియములద్వారా అగోచరుడగు భగ వంతు నర్చించువాడు లోపల, బైట భగవంతునిగాంచ గలడు. వరములందగలడు. ఐక్యముచేసి బ్రహ్మర్షి కాగలడు.

"దుష్కామము - నిష్కామము - సత్కామము"

చాలాదూరాన అందగాడైన ఒకపురుషు డున్నాడని విని ఒక స్త్రీ అతనిపై మోహముగల్గి తీర్థయాత్ర వంకను వినువక పోయిపోయి నానాకష్టములతో అతనిని ప్రత్యక్ష ముగాజూచి భాషించి, నమస్కారములుచేసి, కౌగలించి, యోసంగము చెందు స్త్రీ వ్యభిచారిణి అన ఎక్కువ దుష్క ర్మము మనోవాక్కాయములచే చేసి పూర్ణపాపియై భర్తా

గులు విన్నవారికిదూరమై, తెలియకున్న పరభర్తపై ప్రేమచే భర్తాదుల లెక్క చేయక కలహములాడుచు ఆపాపము చేసి నంసాన నానాకష్టముల అనమానముల పొలగుచు తుదకు ప్రాణముపోవుతరిని విటుని జూచుచు ప్రాణము విడిచి అతని చేరి అతని అంతమున ఉభయులు నరకబాధల చెందెదరు. వ్యభిచారిణి అంతరేంద్రియములద్వారా ఊహించి పోయి పోయి దూరాననగలవిటుని జ్ఞానకర్మేంద్రియములకు ప్రత్యక్షముచేసికొని అతనిపొంది నానావిధ అసౌఖ్యములుపడి నరకము చెందినట్లు పతివ్రత సర్వలోకసుందరుడగు భగవంతుని అంతరేంద్రియముల ద్వారా పూజించి పూజించి లోనదర్శించుచు తుదకు జ్ఞానకర్మేంద్రియములకు ప్రత్యక్షమగునట్లుచేసి భగవంతునిగా తనభర్తను చూచుచు అతనితో యేకమై సంయోగయజ్ఞముచేసి అవతారపురుషుల, బ్రహ్మర్షుల పుత్రులగని భర్తకులమువారిని తన తండ్రి తరపువారిని, భర్తను, తన్ను సర్వసుఖములజెందుచు తరింపజేయుచున్నది. ఇది నిష్కామ సత్కామము. పతివ్రతచే గృహాశ్రమము ఎక్కువ యశోవంతమగును. వ్యభిచారిణిచే గృహాశ్రమము అపకీర్తిపాలై సర్వనాశము చెందును. నిష్కామకర్మమునకు సత్కామకర్మమునకు, దుష్కామకర్మమునకు నిత్యము జీవుడు సర్వేంద్రియములతో పనిచేయుట తప్పదు. నిష్కామ, సత్కామకర్మములు సుఖములను, దుష్కామము దుఃఖములనిచ్చునని తెలియుటలేదా! ఓ భూలోకములోనున్న

మనుష్యులారా! యెన్నిమతములు చెప్పినను ధర్మములు చెప్పినను యెవ్వరు దాటిపోవు. మీరు వాటిఫలము చూడనక్కె ఱన్న సర్వేంద్రియములతో పనిచేసిన వాటిసత్యము మీకు తెలియబడునుగదా! మనుష్యుల జూచియే ఋషులు, అవతారపురుషులు సద్గ్రంథముల నిష్కామ, సత్కామ, దుష్కామకర్మములు నిర్ణయించి ఫలములు వ్రాసిరి చూడుడు.

"బృహదారణ్యకోపనిషత్తులో" పుత్రుడు పుట్టగా తండ్రి నీపేరు వేదమని పల్కినట్లుగలదు. అనగా వేదమునందు చెప్పబడిన ధర్మములు మానవునియందు గలవని భావము. ఉ॥ భగవంతుడు హృదయమందుగలడు. తాను అన జీవుడు. అతనికి నివేదించి అన్నముతిన ఊహించి కర్మేంద్రియములద్వారా సంపాదించి జ్ఞానేంద్రియములద్వారా పరీక్షించి దంతములకు తగలకుండా అన్నము నేతితోకల్పి భగవంతుని నివేదించి అంతటితో తృప్తిపడక అంగుష్టఅనామిక వ్రేలుపట్టంత అన్నముతీసి లోనభగవంతునికై మొదట నమస్కరించివేయగా అది జఠరాగ్నిచే దగ్ధమై ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయమై తుదకు ఆనందమయుడగు భగవంతునిజేరి అతనిచే ఆస్వాదింపబడును. దాన తిరిగి అతడు నివేదించిన వానికి సత్సంతానవృద్ధి, ప్రాణబలము, ఆయురారోగ్యవృద్ధి, సర్వసౌఖ్యానందము, ధర్మాభివృద్ధి గల్గించుచు సర్వేంద్రియములకు, జీవునికిసద్బలముగల్గజేయుచుండును. ఇందు మొదట అన్నమును కర్మేంద్రియములు

సంపాదించి తాము తినక జ్ఞానేంద్రియసహాయమున . అనగా సుజ్ఞానులు చెప్పినట్లుగా నిష్కాములై దంతములు దాటి అన్నమును దేవుని చెందయిడినవి. జ్ఞానేంద్రియములు పరీక్షించి తాము తినక దంతములుదాటి అన్నము వేయు నిష్కామముగా అంగీకరించినవి. ఆ అన్నమును అంతరేంద్రియములందు భగవంతుని చేర్చినవి. నిష్కాములగు కార్మికులగు యింద్రియములన కర్మేంద్రియములు వాటి నాజ్ఞాపించి సహాయముచేయు ఉద్యోగులగు యింద్రియములన జ్ఞానేంద్రియములు. వీటికి ప్రభువగు మనస్సు దానికన్న గొప్పవగు బుద్ధ్యాదియింద్రియములు నిష్కాములై తాము భక్షించక జీవునిజేర్చ అతడు తినక నిష్కాముడై భగవదర్పితముచేసినాడు. దాన సర్వేంద్రియములకు, జీవునికి నిరోగము, నానావిధసౌఖ్యములు గల్గుచున్నవి. దీనింబట్టి ప్రతిమానవుడు నిష్కామకర్మచేయుచున్నాడు. దేవునికిడక యింద్రాది దేవతలకు నివేదించి శేషాన్నము తినువారును మధ్యమసౌఖ్యము చెందగలరు.

ఇంద్రాదిదేవతలను దేనినోకోరి దానిఫలముజెందవారికై అగ్నియందు నేతితోకూడినవాటిని హోమము చేతురు. ఇందుకార్మికులగు కర్మేంద్రియములు ఉద్యోగులు గొప్పఉద్యోగులగు జ్ఞానేంద్రియాంతరేంద్రియములు నిష్కామముగాచరించినను యజమానియగు జీవుడు సకాముడగుటచే, జీవుడనురాజు, ఉద్యోగులు, సేవకులు, మధ్యమ

సుఖము జెందిరి. ఇంద్రుఁడు స్వర్గలోకాధిపతి. దేవతలు అందరుంద వారు. వీరు అగోచరులగు పుణ్యజీవులు. శాస్త్రవిధి నర్పించిన గోచరులగుదురని వేదశాస్త్రిలు ఘోషించుచున్నవి. మరియు ఇంటిపిల్లలు ధనాదివస్తువుల సంపాదించి తండ్రికి నిష్కామముగా నిచ్చినను యజమాని సకామము క్రింద వాటిని ఉపయోగించిన తత్ఫలము తండ్రికిన్నీ అతని ద్వారా పిల్లలకున్న చెందును. అనగా తండ్రి నిష్కామముగా పిల్లలకిడను. ఎవఁడే కర్మము చేసిన ఆకర్మమును నే ఫలమిడను. ఇది సకామకర్మము. ఇందు నిష్కామకర్మమున్నను యాజమాని సకామముగాన వానిచేరి సకామకర్మమైనదని గ్రహింపదగును.

## నాస్తికుడు - దుష్టుడు - దుష్కర్మము

దేవునికి, దేవతలకిడక వారు లేరని నిర్ణయించి తాను అన జీవుడు ఒక్కఁడే తిని సౌఖ్యమునొందు మిశ్రమాహారముల మద్యాదిదుష్టపానముల దుష్టాహారముల కార్మికులు ఉద్యోగులగు ఇంద్రియములద్వారా పొంది తానే భక్షించి తత్ఫలము నిష్కామముగా కార్మికాదులు చేసినను యజమానియగు జీవుడు దుష్టుడగుటచే అతనితో పాటు సర్వేంద్రియములు అవమానకర వాక్యములు పల్కుట హత్యచేయబోవుట, ఆత్మహత్యచేసుకొనబూనుట. అబద్ధములాడుట పరస్త్రీల బలవంతము చేయబోవుట మొదలగు దుష్కర్మములచేసి నానారోగములపాలై అవమానములుపడి సన్నిధ

నశించి ఇహసుఖగౌరవములందక హీనవర్తనుడని పేరుగాంచి తుదకు నరక కష్టములనుభవించును. ఇందు నిష్కామకర్మమున్నను యజమాని దుష్టుడగుట అతని ఫలమువందరు అనుభవించిరి. మొదటి నిష్కామకర్మపరులు కలియుగాన అక్కడక్కడగలరు. రెండవసత్కామపరులు స్వల్పముగానున్నారు. దుష్కామపరులు లోకములో లెక్కకుమించి గలరు. గాన యీ మూడు తెగలగల మానవులందరికి నిష్కామ సత్కామ, దుష్కామ, కర్మములు ప్రతిదినమున జరుగుచుండుట దానిఫలము గన్పడుటజూచియే పూర్వఋషులు అవతార పురుషులు గ్రంథరూపముగ వ్రాసిరి.

భగవన్మతమున పూర్ణసుఖము. దేవతామతమున మధ్యమసుఖము. నాస్తికమతమున నానావిధరోగకష్టములు, భయము, మొదట కొంతజయముగానున్నను తుదకు పూర్ణాపజయము, అవమానము, పరకష్టములు గల్గుకమానవు. ఎన్నిమతములు నీవుపొందినను యీ మూడుకర్మములుతప్ప యితరములుండవు - యితరములుండవు వేరుమార్గములేదు. వేరుమార్గములేదు. సర్వలోకస్థులకన్న భూలోకమానవుడు "యోగవాహిగాన" అతడెట్లూహించిన ఆకర్మఫలమే కల్గును. దేవునికిడ నెంచిన అతనిజేరును. ఇంద్రాదులకిడ నెంచిన దేవునిజేరక వారినేజేరును. తనకేయిడ నెంచిన అన్నాదులశక్తి తననే జెందునని భావము. నిష్కామ జను లెక్కుడైన కలియుకమైనను అందు సౌఖ్యము లెక్కుడై కృత

యుగమనబడును. సత్కామజను లెక్కుడైన త్రేత, ద్వాపర యుగతుల్య సౌఖ్యములు గల్గును. దుష్కాము లెక్కుడైన కలి యుగఫలమున నానావిధ యుద్ధములు, గాలివానలు, దుర్భిక్షములు, రోగాలవృద్ధి, నాస్తికజనవృద్ధి, వ్యభిచారవృద్ధి గల్గి నానావిధములగు అసౌఖ్యములు దుఃఖములతో నిండి యుండును.

మానవుడు సాధుసహవాసమున సాధువు, దుష్టసహవాసమున దుష్టుడు, దేవునికై ఉపవాసమున అన భగవంతుడు తనదరినున్నట్లు నిత్యము చూచుచు చరించుటచే కొంత కాలమునకు రాజర్షి, ఋషి, మహర్షి, బ్రహ్మర్షిగా మారును. దేవతల కై ఉపవాసమున అన వారు తమదరినున్నట్లు చాలాకాలము చూచుటచే వారివంటి వాడగును. దుష్టసహవాసమున తొందరలో దుష్టుడగుట అందరెరింగిన దేకదా! అట్లు సాధువగుట కొంతఆలస్యము. దేవతగుట మరికొంత ఆలస్యము. బ్రహ్మర్షియగుట కొంతకాలము పట్టును. సత్యాన్వేషణపరులు దీనివిచారించి ఫలము పొందుదురుగదా!

రాజ్యపాలన మానవజాతులు యోగ్యమానవునుండి దేవునినుండి గ్రహించిరి. "యజుర్వేదము, పురుషసూక్తము" విష్ణువర్ణన బ్రాహ్మణుడు ముఖము. క్షత్రియులు బాహువులు ఊరులు వైశ్యులు, పాదములు శూద్రులు అయి నట్లుగలదు ఇంకనంతయు అతనినుండి పుట్టినట్లు గలదు. మానవునిహృదయమున అంటకుండా దేముడుగలడు. హృదయమున

అంటి జీవుడుగలడు. దేవుడు సర్వప్రభువు. జీవుడురాజు. అంతరేంద్రియములు యువరాజు. రాజప్రతినిధులు జ్ఞానేంద్రియములు. జిల్లా అధికారులు కర్మేంద్రియములు, రాజసేవకులు. ఇదే దేహమను రాజ్యము. ఇందు కర్మేంద్రియములు జ్ఞానేంద్రియసహాయమున ధర్మమున సంపాదించి నిష్కామముగా జ్ఞానేంద్రియములకు అవి అంతరేంద్రియములకు, అవి రాజగుజీవునికి అతడు రారాజగు దేవునికి అర్పించుచుండును. దేవుడు, యజమాని నిష్కాముడగుటచే తిరిగి సర్వమునకు సర్వసౌఖ్యము లిచ్చుచున్నాడు. (నిష్కామముగా ఒకనికి ఉపకారము చేసిచూడుము. అతడెంతయో నిన్ను ప్రేమించి మరల నీ కుపకారము చేయసిద్ధముగానుండును. సకామ కర్మము ప్రత్యుపకారము కోరి ఉపకారముచేయుట మధ్యమ ఫలము. మొదటిదానంతసుఖముగానుండదుదుష్కామకర్మము. ఇదిచేయువానిని పొందిన వానిని, ఉభయుల నాశము చేయును. నిష్కామము కైవల్యము. సకామము స్వర్గము, దుష్కామము నరకమిచ్చును.) రాజు నిష్కాముడై తన రాజ్యమున యువరాజాదులకు నిష్కామము నేర్పుటచే యీ రాజు నిష్కాముడగుట రారాజగు భగవంతుడు నిత్యము కొంతకాలముచూచి అతనితో యేకమై తనశక్తినంతయు తండ్రి కొడుకును తనతుల్యునిచేసి గృహరాజ్యపతినిచేసినట్లు సర్వప్రభువగు బ్రహ్మర్షిగా సర్వజగమునేలు శక్తివంతునిగా జీవుని దేవుడుచేయును. దీనిబట్టి భూలోకరాజ్యము లేర్పడచి నారని నాయూహ.

దేవుడగు విష్ణువునకు ముఖము చేతులు తొడలు కాళ్ళు బ్రాహ్మణుడు, రాజు, వర్తకులు, వేదోక్తముగా సత్కామ కర్మము చేయువారు. ముఖము బ్రాహ్మణులనికలదు. వీరు జపాదసత్కామకర్మలచే వేదోక్తముగా మిగిలినవారికి తమకు సుఖము చేతురుగాన "వర్ణానాం బ్రాహ్మణప్రభు" అని మనుస్మృతికలదు. మిగిలిన వారు యీ బ్రాహ్మణునికి తమలోతమకు వుపకారములు చేసికొనుచు రాజర్షియగు రాజుచే గౌరవింపబడుచున్నారు. వీరందరు సత్కామ కార్మికులు. దేవునికి నిష్కామముగా ఆహారమిడు ఓషధీవృద్ధికై వెన్నెలగాయు చంద్రుడు మనస్సుగాన నిష్కామ అంతరేంద్రియయుక్తుడు రాజైన రాజర్షి, ఋషి, మహర్షి, బ్రహ్మర్షులనొకడై, వేదోక్తబ్రాహ్మణక్షత్రియాదులకు సౌఖ్యమిడును. బ్రహ్మర్షియగు రాజు వేదాంతబ్రాహ్మణుడై నిష్కంటకముగా, నిష్కామముగా రాజ్యమేలి అంతమున కైవల్యము చెందును అట్లే వేదోక్త సత్కామ కార్మికులగు బ్రాహ్మణ, క్షత్రియ వైశ్యశూద్రులు నిష్కామఅంతరేంద్రియయుక్తులైన తమవృత్తులతో లోకకళ్యాణము చేయుచు అంతమున కైవల్యము చెందగలరు. గీత॥ మానవులందరు నిష్కాములు, సత్కాములు, దైవీసంపదగలవారనియు; దుష్కాములు అసురీసంపద వారుగా రెండు పక్షములు చేయబడిరి. మరియు వీరే రాజ్యము సాగుటకు ముఖాది కర్మేంద్రియ కర్మములచూచి బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రజాతులని నాల్గు తెరగుల కార్మికులుగా జేయబడిరి.

మనుస్మృతి॥ "నాస్తిపంచమః" 5 వ జాతి లేదనికలదు. అత్రిస్మృతిలో ఒక్కొక్కజాతి 10 విధములుగా జేయబడె నది. (మరియు ఈనల్లురిసంఔతి మనుస్మృతి అనేకజాతులుగా చేయబడిరి.) బ్రాహ్మణులు దేవ, ముని, ద్విజ, రాజు, వైశ్య, శూద్ర, నిసాద, పశు, మ్లేచ్ఛ, చండాలురని 10 తెరగులు దేవ, ముని, ద్విజ, రాజు, వర్తకుడు, శూద్రుడు, సాత్విక గుణ కార్మికులుగలవారని, మిగిలిన నిషాద, పశు, మ్లేచ్ఛ, చండాలురు దుష్టగుణ కర్మగలవారు. ఇట్లే అన్నిజాతుల లోను గల్గియుందురనదగును. సృష్టినుండి యీపేళ్లున్న వని కొందరు ఋషులు వ్రాసినను గుణకర్మములు ప్రధాన మనిరి. ప్రస్తుతకాలములో వీరు నిషాదులు. వీరు మ్లేచ్ఛులు, వీరు చండాలురని చెప్పదగినవారు శాస్త్రముచే. నిర్ణయింప దగినవారు భారతదేశమునలేరు. వీరి సృష్టికిగానుట చాలదుర్ల భము, గుణకర్మములబట్టి ఆయానామములు వచ్చుచుండును. పోవుచుండును. ఇతర దేశాలసంఘములుగలవు. వారిలో దుష్టు లుసన్మార్గులుకలరు. ఆసంఘములలో యీగుణకర్మముల వారి కానామములు జెల్లునుగదా. భారతదేశాన నేడు కుల, మత, గౌరవములేదు. సంఘగౌరవముగలదు. రెండూ ఒకే అభి ప్రాయము. పేరుమాత్రము భేదము. దుర్మార్గులెక్కుడుగల సంఘము దుష్టసంఘమని పేరుగాంచుచున్నది. అట్లే సన్మా ర్గులని మరియొక సంఘముపేరు గాంచుచున్నది.

నేను వ్రాసిన బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రాది

శబ్దములు ప్రత్యేకజాతులకు చెందినవికావు. ఎవరికే గుణ కర్మములు గల్గినవో వారే భూలోక ప్రజలలో ఆపేర్లు గాంతురని నాయభిప్రాయము. మొత్తమున భూలోకవాస వులందరు ఎన్నిజాతుల భేదమున్నను దుష్టులు, సన్మార్గులు, సాధులు, అసాధులు; దైవీసంపదవారు, అసురీసంపదవారు; అని రెండుపక్షములుగాఅగుదురు. బ్రాహ్మణాది సర్వజాతు లవారు లేక నానావిధసంఘములవారును నిష్కాములై తాము చేయుసత్కర్మఫలము భగవదర్పితముచేయుచు, సత్యధర్మా హింసాది సన్మార్గముల నడచుచున్న కైవల్యము. సత్కామ మార్గానస్వర్గము దుష్కామమార్గాన నరకము చెందగల రని నా అభిప్రాయము.

తల్లి దండ్రి దుష్టగుణకర్మముగలవారు, అధర్మవర్తను లు అయినవారికి పుట్టినవారు సృష్టినుండి వారివలె అగు దురు. వీరెట్టి మంచికులస్థులైనను దుష్టగుణ క్రూరకర్మ ములుగలవారగుట అసురీసంపద వారగుదురు. వారితో అట్టి వారేతప్ప దైవీసంపదవారు వారిసహవాసము వారితోసంబం ధములు వారితోకలిసియుండుట కంగీకరించుటలేదు. వీరితో వారునూ కూడియుండుటలేదు. అదిచూచికాబోలు అత్రి స్మృతి:— దేవయాత్ర వివాహేషు యజ్ఞప్రకరణేషుచ, ఉత్సవేషుచ సర్వేషుస్పృష్టా స్పృష్టంనవిద్యతే॥ దేవయాత్ర, వివాహాయజ్ఞ, ఉత్సవములందు ఒకరినొకరు అంటిన దోషము రాదని చెప్పెను. దీనింబట్టి జనసంఘముజేరు సత్కర్మస్థాన

ములు పరస్పర స్పర్శదోషము లేదు. అసురీసంపదగల (బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర) నిషాదపశు మ్లేచ్ఛ చండాలురలో నెవరైన ఆసంపదవిడిచి నిష్కాములై సత్కర్మఫలము భగవదర్పితము చేయుచు నిత్యోపకారము చే లోకకల్యాణములు చేయువారుగానున్న అనగా భగవంతుని సేవించువారై యున్న వారిదర్శన, స్పర్శన, సహవాససంబంధములుచేయ లక్షలాదిజనులు వానిసమీపము, కోరకయే పోవుచు వచ్చుచుందురు. దైవీసంపదవారు సత్కామము విడిచి నిష్కాములై పైవారివలెనున్నవారును అట్టి గౌరవము నేపొందుదురు. ఉ॥ వివేకానంద, రామకృష్ణులు. భగవంతునిసేవించువారే ఇంత గౌరవముపొందుచున్ననాడు బ్రహ్మ ఋషులు ఎట్టిగౌరవము పొందుదురో చెప్పతరముకాదుగదా! ఉ॥ వశిష్ట, విశ్వామిత్రాదులు. భగవత్సేవలేని రాజసేవకుల రాష్ట్రమంత్రుల, రాజప్రతినిధుల; దర్శింప అవసరమున్నవారును, అవసరములేని మరికొందరువారినిజూచి లోనగొప్ప సంతోషముపొందరు. పనులుమాత్రము జరిపించుకొందురు. మిగిలిన భగవత్సేవలేని వర్తక రైతుసేవకులు వీరికి భోజనాదులుజరుగుటదక్క వారిని దర్శించబోవు వారుండరు. భగవత్సేవలేని కార్మిక సేవకులు వీరిచే పనిచేయించుకొను వారేగాని వారిని గౌరవించువారుండరు. వీరే భగవత్సేవకులై నిష్కాములై సత్యధర్మాదులచరించి ఋషి, మహర్షి, బ్రహ్మర్షులలో నొకరైన నాడు వీరిదర్శనార్థము లక్షలాదిజనులు

పోవుచువచ్చుచుండును. గావ మానవులు భోజనాది విసక్తికై ప్రవృత్తిలోనున్నను భగవత్సేవకులై బ్రహ్మఋషులగుట పరమోత్తమమార్గమని భగవన్మతాభిప్రాయము.

పాషాణములచే కట్టబడు దేవాలయములు— తల్లిదండ్రులుకట్టిన దేహ దేవాలయము. ఉత్తరగీత॥ ప్రతిమస్వల్పబుద్ధీనామ్ । మునినామ్, హృదిదైవస్థమ్, సర్వత్ర విధితాత్మనః॥ సామాన్యబుద్ధిగలవారు ప్రతిమల దేవునిగా పూజింతురు. మునులు తమ హృదయమందున్న దేవదేవుని పూజింతురు. హృదయమున సుషుప్తిస్వప్నముల అనగా దేహమనే దేవాలయమున బాహ్యప్రదేశమునంతటను. సమదర్శనులు భగవంతుని పూజించి పూజించి బ్రహ్మఋషులు అగుదురు.

భారతము అను శాసనము - దేవాలయలింగము:—

చం॥ కలమెయి పాలనేత యుదకంబులనేని పరాభిషేకమం। గళమునొనర్చి భక్తిరతిగంధము మాల్యముధూపదీపసం। కలనములున్ నివేద్యమును గాడసమర్పణ మొందజేసిలిం। గలలితమూర్తియందు ననుగాంచి భజించినముక్తిసేకురున్॥

వట్టినేరాతిప్రతిమల దర్శించువారు సామాన్యజనులు. ఇట్టివారు బ్రాహ్మణ. క్షత్రియ, వైశ్యశూద్ర నిషాద. పశు, మ్లేచ్ఛ, చండాలుర నెవరైనను అతిస్వల్పఫలము నొందుదురు. అట్లుగాక పైరీతి అశుద్ధముతినని ఆవుపాలు, నేయి, బట్టీపట్టిన నీరుగాని; గంగోదకముగాని "పర్షమమృతః" అని అథర్వవేదము—వర్షపునీరుగాని, పాతాళగంగతోగాని

దేవుని లింగములో జూచుచు పైనిపోయుచు భక్తి అన ప్రేమతో గంధము, పువ్వులు జల్లుచు మహిసాక్షి గుగ్గు ల్యాది సుగంధ ధూపములతో నూనె, నెయ్యి కర్పూరదీప ములతో (మనిషిమలము పందిమలము వేయని) సాత్విక సస్య ముతో పండిన అన్నాదుల నివేదనచేసి లింగమున "దుర్గ" అను స్త్రీ రూపము, ఈశ్వరుడను పురుషరూపముతోగూడిన పరమేశ్వరునిజూచి జప, ధ్యాన, స్తోత్రాదులు చేయువాడు కొంతకాలమునకు బ్రహ్మర్షిత్వము జెందగలడు. ఎవరో కట్టించిన దేవాలయములో తండోపతండములుగా బోయి ప్రతిమలదర్శించి మేము చూచాము దేవుని మేము చూచాము దేవుని అన్నంతమాత్రాన గొప్పఫలము రాదు. గాన పరులుకట్టిన దేవాలయములనైన తానొక్కడేపోయి పైరీతి అర్చించిన దేవాలయముకట్టినవానికి కొంతఫలముపోయినను కొంతకాలమునకు పైరీతిచేసిన గొప్పఫలము చెందగలడు. అట్లుచేయుటకు వీలుగానికాలమున ప్రతిగృహస్థుడు కాశీ యందువలె తనయింటికి శుభస్థానమున దాని నీడ ఏకాల మునను తానున్నయింటిపై పడకుండునట్లు చూచి తనకు ప్రేమగల దేవుని ఆలయము చిన్నది కట్టించి, అందుపైరీతి తాను, భార్య, పిల్లలు, అర్చించిన గొప్పపుణ్యముజెంది కొంతకాలమునకు బ్రహ్మర్షులుగాగలరు. కట్టిన దేవాలయము లేకున్నను ఎక్కడబడితే అక్కడ అన ఆరుబైట మంచి చోట పైరీతి పరమేశ్వరునిజూచి పాలు మొదలగు వాటితో

పూజించుటగాని; పేదవాడైన అట్లు పూజించుచున్నట్లు భావించుటగాని చేసి అతని జూచుచు ఎదురుగా జప, తపోధ్యాన స్తోత్రాదులు చేయువాడు సమదర్శనుడై కొలది కాలముననే బ్రహ్మర్షి కాగలడు. అట్లుగాకపోయినచో కట్టిన దేవాలయమువదలి "స్కాందోప నిషత్తు" దేహో దేవాలయప్రోక్తో జీవో దేవస్సదాశివః త్యజేదజ్ఞానమాలిన్యం సోహంభావేన పూజయేత్॥ దేహమనే దేవాలయము, ఇందు జీవుడగు తాను గలడు. ఇందు సదాశివుడగు దేవుడుగలడు. అజ్ఞానమువిడిచి అనగా ఇది మాంసపుముద్దయని ప్రేగులని గుండెలని వస్తునిర్దేశము చేయమాని జ్ఞానముతో అనగా లోనహృదయాది స్థానములయందు అంతటను పరమేశ్వరుని జూచుచు పైరీతి పాలాదులతో పూజించినట్లు భావించుచు నివేదనాదులు చేసినట్లు భావించుచు జప ధ్యాన స్తోత్రాదుల అతడు నేనే అను భావముతో ఉమామహేశ్వర స్వరూపబ్రహ్మమును పూజించువాడు కొలదియేండ్ల కాలములోనే బ్రహ్మర్షిగా ప్రకాశించును. ఇట్లు ఏ స్త్రీకి ఆస్త్రీయు బాలికాబాలురు నిట్లుచేసిన త్వరలో బ్రహ్మర్షులుగా మారగలరు. గాని పరులు గట్టించిన దేవాలయములోనికి ప్రతిమల జూచుటకు వెళ్ళునందుకే కలహము లాడువారు, కలహములతో నాప్రతిమలచూ[illegible] నేమిగొప్పఫలము గాంచగలరు. ప్రస్తుతము సిమెంటు దేవవిగ్రహముల బైట నున్నవాటిని జూచిన యెంతఫలమో అంతేఫలము అన

అతి స్వల్పముగల్గును. కలహములాడుటమాని ఇది గొప్ప ఫలమిడు భగవంతుని సేవామార్గముగాన పైరీతుల నొకటి అనుసరించుట శాస్త్రమార్గము నిర్మలమగు మనోవ్యావసాయమున గొప్పఫలము గల్గును. శాస్త్రవిధుల విడిచి ప్రతినాడు ఆప్రతిమల ధూప దీప నివేదనము లర్పించు పూజారులే బ్రహ్మర్షులుగామారక నానా అవస్థలు పాలగుచుండ శాస్త్రమార్గము విడిచి ప్రతిమల నెపుడోనొకనాడు చూచినంతనే నేమిఫలముగల్గునో ఊహించుడు. పరులు కట్టించిన దేవాలయములోనికి తన్ను పూజారులు రావద్దన్న కష్టముకల్గగదా! కష్టముతో కలహమాడి ఆ దేవాలయమునకు పోవుటమాని తన్ను సంతోషమున రానిచ్చు దేవాలయములో పైరీతి ఒంటరిగా దేవుని అర్చించునది. "ఉత్తమం స్వార్జితంవిత్తం" తాను స్వయముగా ధనము సంపాదించుట ఉత్తమముగాన పైరీతి తనయింటగాని, దొడ్డియందుగాని దేవునిభక్తిగలవాడు చిన్నదేవాలయమే కట్టించి అందు శ్రద్ధతో నిర్మలమనస్కుడై పైరీతి దేవు నర్చించుట పరమోత్తమము. దీన ఎట్టి కలహములు గల్గవు.

## యోగసిద్ధి

అశ్వమేధ పర్వము (భారతము) 1ఆ. 229 పద్యము

కం॥ చెప్పంగల యతియెల్లను। జెప్పితి నీకింత గడవ జెప్ప నొకడులేడిప్పాట నెలలనారిట। జొప్పడు యోగంబు నియతి శుద్ధాత్మునకున్॥ పతంజలి—సూత్రము యోగశ్చి

త్తవృత్తినిరోధః చిత్తవృత్తిని నిరోధించి దానిచే భగవం తుని అంతట జూచుచు జపధ్యాన స్తోత్రాదులుచేయుట యోగము. ఇట్టిస్థితి నియతి అన పూర్వకర్మబలయుతునికి అనగా జ్యోతిశ్శాస్త్రరీత్యా జాతకములో రాజయోగదశా కాలమున ఏదికోరిన ఆకోర్కె సిద్ధించునుగాన భగవత్ దర్శనము, అతని కృపాసిద్ధి కోరిగాని, ఐక్యసిద్ధికోరిగాని 6 మాసములుచేసిన యోగసిద్ధిగల్గును. అట్టి బలములేనివారు మరికొంతకాలముచేసిన యోగసిద్ధిగల్గును.

మైత్రేయద్యుపనిషత్తు:— జీవుడు అన తాను "చిత్త మును" ప్రకృతికర్మముల లాభమునకై ఉపయోగించిన భయదుఃఖములు స్వల్పసుఖములుగల లాభముల నిచ్చును. అదివిడిచి భగత్సేవకు వినియోగించినచో చిత్తశాంతి గలిగి సర్వసుఖములిడును.

"యథానిరింధనో వహ్నిస్స్వయోనా ఉపశామ్యతి। తథావృత్తిక్షయాచిత్తంస్వయోనా ఉపశామ్యతి"— పుల్లలు లేని అగ్ని దానిపుట్టు స్థానమగు వాయువునుజేరి, నిష్కామ సత్కాముడగు పుత్రుడు ప్రేమతో తల్లినిజేరి శాంతించినట్లు యితరవృత్తులులేక దేవుని సేవించు జీవునిచేరి ప్రకృతి వృత్తులుమాని చిత్తము శాంతించును.

పరస్త్రీపై కామముగల్గిన పుత్రుడు క్రోధాదులతో నున్నను, తల్లినిజూచి కామశాంతుడగునట్లు పుల్లలుగల అగ్ని వాయువునుజేరి వెలిగి వెలిగి తుదకు వాయువునుజేరి శాంతిం చునట్లు, సకామచిత్తము నిష్కామ భగవధ్యానము

చేయు జీవుని జేరి శాంతించి, నిష్కామముగా భగవధ్యానము చేయుచు శాంతించును. డిటో—ఉపనిషత్తు :— "చిత్తస్యహిప్రసాదేన హంతికర్మ శుభాశుభం" అనగా — అనేకజన్మల నుండిదాచి యీజన్మమున చేసిన పుణ్య పాపములరెంటిని, చిత్తప్రసాదమున అనగా చిత్తము నిష్కామముగ భగవంతునిధ్యానము కొంతకాలము చేసినపుడు వదలి వేయును. దాన పరిశుద్ధజీవుడగును. అనగా యింద్రియ విజయుడగును. రామాయణము :— బాలకాండ — విశ్వామిత్రునిజూచి మహర్షి యనిబిలిచెను.

నీవు యింకనూబ్రహ్మర్షివి గాలేదు. యింద్రియ విజయుడుగాక. అనగా యింద్రియములతోగూడి తపస్సుశ్రద్ధతో కొంతకాలము విడువక చేయువాడు "మహర్షి" యగునని బ్రహ్మ చెప్పెను. యిట్లు చేసినతర్వాత జీవుడు తన సేవకులగు సర్వేంద్రియములకు సేవనియు చెప్పక అనగా (యింద్రియవిజయుడై) తానొక్కడే తానున్న చోట అంతటా పరమేశ్వరితోగూడిన భగవంతుని ప్రేమతోజూచుచు, జపధ్యానాదులు కొంతకాలముసేయుచు, తర్వాత అతనిని తనయందేకముచేసి మరికొంతకాలము జపధ్యానాదులుచేసిన "బ్రహ్మర్షి" కాగలడు. దీన జీవునకు యోని దేవుడుగాన అతిడు తనయందు జేరుటతో శాంతిచెందును.

సాధుపుత్రులు తమ పుట్టుకకుకారణమగు తలిదండ్రుల తమతోయేకమైయున్న ఎట్టిశాంతి అనగా స్వేచ్ఛమగు సుఖముతో చరింతురో అటులే జీవుడు తనతో తన జననీజనక

యాపభగవంతుడేక మైననాడు స్వచ్ఛమైనశాంతి నొంది కృత కృత్యుడై బ్రహ్మర్షియనబరిగి లోకకళ్యాణముగా చరించుచు అంతమున పరబ్రహ్మత్వము జెందును.

## (115 వ అధ్యాయం) "శాంతిమహిమ"

గరుడపురాణము:- న తేవయసియః శాంతః సశాంత ఇతి మేమతిః। ధాతుషుక్షీయమాణేషు శమకస్య నజాయతే॥- వయస్సులో నెవడు శాంతుడయ్యెనో అతడే శాంతుడు. అనగా వయస్కాలములో బ్రహ్మర్షియగుట శ్రేష్టమనియు, ధాతువులునశించు ముసలితనమున శమమే గలదు. అన యిక బ్రహ్మర్షిత్వమెట్లు సిద్ధించునని యభిప్రాయము. అనగా సిద్ధించదనుట. బాల్యమునుండి బ్రహ్మవిద్య నభ్యసించిన వయస్కాలములో సిద్ధించును. అది విడిచి మొదట బాల్య యౌవన కౌమారములువిడిచి ముసలితనమున బ్రహ్మవిద్య నభ్యసించువాడు, దాని సిద్ధినొందజాలడు, బాల్యమునుండీచేసిన ఒకప్పుడు అభ్యాసపాటవముచే ముసలితనమునను సిద్ధించగలదు. "చిత్తాయత్తం ధాతువశ్యం శరీరం। చిత్తేనష్టేధాతవో యాంతినాశం। తస్మాచ్చిత్తం సర్వధారక్షణీయం। స్వస్థేచిత్తే ధాతవః సంభవంతి॥ చిత్తము నిష్ఠామభగవధ్యానియైన శరీరమున ధాతువులన్నియు వశమగును. దుష్టచిత్తమైన ధాతువులు నశించునుగాన, చిత్తమునసర్వదా నిష్ఠామభగవధ్యానమునసుంచి రక్షింపదగును.

"స్వస్థౌచిత్తే" అనగా నిష్కామభగవధ్యానియు తనకు రాజగు జీవుని జేరి నిష్కామ భగవధ్యానముచేయు చిత్తము చేత ధాతువృద్ధి నిత్యముగల్గుచుండను. తైత్తిరీయము:— "తపసా, శ్రద్ధా; శ్రద్ధయా మేధా (మేధగలవాడుఋషి) మేధయా మనీషా (మనీషగలవాడుమహర్షి) మనీషయా మనసా, (మనీషుడు మనోజయముగలవాడగుట) మనసా శాంతి. (శాంతుడు బ్రహ్మర్షియై సంపూర్ణశాంతివంతు డగును.) యితనిని అమెరికా "ఆటం" మొదలగు ఆయుధములు నష్టముచేయ లేవని నాయూహ. యితడు సత్యమగుశాంతిగలవా డగును. గాని డాంబిక శాంతి ప్రచారకులకు, డాంబిక శాంతిగలవారికి స్వల్పసుఖముమాత్రమే గలును.

గణేశగీత:—"యోగమన" అంతటను తనయందు దేవునిచూచుట. అనగా దేవుని తనయందైక్యముచేయుటన దగును. (తనయందు దేవుడైక్యమాయెనా లేదాఅని పరీక్షింప అవతారపురుషులగాని, బ్రహ్మజ్ఞానులగాని వ్రతులుగా బడసిన సత్యమనదగును.) యోగమన మరియొకర్థము—అపూర్వవస్తుసందర్శనముచేయుట. క్షేమమన దాని రక్షణసేయుట, అదివరకు తనకులేనివస్తువులుగల్గుట యోగము. వాటి రక్షణ క్షేమము. మరియు అదివరకెన్నడు తానుచూడని భగవంతుని చూచుట యోగము, అతనిని తనయందైక్యముచేసి తానుసేవించుచు కాపాడుట క్షేమము, గాన మానవుడు బ్రహ్మైక్యసిద్ధుడయిన యోగియని బిల్వబడును. చిత్తవృత్తి నిరోధించినను యోగియని బిల్వబడును.

భగవంతుడు తన్ను జేరినను భగవంతుని తానుచేరినను యోగి యనబడును. దేశ, భూలోక, స్వర్గాదిలోకముల నొకటి పాలించువారికన్న సర్వలోకరక్షకుడగు బ్రహ్మర్షి పరమోత్తముడు. రాజసేవకులలో సాన్నిధ్యమునందుండి చాలకాలము దర్శన స్పర్శన భాషణములుగల యువరాజు ప్రధానమంత్రులలో నొకడై రాజాంగీకారమున రాజగును. యితరులు సామాన్య ఫలము లందెదరు. భగవత్సేవకులలో కొంతకాలము సాన్నిధ్యమందుండి దర్శన స్పర్శనాదులుగల వారందరు బ్రహ్మర్షులయ్యెదరు.

భారతము-అశ్వమేధపర్వము. 1 ఆశ్వాసము. కృష్ణుడు అర్జునునితో చెప్పుట:— తే॥ అవ్యయానాదితత్త్వము - చక్షురాది కంబు। లైన యింద్రియములకు గ్రాహ్యంబుగాదు సకలమల నిరాసాజ్యప్రసన్నతరమ। నః ప్రదీపంబు తద్దర్శనంబొనర్చు॥ ఆభగవంతుని చక్షురాది యింద్రియములు స్వయముగా జూడ లేవు. మనుస్మృతి— 'మనస్సత్యేనశుధ్యతి' మనస్సుసత్యము పల్కువానికి శుద్ధమగును (నిత్యము అబద్ధములతో జీవించు వానిజనులునమ్మరు. తుదకతడిహాపరసుఖము గాంచడు. పరీక్షించిన తెలియునుగదా) సత్యవంతుడు నిత్యవిజయుడగు. "సత్యంపద్మాశ్రితాసదా" రామాయణము, ప్రకృతి మొదలగు నానావిధలక్ష్ములు సత్యవంతుని ఆశ్రయించియుండును. "శ్రీసూక్తమున మనసః కామమాకూతిం వాచస్సత్యమశీమహీ॥ వాక్కు సత్యముపల్కుచున్న మనస్సంకల్పసిద్ధిగల్గు

నని భావము. "తైత్తిరీయోపనిషత్తు" సాత్వికాహారముతిన్న పరిశుద్ధమనస్సుకల్గును. స్కందోపనిషత్తు-మనుష్యులకు పరిశుద్ధమనస్సే మోక్షకారణము. "మనోద్వివిధంచైవ శుద్ధంచా శుద్ధమేవచ అశుద్ధంకామసంకల్పం శుద్ధంనిర్విషయంమనః" ప్రకృతి కామముక్కోరిన అశుద్ధమనస్సగును. నిష్కామము జెంది భగవంతుని ధ్యానించునట్టిది పరిశుద్ధమనస్సనబడును. గాన పరిశుద్ధమనస్సనే పెద్దదీపముచేరిన చక్షురింద్రియము దేవుని చూడగలదు.

కం॥ కలయంగ నెల్లయెడలన్ । దలలును, లోచనము లును బదంబులుహస్తం । బులునై యాతత్వంబు । జ్వాలభంగి వెలుంగ యోగవంతుడుగాంచున్॥ అనగా పురుషసూక్తమున చెప్పబడిన "సహస్రశీర్షః పురుషః" అనియు ముఖాది అంగములు బ్రాహ్మణక్షత్రియాదులుగా వర్ణింపబడిన విష్ణుగు పమన దేవునిరూపము, యోగవంతుడన నిష్కామచిత్తధ్యానిచూడగలడు. ఆచరించినవానికిగదా దీని ఫలము ప్రత్యక్షమగుట, లేనివానికి దున్ననినేల, విత్తులుజల్లగిబీడు పొలమున వడ్లుపండగోరువానిఫలమువంటిదిగదా! వృథాలగ్నములుమాని మానవజన్మ మీలోకాన స్థిరముగానుండకుండుటజూచి ముందేదోకలదని నమ్మిచు తానెచ్చటనుండి యీలోకానికివచ్చెనో తెలియకుండుటయు, కొలదికాలమే యిచ్చటుండుటని తెలిసికొని గర్వాదులుడిగి నిష్కామ సన్మార్గాన భగవంతునర్చించి బ్రహ్మర్షులగుట మానవజన్మ

సాఫల్యముగదా ! రాజసేవకులుగాని, వర్తక, రైతు, కార్మిక సేవకులుగాని, గృహస్థులుగాని, పేదవారుగాని, ధనవంతులుగాని, మంత్రులుగాని, రాజులుగాని, కుంటి గ్రుడ్డి మొదలగువారుగాని, స్త్రీలుగాని, బాలురుగాని, నిష్కామసన్మార్గమున నిత్యము ప్రేమతో భగవంతుని సేవించువారైన బ్రహ్మర్షులై మానవ జన్మసాఫల్యము జెందగలరు. అతని విడిచినచో మొదట కొలదికాలము సుఖముగానున్నను తుదకు నానాకష్టములపాలై ఇహపరసుఖములపొందరు. ఇంతకన్న వేరుమార్గము లేదు. ఇంతకన్న వేరుమార్గములేదు. గ్రంథములు తప్పనక ఆచరించి చూడుడు.

భారతమతము అన భగవన్మతము— భక్తి, జ్ఞాన, కర్మయోగములు. భక్తి అన ప్రేమ. జ్ఞానమన భగవంతుని అంతటనుజూచుట. కర్మమన దుష్కర్మసత్కర్మములకన్న శ్రేష్ఠమగు నిష్కామకర్మము. అనగా ప్రేమతో భగవంతుని అంతట జూచుచు తాను నచ్చుసత్కర్మఫలముల భగవదర్పితముచేయుట. ఇట్లుమూడుకలిపిచేయుటచే ప్రయాగలో త్రినదీసంగమస్నానమువలె కైవల్యమునిచ్చును. "ఖుర్ఆన్" మహమ్మదీయమతము. భక్తికర్మయోగములుగలది. భగవంతుని ప్రేమతో పూజించుచు దుష్కర్మములుచేయక సత్కర్మములు చేయుచు జీవించుట నిష్కామ కర్మము లేదు. బైబిల్ క్రీస్తుమతము. భక్తికర్మయోగములుగలది. బౌద్ధమతము—భక్తికర్మయోగములుగలది. భగవంతుని ప్రేమే

యనులేదు. ప్రేమతో మానవుల గౌరవించుచు సహాయము చేయుచు సత్కర్మములు చేయుట. దుష్కర్మములు చేయరాదు. దేవునిపూజింపకున్నను, సత్యము, అహింస పరసహాయధర్మములతో మానవులునడిచిన ఇహసుఖము గల్గకమానదు. దాన స్వర్గము లేదని వారు చెప్పినను పరమున దీనిఫలము స్వర్గముకల్గకమానదు. ఈజగమునకు నాథుడొకడు లేడని వారిచ్చవచ్చినట్లు అసత్య, హింస, అధర్మములతో నడిచిన ఇహమున సౌఖ్యములు గౌరవములు గల్గక పరమున లేదనినను నరకము గల్గకమానదు. తక్కినమతములెన్ని భూలోకమునన్నను వాటిని మానవుడు యెరిగినను యెరుగకున్నను వాటి ధర్మములన్ని యీనాల్గుమతములలో చెప్పిన సద్ధర్మములకు మించియుండవని ఆమతస్థులెవరైన వాదించిన భారత మతగ్రంథములలో మంచిమార్గముతో కొద్ది భేదముగా వారి మతసద్ధర్మములన్నియు నేనొకడనే చూపించ గలను.

ఉత్తర గీత:— "జ్ఞానేనహీనః పశుభిస్సమానః" గజేంద్ర ధృవ ప్రహ్లాదులవలె దేవునంతటను చూచుచు దేవునిధ్యానించువారు ధ్యానులు. అది విడిచి దేవునిచూడని ధ్యానపరులైన దాన స్వల్పఫలమేగల్గునని భావము. యీజ్ఞానమార్గము బౌద్ధాదిమతాలలేదు. గాన ఓ మనుష్యులారా భూలోకమంతటికి సరిపోయినది సర్వమతసారమగు భగవన్ మతమే శ్రేష్ఠమైనదని నొక్కి చెప్పుచున్నాను. ఆచరించినగాని దీనిఫలము తెలియదు. పాశ్చాత్య దేశాల రాజు

యోగ్యుడైన అవ్రిజలకు కృతయుగము. దుష్టుడైన కలియు
గమని సాయూహ. భారతదేశమునకు అంతేగాని. భారతదే
శమునకుమాత్రము కాలమునుబట్టి కలియుగమనియు, ఇందు
చాలమంది మిక్కిలి అధర్మమార్గములనుండి దేవ, దేవతా
భూజలుమాని, అధర్మమార్గ ధనార్జనతో దుష్కార్యములై
చరింతురనియు, కొలదిమంది మంచివారు ధర్మమార్గచరు
లెప్పుడుందురనియు. అజ్ఞానులు అనకొందిధర్మమార్గముతో
ప్రకృతిసత్యపరులు దేశమునేలుదురని ఋషులు వ్రాసిరి.
భగవంతుని, దేవతలధర్మమార్గమున పూజించినచో కలి
దోషముపోవునని ఋషులేవ్రాసిరి. కలియుగలక్షణమని చెప్పక
భగవంతునిగాని, యింద్రాదిదేవతలగాని ధర్మమార్గమున
పూజించి తత్ఫలము కృతయుగములోవలె భారతీయులు
పొందుదురుగాక.

భక్తిదర్శనము:– "సాపరానురక్తిరీశ్వరే" భగ
వంతునియందు ఎడతెగని పేమ, తండ్రియందు పుత్రుని
కున్నట్లుగల్గుటభక్తి. సూర్యపురాణము "మానసాభావనా
భక్తి" మనస్సు భగవంతుని భావించుటభక్తి. ప్రేమతో
భావించుట పరిశుద్ధభక్తియగును.

గీత॥ 12 అ. జ్ఞానాత్ ధ్యానం విశిష్యతే; ధ్యానాత్
కర్మఫలత్యాగః త్యాగాత్ శాంతిరనంతరం" అంతట
జూచుటకన్న నిష్కామముగా అతనిస్వరూప మహిమాదుల
పరకోర్కెలులేక వర్ణించుట గొప్పది. దానివల్లగల్గు సత్ఫ

లమును భగవదర్పితము చేయుట త్యాగము గొప్పది. దీన శాంతి అన కైవల్యముగల్గును. అనగా అంతట భగవంతుని జూచుచు నిష్కామముగా అతని స్వరూపమహిమాదులు వర్ణించుచు దానగల్గుసత్ఫలము అతనికే యిచ్చినచో కైవల్యముగల్గునని భగవంతుడగు కృష్ణుని నిర్ణయము. లోకకములో ఒకసాధుపురుషుని ప్రేమతోజూచి గౌరవించి అతని సుగుణాదులవర్ణించి అతని సేమి నడుగక సంతోషము నున్నచో అతడు తిరిగి ప్రేమించి అతనికి మహోపకారము చేయనెంచినట్లే, దేవుడు చాలదూరనివాసియు, సర్వ ప్రభువుఅయి పరమేశ్వరితోనున్న పురాణగృహస్థుడు, అతనినుండిపుట్టినవాడేజీవుడు. ఇతడు త్రిదేహధారియగుటచే జననీజనకులగూర్చి నిష్కామముగా వారిస్వరూపమహిమాదులు వర్ణించుచు తనసత్కర్మఫలము వారికిచ్చినచోసంతసించి తిరిగి నానావిధసత్ఫలముల కష్టముల వదలించియిత్తురు. ఉ॥ ధ్రువుడు, ప్రహ్లాదుడు. దర్శన స్పర్శనభాషణలు దేవునితో గల్గి తగుఫలములబొందిరి. గజేంద్రుడు ఛాయారూపము దర్శించి ఆరూపముతో తనకష్టముల బాపుమని దీనప్రార్థన చేయదర్శనమిడి, కష్టములబాపి భగవంతుడగు విష్ణువు తన రూపధారి అనగా సామాన్యపదవినిచ్చెను. గాన మానవునికి భగవంతుని ఛాయారూపదర్శనమైనను అయినగాని కష్టములు నెరవేరవని తెలియుచున్నది. కాశీపూర్వమొకరు పోయిన బాటనుపోయినప్రతివారు కాశీచేరగలరు. గనుకనే

“గురుర్వాక్యం, శాస్త్రదృష్టం, తృతీయం ఆత్మనిశ్చయం” అను గురువు చెప్పినది ఒక ఋషిమార్గానికి సరిపోవలెను. దాని ప్రకారముపోయిన ఫలమివ్వవలయును. లేనిచో నిష్ఫలమగు శాస్త్రములగల్గుసత్యార్థము వెతకవలయునేగాని గ్రంథములు తిప్పనరాదు. తప్పిన నీవు కొంతకాలమునకు సన్మార్గముకనుగొనిన భారతమతగ్రంథములలో అడుగుండకపోదు.

స్కందోపనిషత్తు — “అభేదదర్శనంజ్ఞానం” సర్వము తనయందు భగవంతునిజూచుటే జ్ఞానము. ప్రేమతో అంతట భగవంతునిజూచుచు నిష్కామధ్యానముచేయుటే భక్తి, జ్ఞాన కర్మయోగములు. ఈమూడును ఒకదానికొకటిసంబంధములు. ఈస్థితిలేనివానికి పూర్ణఫలమురానేరదు. ఈస్థితిజెందుటచే గజేంద్ర, ధృవ, ప్రహ్లాదాదులు భగవద్దర్శనముజెంది అతనికృపకుపాత్రులైరి. ఖురాన్, బైబిలులో జ్ఞానమార్గమంతగా ఆచరణలోయున్నట్లుగానరాదు గాని భక్తికర్మయోగములు పూర్తిగాగలవు ఈమార్గానపోయిన వారును కొంత తేజోవంతులుగా మారకపోరుగాని, విశ్వామిత్రాదులవలె బ్రహ్మర్షులుగామారినట్లు దేశచరిత్రలుగానరావు. ఈలోటుపూర్తిచేసి ఆచరించుడని బోధించుటే లోకైక మతాభిప్రాయము. బౌద్ధమతము — దేవుడులేడు సత్యాహింసాదులు విడువరాదనికలదు. సత్యాహింసలు పైచెప్పినఫలమిడువరకైనను వారాచరించినట్టు గానరాదు. ఏవిధినైన అన్నవస్త్రములు పూర్తిగానుండుటె మంచిదని వారభిప్రా

యము. భగవన్ని వేదనముచేయని లేక ఇంద్రాదిదేవతలకిడ సది సాత్వికాహారమైనను దుష్టాహారమని కృష్ణుడు ఋషులు వ్రాసిరి. అట్టిదుష్టాహారమున సన్మేధగల్గక దుష్టకామవృద్ధియై దుస్సంతతిగల్గి వారితో నానాబాధలుపడుగృహస్థు లనేకులు గలరు. దాన డాంబికమతమై ఆమతమన్ని దేశాల నామ మాత్రమైనది. దేవుని సత్యాహింసాదిసన్మార్గముల భక్తి, జ్ఞానకర్మయోగములతో పూజించుచు పరులకు బోధించుటే భగవన్మతాభిప్రాయము. అగ్గిరాయి, ఇనుము మనుష్యుడు చేరిన అగ్నికల్గును. ఈభగవన్మతము తెలిసికొనినంతనే లాభములేదు. భక్తులారా అట్లాచరించి ఫలము చెందిన నామగదా బ్రహ్మానందయుక్తుడగుట అనగా బ్రహ్మైగా మారుట.

## నిష్కామకర్మఫలము

భాగవతము.— స్కంధము 7, ప్రహ్లాదుడు చెప్పుట— నిష్కాముడన దుష్కర్మములు చేయరాదు. సత్కర్మము చేయుచు తత్ఫలము, పుత్రుడు యజమాని కానున్నప్పుడు సంపాదించినధనము తండ్రిదరి దాచినట్లు భగవదర్పితము చేయుట.

"నిరాలంబోపనిషత్తు॥" నిష్కామ కర్మమునే అకర్మముగా చెప్పినాడు. అకర్మమన సర్వసత్కర్మముః ఫలకాంక్ష విడిచి తత్ఫలము భగవదర్పితముచేయుట అనికలదు. భాగవతము.— కామంబులువిడిచిన పురుషుడు అనగా నిష్కాము

డగు పురుషుడు నీతోసమాన విభవుండగునని ప్రహ్లాదునితో నరసింహుడు అన్నట్లున్నది. గాన నిష్కామకర్మము భగవత్సమానత సిద్ధునని భావము.

## దుష్కర్మము - వ్యభిచారము

"విరాట్పర్వము" బలవంతుడగు కీచకుడు సాధ్వియగు ద్రౌపదిపై మోహముజెంది ఆమె లేనికాలమున తన తనయింటను, బైటను ఆమెను బలాత్కరించు దుష్టప్రేమతో చూచుచు మాట్లాడ ప్రారంభించెను. ఆకాలముననే విరటునిభార్యకల్లుదేవ ద్రౌపదినిపంప ద్రౌపది త్రోవలో సూర్యుని అర్చించి విష్ణుని తనహృదయమందు నిల్పి వెళ్లెను. వెంటనే సూర్యుడొక రాక్షసుని ఆమెకుసహాయముపంప ఆమెయందతడుండెను. కీచకుడు ఆమెపైపడబోవ రాక్షసుడు గెంటివేయగా ఆకాలమున ఆమె పారిపోయెను. మరునాడు రాత్రి భీమునిచే కీచకుడుచచ్చెను. జీవితమును బ్రహ్మర్షిగామార ఉపయోగింపక దుష్కర్మమునకై ఉపయోగించిన వేయి సింహాలబలముగల వాడయ్యు సింహబలుడు బలహీనుడై ప్రాణములు బోగొట్టుకొనెను. అంతమున యీకర్మను నరకమిడమానదు. సాధ్వీస్త్రీలు దుష్టుల భయముకల్గిన ద్రౌపదివలె దేవుని ప్రార్థించువారు అవమానపడరు. లేక నో కష్టముల పాల్పడుదురు. అదివరకు వ్యభిచారులైయున్న దుష్టస్త్రీల ప్రేమతో బొందువారు పాపయుక్తులై రోగముల తోగాని, యీ స్త్రీ సంబంధపురుషులవల్లగాని అవమాన

మృత్యువులబొంది తుదకు నరకముపొందక మానరు. దీన బ్రహ్మచర్యవ్రతభంగమై ఆయువుపోగొట్టుకొనును. పరస్త్రీలు మంచివారైనను, చెడ్డవారైనను వారినిదుష్టప్రేమతోజూచి పల్కరించుట మొదలగునవిగలవారు అకాలమృత్యువు నొందక మానరు. సుశ్రుతవ్యాఖ్యానములో పరస్త్రీలు, విషము, అగ్ని, జలము అకాలమృత్యువు నిడువారనికలదు, గాన వీరి దరిని జాగ్రత్తగా సంచరించునది.

## నిష్కామకర్మము

సాధ్వియగు సీతను దుష్కాముడుగాక, నిష్కామ ప్రేమతోజూచుచుమాటలాడి చావనున్న సీతకు మృత్యువు తప్పించి సహాయపడిన హనుమంతుడు లంకలో సహాయము లేక తానొకడైనను విజయముజెందెను. ఎట్టిపాపముచెంద లేదు. ఆపదలందుగాని, నీతిబోధించుకాలానగాని నిష్కాముడై ప్రేమతోజూచి సహాయపడిమాట్లాడిన నీతిబోధించు వారు హనుమంతునివలె సర్వకార్యసిద్ధి, శత్రువిజయము చెందుదురు. నూనెగుడ్డలుతోకకుచుట్టి అగ్నిఅంటించిన హను మంతుడు కాలిచచ్చునని అట్లుచేసిరి. సాధ్వియగుసీత హను మంతునికి కాలకుండ అగ్నినిప్రార్థించి సహాయపడగా కాల లేదు. అదిగ్రహించి హనుమంతుడు లంకయంతయుగాల్చెను. నిష్కాములుఉత్తములగు స్త్రీ పురుషుల పరస్పరసహాయము వారికి పూర్ణలాభమిడి దుష్టులకు పూర్ణనాశనమిచ్చును.

మనోవ్యభిచారస్త్రీలకు, దుష్టవ్యభిచారస్త్రీలకు నిష్కామ ప్రేమతో నీతిబోధించువారు సుఖము, గౌరవము చెందుదురు. వీరిబోధల, వారు వ్యభిచారము దోషమని మాని భగవంతునర్చించుటలో బడిన, వారునూ సుఖము జెందగలరు. పూర్ణవ్యభిచారదుష్టస్త్రీగణము దుర్యోధన, రావణాదులవలె ఒకడుచెప్పినను. దేవుడుచెప్పిననువినరు. వారికి నీతి సత్యాది సన్మార్గములబోధించుట వ్యర్థఫలమిడునుగాన వారిని విడుచునది అట్టిస్త్రీలకు నిష్కాముడై బోధించుటచే దోషము చెందడు. పూర్ణదుష్టస్త్రీలు అహల్యవలె మరల దుష్టములనాచరింపక తపస్విన్నులై భగవంతుని దర్శించిననాడు ఇహపరసుఖము చెందెదరు.

## భగవంతుడు

"ఐశ్వర్యస్య సమగ్రస్య వీర్యస్య యశసః శ్రియః। సన్మార్గశ్చావబోధశ్చ షణ్ణామర్థే భగస్మృతః" ఈగుణములు గలవాడు భగవంతుడు "ఉత్పత్తింప్రలయంచైవ భూతానామాగతింగతిం। వేత్తివిద్యామవిద్యాంచ।సవాచ్యో భగవానితి" భూతముల త్పఉత్తి, స్థితిప్రళయములు విద్యావిద్యలు తెలిసినవాడు భగవంతుడు. ఈస్థితిభగవదర్చనసేయు మానవుని యందు కన్పడిననాడు భగవంతుని లక్షణముపట్టినదని గ్రహింపదగును. కానిచో ఆస్థితిపట్టువరకు మానవుడు దేవుని ఆరాధించుట మానరాదు. డాంభికులగు శుష్క

వేదాంతులువృద్ధియై సర్వశాస్త్రములువదలి ఇహపరసౌఖ్యములు లేనివియు ఫలితమెన్నటికైన కన్పడనిమార్గములు, వ్యభిచారదుష్టస్త్రీలకు, మూఢస్త్రీలకు, మూఢులకు బోధించి అదియొక సంఘముగాచేసి మాది వేదోక్తమార్గము మానిభగవద్గీతామార్గమని వ్యర్థముగా వాదములుసేయుచు వారివల్లవాతాపియిల్వలులవలె ధనభోజనాదులు సంపాదించుచు లోలోనదేవుడు లేడనుకొని పైకిఉన్నాడని చెప్పుచు వ్యర్థముగా గాలముగడుపుచు కొంతకాలము యిహసుఖము కొంతపొందుచు తుదకు జనులచేనిందింపబడుచున్నారు. అట్టివారితో యీమతస్థులువాదముసేయక యోగఫలసిద్ధికై ఆవాద స్వల్పకాలమును వినియోగించునది. గురువుచెప్పినవాక్యములు శాస్త్రములో గన్పడుచు, ఫలమిడుమార్గము సమమైననాడు ఆచరించిన ఫలముబొందగలడు. ఇహశక్తిజూచి పరఫలము నమ్మదగినది. ఇహమున కొద్దిశక్తిగల్గించనిమార్గము పరఫలమిడదని నాయూహ. మెట్టవేదాంతుల పుస్తకములు సత్యవేదాంతుల పుస్తకములు ఒకటిగానేయుండును. వారిఅర్థము వేరు. వీరి అర్థము వేరుగానుండును. మెట్టవేదాంతుల అర్థముఆచరించిన ఫలమిడదు. ఇదియేగురుతు. సత్యవేదాంతుల అర్థమార్గమున నడచుట, జనులు తన్ను బ్రహ్మర్షియని విశ్వామిత్రుని, దేవతలు, బ్రహ్మ, వసిష్టుడు అంగీకరించినట్లు అంగీకరించువరకు మానరాదు. తప్పినదని భయముగల్గినశాస్త్రప్రమాణములచే మరల సరిచేసుకొనదగునేగాని విసికి విడువ

రాదు. శాస్త్రమార్గముతప్పక ఫలమిచ్చితీరునని చెప్పు చున్నాను. భగవంతునిపూజించుటలో భారతదేశకులములు పడమటిదేశ సంఘములు సమానమే.

భగవద్ధ్యానపరులకు కులము సంఘము అవసరము లేదు. తాను, భార్య, పిల్లలు తనయింటియందు ఉదయ సాయంత్రములు ధనార్జనాదికర్మములతో పాటు భగవంతుని జపధ్యానాదులుచేయుట భూలోకసర్వగృహస్థులకు హక్కై యున్నది. ఇతరుల నీకాలమున తనయింటికిచేరనీయ రాదు. ఈమతమున మానవుని బాహ్యాంతరేంద్రియములు ప్రజలు. రాజు. రారాజగు భగవంతుని తనయందైక్యము చేయుటగాని (ఇదిసాయుజ్యము) అతనివలె అగుటగాని (ఇది సారూప్యము) అతనిదరినుండుట (సామీప్యము) అతనిలోకము లోనుండుట (సాలోక్యము)పొందనిర్ణయించి నడుచవలయును. మానవుడుజీవించియుండగా బ్రహ్మర్షిగామారుటయే, జీవన్ ముక్తుడగుట, కైవల్యసిద్ధిచెందుట, అగును. ఇదిచాలగొప్పసిద్ధి. ఇట్లే భార్యనెగ్గిన బ్రాహ్మణియగును. పిల్లలునెగ్గిన బ్రహ్మర్షుల గుదురు. తల్లిదండ్రులు పిల్లలనుబాల్యమందే బ్రహ్మవిద్యా మార్గముననడిపించుచు ప్రకృతిసత్యమార్గము తెల్పుచున్న త్వరితకాలములోనే పిల్లలు బ్రహ్మర్షులై ప్రకాశింతురు.

ఒకమానవుడేరాజు. తనకుసేవకులగు కర్మేంద్రియ ముల (కార్మికుల) జ్ఞానేంద్రియముల (సహాయుల) అంత రేంద్రియముల (గొప్పసహాయుల) తో నిష్కామకర్మము

భక్తిజ్ఞానాదులతోగూడి చరించుచు. తత్ఫలము రారాజైన భగవంతుని కర్పించుచున్న తండ్రినిసేవించు సత్పుత్రుడు కొంతకాలమునకు తండ్రింతవాడై తండ్రికిగల సర్వము వహించి తండ్రివలెనే తండ్రికిగలరాజ్యముపైగాని గృహము పైగాని, పొలముపైగాని పాలింపశక్తిగలవాడగును. అనగా తండ్రి పుత్రునితో సాయుజ్యము పొందినాడనుట. ఇచ్చట తండ్రికొడుకులు విడిగాకన్పడినను ఏకాభిప్రాయములో నుందురనదగును. భగవంతునర్చించు జీవునియందు ఏకముగా చేరుటచే భగవంతుడు జీవునిజీవన్ముక్తునిగాజేసి సర్వశక్తివంతునిచేయును. జీవునితోగాని, యితరముతోగాని యేకమైనిల్చుశక్తి భగవంతునికిటక్క ఇతరులకులేదు. తండ్రినివసించుయింటియందుపుట్టుట (సాలోక్యము) తండ్రిదరి నుండుట (సామీప్యము) తండ్రియంతవాడగుట (సారూప్యము) తండ్రివలె భార్యనుపొంది జననీజనకుల పోషించుచు సాధు సాధ్వులగు జననీజనక అభిప్రాయము, తన అభిప్రాయము యేకముచేసి తండ్రి ఆస్తికిప్రభువగుట సాయుజ్యము. తండ్రి యెంతటిశక్తివంతుడో కొడుకంతటిశక్తివంతుడగుట సాయుజ్యము. ఇట్లే సర్వజనకుడగు భగవంతుడు జీవునితో సాయుజ్యము చెందుననుట కేసందియముండదు. వ్రాసిన భావమే మరలవ్రాసినను కొద్దియైన ఉన్నతభావముచేర్చిన వాడు పండితకవిగదా! ఇతరు లట్లువ్రాయలేరు.

గురువుసన్నిధిని విద్యకొంతకాలమునేర్చిన శిష్యుడు

అట్టివిద్య నేర్చువారికి మరల గురువగుచున్నాడు. "ప్రైత్రికీయము" మాతృదేవోభవ, పితృదేవోభవ, ఆచార్యదేవోభవ! తల్లిదండ్రి గురువును, అతిథిదేవోభవ, తనయింటభోజనమునకై చేరినిఅతిథిని దేవునిగా ప్రహ్లాదునివలె చిన్నతనమునుండి జూచుట అభ్యసించినవాడు బాల్యమున విద్యాంతముచేయు నాటికే ఋషిగాగాని, మహర్షిగాగాని, బ్రహ్మర్షిగాగాని మార్పుచెందగలడు. బాల్యమునుండి బ్రహ్మవిద్య ప్రకృతివిద్య అభ్యసించువాడుత్వరలోగొప్పశక్తివంతుడగును. కొందరువర్తకులు జర్మనివస్తువులతో లాభముచెందుటచే, తమకు హిట్లరుదయవల్ల లాభముగలిగెనని అతనిని మహాత్ముడనిరి. రష్యాలో స్టాలెన్, లెనిన్‌లువల్ల మంత్రిమొదలగు గొప్ప ఉద్యోగములు లభించుటచే మాలెటావు మొదలగువారు వారిని మహాత్ములనిరి. ఒకడు సత్యాసత్యనిర్ణయము తెలియనివాడైనను వానివల్లలాభముపొందువారు వానినిమహాత్ముని దయవల్ల సౌఖ్యముగానున్నామందురు.

## శ్రీకృష్ణనిర్ణయము - మహాత్మశబ్దము

మహాత్ముడని హేళాకోళముగా ఒక సామాన్యుని కొందరందురుగాని, మహాత్ముడన సర్వమును భగవంతునిగా జూచువాడు. గాన వానిదృష్టిలో అందరును భగవంతునితుల్యులగుదురు. దాన సమదర్శనుడని పేరుపొందును. ఏకర్మముచేసిన దానినే అనుభవించుచున్నట్లు అతడు కొంత

కాలమట్లుచూడగా అందరికి అతడు భగవంతునివలె కన్పడుటగల్గును. గాన యీదివ్యదృష్టిగలవాడు నిష్కామముగా జూచుచుండును. ఈదృష్టిపడి పరులకు కొంతమంచిగల్గునేగాని చెడుగల్గదు.

గీత॥ వాసుదేవ స్సర్వమితి సమహాత్మా సుదుర్లభః॥
సర్వమును వాసుదేవుడుగా జూచువాడే మహాత్ముడు. అట్టివాడు లభించుట ఎప్పుడోగాని గల్గదు. ఇట్టివాడే సమదర్శనుడు. కాని ఇతరుడుగాడు. ఒకదేశములో రైతులకుకుటుంబము జగగతగిన భూమిని అందరికిసమముగాయిచ్చి ధనవంతులులేకుండాజేసి ఇదేసమదృష్టిఅనిరి. ప్రారబ్ధకర్మము మంచిదైనవాని పురుషప్రయత్నము ఫలించి మంచిపంటనిచ్చును. లేనిచోవానికి స్వల్పపంటనిచ్చునుగదా! వీరు ప్రారబ్ధము నమ్మరు. పంటసమముగా పండించలేరు. ఈపంటతిని వారు చేయుపనియేమనగా పొట్టనిండాతినుట. లేనిచోమానుట. స్త్రీ సుఖముపొందుట భగవంతుడని చెప్పరాదు. తప్పైనను రాజపక్షమువారిదితప్పని యింటిలోనైన అనుకొనరాదు. ఆరాజపక్షములో అధికారములుమాత్రము హెచ్చుతగ్గుగా నుండవచ్చు. ఈదేశమున రాజపక్షస్థులకే ఇహసుఖము. తక్కినవారికిఅల్పసుఖము. ఇట్టివారి సమదృష్టి రాజపక్షస్థులకు తప్ప ఇతరులు నానావస్థలపాలగుదురు.

ఒకదేశములో ఎంతధనము సంపాదించిననుతప్పుకాదు. లేకున్ననుతప్పుకాదు. పాలమెంతైనయుండవచ్చు. భగవదర్చన

సామాన్యము. ధనము లేకున్న గౌరవముతక్కువ. ధనమున్న గౌరవమెక్కువ. ఇదిసమదృష్టి అనిఅందురు. ప్రారబ్ధము నమ్మెదరు.

ఒకదేశములో ప్రారబ్ధముగొప్పదైన పురుషప్రయత్నముచే గొప్పఫలముగల్గును. తక్కువైన పురుషప్రయత్నమెంత చేసినను భోజనముజరుగుట కష్టముగా జరుగును. రాజపక్షములో కులమతవిచక్షణ లేదు. ఎవరికివారే భగవంతునియింట పూజించుకొనవచ్చును. గృహాశ్రమములో ఎంతోవిరోధము భార్యాభర్తకుగల్గినగాని విడాకులిచ్చుట లేదు. ధనవంతులైన ధరిద్రులైన సన్మార్గులైన గౌరవము. దుర్మార్గులైన అగౌరవము.

శతరుద్రీయము నమకము :—"ద్రాపే అంధసస్పతే దరిద్రన్ నీలలోహితః" అన్నముకు భర్తా, దరిద్రుడా—అనగా పుణ్యపాపములు లేనివాడా—నీలలోహితుడా అని యీశ్వరుని సంభోధింపబడినది. దేవునివలె యీస్థితినొందుట ఉత్తమ దరిద్రము. దుష్టదరిద్రము, భోజనాదులుతృప్తిగా జగగని స్థితి. ధనవంతము భోజనాదులుజరుగుస్థితి. దీన ఇహకష్టము, యిహసుఖముగాని యింతకన్నఎక్కువగాదు. లేదనితక్కువతినక, ఉన్నదని యెక్కువతినక ఉభయులు తపస్సుచేయుచు అనగా యింద్రియముల, మనస్సును, దేవుని యేకాగ్రముగా ధ్యానించుట ఉత్తమతపస్సు. చాంద్రాయణాదివ్రతముల భోజనాదులతగ్గించి భగవంతునిపూజించుట తపస్సు. దీన

రోగాదులుచేరక యిహసుఖము. సత్సంతతి వృద్ధియగును. మైత్రేయోపనిషత్తు - "తపసా ప్రాప్యతే సత్వం । సత్వాత్ సంప్రాప్యతే మనః । మనసా ప్రాప్యతే త్వాత్మా॥" తపస్సున తమోరజోగుణములుతగ్గి, సాత్వికగుణవృద్ధియగును. దీనిచే మనస్సుభగవధ్యానము చేయతగినదై యుండును. అట్టిమనస్సుచే భగవంతుని ధ్యానించిన అతని కృపారసముగలవాడగును. అతనికృపగల్గిన యిహపరసుఖము లెక్కుడుగల్గి పేదవారికి ధనవంతులకు నిత్యసంతోషము బ్రహ్మానందము నిచ్చునని పండితకవులు ప్రచారముచేయుచుందురు. సర్వజీవుల భగవంతునిగాజూచి గౌరవించుమానవుని సేవయే మాధవసేవయనియు, ఆదివ్యదృష్టిసంపాదించుటయే సమదృష్టిగల్గుటయనియు యీదివ్యదృష్టి రాజుమొదలు, హీనునివరకుగల జనులాచరించవలయు ననియు-అట్లాచరించిన నాడందరు సములగుదురని పండితకవు లేకాలమునను బోధించుచుందురు. అట్లుబోధించరాదని రాజశాసనములేదు. ఈదేశస్థితి, పై దేశీయులకు బోధించి వారినికూడా యీదివ్యమార్గమున ననుసరింపజేసిన లోకములో యుద్ధభయాదులులేక సర్వసౌఖ్యముల ప్రజలనుభవించి తుదకుపరసౌఖ్యములందెదరు.

ఋషులందరు ఎక్కువగాసద్గుణములనే గ్రహించిరి. ఋషులుదుర్మార్గమునచరించిరని కొందరన్నను, భగవంతుని కేదోషములంటనట్లు ఏదోషమును తమ్మంటకుండ జేసుకొనిరి. వారిని హేళనజేయు శుష్కవేదాంతు లున్నను,

ఋషులు ఏకాభిప్రాయము గలవారని భావము. భగవంతుడు అర్చించుజీవునియందు ఏకముగాచేరుటచే శర్వశక్తిసంతు సిగాజేయును. దానిచే పుణ్యపాపవర్జితుడై కైవల్యాప్తు డగును.

ఋషులను హేళనచేయు శుష్కవేదాంతులు నాస్తికశిఖామణులు, శుష్కమతస్థులు దుష్టులు వారివలె దుష్కర్మములుచేసిన హీనులై యిహపరముల కష్టముల పాలయ్యెదరు. ఋషి దుష్కర్మము సుకర్మమగును. వ్యాసుని గనుటలో పరాశరుని నిందింతురు. తాముమ్మాత్రము హీన సంతానము గనుచుందురు. వ్యాసునివంటి మహాపురుషుని గనలేరు. పరాశరుని సత్యవతి సత్సంతతికి అంగీకరించినది; వ్యభిచారిణికానిది ఇదవ్యభిచారమగునని, దాన పాపము గల్గునని భయముగలదియగు, అవివాహితయగు, స్త్రీయందుగాక, అంగీకరించి వివాహితయగు తనభార్యయందు వ్యాసునివంటి పుత్రునిగనిన పరాశరునికన్న అధికులనదగును. లేనిచో ఏనుగునుచూచి కుక్కలు మొరిగినట్లగును. బ్రహ్మర్షి వల్ల ఆకాలమున ఒకేసారి సంయోగయజ్ఞములో సంతానమునకై పొందినదోషముకాదని ప్రజలకు తెలియును. ఈ కథలంతయు విని శంతనుడీమె నెట్లు పెండ్లాడును? పరాశరుడు తన సంబంధమున వ్యాసుని తల్లి కెట్టిదోషము లేకుండా చేసినాడు. పగటి సంయోగముకూడదని సూర్యునికాంతి పడకుండా మంచుమయము చేసినాడు. అదివరకు ఆమె తల్లిదం

ద్రులనైన దేవునిగా చూచుటభ్యాసము తక్కువగలది కావచ్చును. ఆసంయోగయజ్ఞమున మంచులోనున్న సూర్యునిపై ఆ పెద్దృష్టి కేంద్రీకరించియున్నకాలమున తనయందు భగవంతుని ఐక్యసిద్ధిగొన్న మహాపురుషుడుపొందగా సూర్యునివంటి పూర్ణతేజోయశోకీర్తులుగల్గి నారాయణుడే వ్యాసుడనిపించిన మహాపురుషునిగనినాడు.

దుష్టులిట్టి శక్తిలేనివారైనను అతనిని నిందింతురు. దానగల్గుదోషము తర్వాతఅనుభవింతురుగదా! పొలము దున్నగానే పండనియట్లు మహాపురుషుల దూషించిన వెంటనే దోషఫలముకన్పడునా! తర్వాతగదా దానిఫలముగల్గుట. దుష్టవ్యభిచారజనితసంకరుడు హీనుడు అల్పుడగును. గృహిణీసద్భార్యయందుపుట్టిన సత్పుత్రునివంటివాడే వ్యాసుడగును.

## క్షమా మహిమ

శంఖస్మృతి:– "క్షమాసత్యందమః శౌచం। సర్వేషామ విశేషతః" యీగుణములు సర్వజాతిమానవులకుండదగును.

భారతము – అరణ్యపర్వము:– రాజ్యమేలురాజునకు సాధువులపై క్షమయు దుష్టులపై తేజముండదగును. అతిక్షమ దుఃఖంబుదెచ్చు. ఎక్కువక్షమ రాజుతన్నవమానించినవారియందు జూపరాదు. గృహస్థుడుమాత్రము ఆదుష్టుని రాజుచే దండింపజేయునదిగాని తానుదండనచేయరాదు. దుష్టులతో సత్యము చెప్పరాదు.

కర్ణపర్వము:- దొంగలకు సత్యము జెప్పి ఒక ఋషి నరకము చెందెను.

శాంతిపర్వము - హంసగీత:- తన్నవమానించిన ఓర్చుకొనినవానికి (క్షమావ్రతికి) అవమానించిన వానిపుణ్యశక్తి యంతయు జేరుననికలదు. చూచుము:- సామాన్యజనులకు చాలాకాలము ఆచరించిన అట్లుపుణ్యము చేరును. మహాపురుషుల నవమానించిన అనగా దుర్వాసుని అవమానించిన హంసడిభకులను రాజులు త్వరలోనే నాశనమైనట్లు నాశనమగుదురు. దుర్మార్గునివద్ద పుణ్యమెక్కుడుండదుగాన వానిచేరుట సన్మార్గులుమానినచో అవమానము రాదు. సాధువులచే, ఋషులచే, గురువులచే, తల్లిదండ్రులచే అవమానింపబడిన వారికి వారిపుణ్యశక్తి జేరి మేధావంతులగుదురు. సాధుపుత్రులు సాధుశిష్యులం దిపుణ్యమెక్కుడు జేరును.

భారత దేశమున కాంగ్రెస్ సంఘమువారు అప్పటిరాజకీయసంఘమై పాలించు యింగ్లీషువారిచే అనేకసార్లు అవమానింపబడిరి. కాన వారిరాజకీయశక్తి వీరియందావేశించి భారతదేశ ప్రస్తుతపాలకులుగా జేసినది. పూర్వమెప్పుడో ఋషిచెప్పిన భారతవాక్యము చాలకాలమువిూ ఎకక్షమావ్రతమాచరించిన కాంగ్రెస్సువారికి దానిఫలము ప్రత్యక్షమైనది. అట్లేవిడువక సత్యాహింసాది సద్గుణముల యిప్పటివారు చాలాకాలమాచరించిన ఫలము ప్రత్యక్షముగాక మానదు. అవమానించు వానిని దేవునిగాజూచు జ్ఞానికి

వానివల్లయెట్టి అపకారముజరుగక త్వరలోప్రహ్లాదునివలె వారి పుణ్యముజేరి అవమానించువారు నశింతురు.

కాన క్షమావ్రతమందరికి మంచిదనివ్రాసిరి. దుష్టుల విడిచి సాధువులచే అవమానింపబడక స్నేహమున చరించు క్షమావ్రతుడు యోగసిద్ధిత్వరలో పొందగలడు. దేవుని శక్తిపొందవలెనని ప్రయత్నించి విఘ్నములుపొంది పరులు జూచి హేళనచేయువారిని విడిచి దేవునివల్ల యిదికలైనని మరలప్రయత్నించి చాలకాలము విసువక క్షమావ్రత మాచరించిననాడు దేవునిశక్తిపొందగలడు. ఎవనివల్ల దానవమానముపొందితి ననుకొనునో వానిపుణ్యమే ఈతనికి గల్గునని భావము.

“ద మ మ హి మ ”

శాంతిపర్వము 3. ఆశ్వా 406 ప॥

తే॥ గీ॥ దమమునిశ్రేయసము పుణ్యతమము ధర్మసార మిది వెలిగాధర్మసంచయంబు। సిద్ధిబొందు నెll.

కం॥ శీలంబు, మైత్రికరుణయ। లోలుపభావము తితిక్షలో। నగుమునిలో। కాలంబనీయసద్గుణ। జాలంబు దమంబు రూపసంపదయధిపా.॥ దమముగలవానికి బ్రహ్మపదము దగ్గిరదని చెప్పుదురు.

శాంతిపర్వము — 5 ఆశ్వాసము:— తే॥ గీ॥ వేదసారంబు సత్యంబువినుడు సత్య। సారమూర్తి దమము, దమసార మనఘులార మోక్షము॥

కం॥ దమమున కర్మేంద్రియముల శమియింపగ సేత॥ దీన ధర్మపరుడగును. దీన మహాపాపములుపోవును. ఏమియు లేనివానినిందించిన వాని పాపములు నిందించువానిం చెందును. క్రోధముతో చేయువాని వ్రత, జప, తపోదానాదులు ఫలము యముడు నశింపజేయును.

క॥ సత్యక్షమాదమంబులు । నిత్యపదంబునకు నెక్కసిచ్చెన॥ అనికలదు.

స్కందోపనిషత్తు:— 'శౌచమింద్రియనిగ్రహం' అంతరబాహ్యేంద్రియముల విడిచి తాను అన జీవుడొకడే దేవుని నిష్కామధ్యానమున సోహంభావమున పూజించుట గొప్ప శౌచమగును. మృత్తుజలముచే దేహమున కడుగుట అనగా 'వర్షమమృతం' అని అథర్వవేదము. వర్షపునీట, పాతాళగంగను, గంగానదీనీరముల, బట్టీపట్టినసీటను స్నానమాడుట పుణ్యస్థలమనగా హిమవంతము మొదలగు పుణ పర్వతముల, మారేడు, తులసి మొదలగు మొదటనున్న మట్టితోను గంగానదీపుణ్యమృత్తికతో స్నానమాడిన పూర్ణమైన బాహ్యసిద్ధియై దేవునిపూజింప అంతశుద్ధిగల్గించును. తక్కినవి మూడవరకము. నదులలో పాతాళగంగగలచోట్ల స్నానముకొంతఫలమిడును. గాన శంకర్షి యీనాల్గు అందరికి ఉండవలెనని వ్రాయుటజూడ వీటి గొప్పఫలము అందరికిగల్గిన లోకముపై కుంఠమువలె నుండుననితలంచియే వ్రాసినట్లున్నది. సత్యాధిక్యత క్రిందవ్రాసితిని.

శాండిల్యోపనిషత్తు:— 'అహింసా సత్యాస్తేయ, బ్రహ్మచర్యదయార్జవ। క్షమాధృతి మితాహార శౌచానిచేతి యమా దశ' అహింసాది పదియు యమములు.

అహింసయనగా "మనోవాక్కాయ కర్మభిః సర్వభూతేషు సర్వదా క్లేశజననం" తనమనోవాక్కాయ కర్మములచే సర్వ దేహ దారులకు కష్టముపుట్టింపకుండుట.

బృహస్పతిస్మృతి:—" వేదవిద్యా వ్రతస్నాత శ్రోత్రియే గృహమాగతే। క్రీడయంత్యోషధయ సర్వాయాస్యామ పరమాంగతిం" సత్యమార్గవ్రతుడగు మహాపురుషుడు గృహమునకురాగా భక్షణార్హములగు ఓషధులు మనము ఎట్టి ఉత్తమగతి పొందెదమోఅని సంతసించుచున్నవి. అనృత మార్గస్థుడగు దుష్టుడట్లురాగా "రుదత్యన్నం కిమ్మయా దుష్కృతం కృతం" నేనేపాపగతిని పొందెదనోఅని అన్నము ఏడ్చుచున్నది. గాన వేదవిద్యావ్రతస్నాతులు సాధువనదగును. ఈసాధువు భక్షించు, త్రాగెడి ఆహారజలముల గల జీవులు, చూచెడుజీవులు, త్రొక్కబడు అంటబడు జీవులు సంతోషముజెందుననదగును. దాన జీవులకు ఎట్టి కష్టము కల్గించకుండుట గల్గినది. గాన అహింసావ్రతసిద్ధి గల్గుచున్నది. గాన మానవుడు సాధుమార్గస్థుడైన భగవంతునిచే రక్షింప అర్హుడుగాన భగవత్ కృపాపాత్రుడే అహింస చేయువాడని తెలియదగు. దుష్టునకే వ్రతసిద్ధి యెప్పుడును కాదు. భగవంతుని కృపయుఁగల్గదు. ఇట్టి సాధుదర్శ

నముచే జంతువులకు విరోధము ఆతనిదరినిగల్గదు.

## సత్యము - ఎప్పుడు జయత్వమిచ్చును

శాండిల్యము:-' మనోవాక్కాయకర్మ భిర్భూతహిత యదార్థాభిభాషణం' సాధుభూతహితముగా మనోవాక్కా-యములచే యదార్థముపల్కుట సత్యము.

దర్శనోపనిషత్తు:- ' చక్షురాదీంద్రియైః దృష్టంశ్రుతం ఘ్రాతం మునీశ్వర। తస్యైవోక్తి ర్భవేత్ సత్యం' చక్షువు-చక్షువులు మొదలగు యింద్రియములకు తెలియబడునది. విన్నది, వాసనచూచినది అగువాక్యముపల్కుట సత్యము. అసత్యవాదియగు దుర్యోధనుడు మొదటజయించినను తుదకు సర్వనాశముజెందెను. సత్యవాదియగు ధర్మరాజు మొగట ఓడినను తుదకు జయించి సర్వరాజ్యము ప్రజాసుఖముగా నేలెను.

" భారతము - శాంతిపర్వము - 3 ఆ. 45 పద్యము "

సత్యముకదాఅని అన్నిచోట్ల పలుకరాదు. అర్థంబు, ప్రాణంబు, హరియింపజూచు పాతకులతో సత్యముపల్కుట పాపము, అబద్ధములాడి వారిని హింసించి వెడలగొట్టుట మేటిధర్మము. సాధుభూతములకు హితముచేయు బొంకు లెల్లను ధర్మములే. సాధుభూత బాధకములగు సత్యవాక్య ములు పాతకములిడును.

డిటో॥ 1 7ప॥:-" సమత, దమము, తితిక్ష, అమత్సరము,

ప్రా। ధృతి ” అనసూయార్యత్వములను అహింసాదాన క్ష మాత్యాజన సూనృతములు. సత్యముయొక్క మూర్తులు. ఇవి గలయోగి తొందరలో సిద్ధిగాంచును.

డిటో 5అ - 54 6 ప:- పర మర్మభేదనములును, నయ విరహితములు, ధర్మకార్యవిముఖంబులు, నిష్ఠురములగు మాటలు సత్పురుషుడవి సత్యములైననుపల్కడు॥ సత్య ముకై బైబిలాదిగ్రంథాల స్వల్పముగలదు. ఇంతవిమర్శ గానరాదు.

డిటో 8అ. 43ప॥ అనృతము పాతకమే. ఐననుసాధ్వీ రక్షణమున, సాధువివాహము చెడనున్నతరి హేళనకు, సాధు వునకు మృతిగల్గుపట్ల తప్పించువాక్యము, సర్వధనము చెడు చోట బల్కిన వాక్యము పాపమిడిక సత్యమువలె పుణ్యమిడును.

అరణ్యపర్వము:- యక్షప్రశ్నలు - సర్వధనియనగా - ప్రియము అప్రియము - సౌఖ్యదుఃఖములు భూతభావికార్య ములు నెవ్వనికి సమంబులో అతడు సర్వధని యనబరగు. ఇట్టి స్థితిజెరుప దుష్టులు బంధించిన అనృతమాడి తన్నుతప్పించు కొనుట యితరునితప్పించుట పుణ్యమేగాని పాపమురాదు.

డిటో 4అ॥ 364ప॥ మరల దమ నిర్ణయము :-

శౌచము, అక్రోధము, సంతోషము, ఆర్జవము, అన సూయ, విగతదైన్యత్వవృత్తి, అప్రమాదము, దురభిమానరా హిత్యము, అతివాదవర్జనము, సర్వభూతదయ, గురుపూజ, నిందాస్తుతులసమత, అపైశునత్వము, సాధుస్నేహము, సత్య

ము పల్కుట, నిష్కామము కల్గియుండుట అనగా చేసినసుక ర్మఫలము భగవంతునికిడుట లేక నిష్కామముగా పరోపకారము చేయుట. అహింస, సుశీలభావము - యింద్రియగ్రామ విజయము, ఇవి దమరూపములు. ఇవి ఆచరించువాడు అభయుడు. ఇహాపర సౌఖ్యములందును యీ దమవృత్తిలో బ్రహ్మధ్యానపరుడైన కొంతకాలమునకు బ్రహ్మర్షికాగలడు.

ధర్మనోపనిషత్తు:- క్షమ:-

"కాయేనమనసా వాచా శత్రుభిః పరిపీడితే బుద్ధిక్షోభనివృత్తి ర్యాక్షమా సామునిపుంగవ" శత్రువులచే పీడింపబడినప్పుడు మనోవాక్కాయముల మారుచేయక బుద్ధిక్షోభ చెందకుండుట క్షమ. ప్రహ్లాదునిక్షమ అతను శత్రువులచే బాధింపబడినపుడు భగవంతుని అంతటను జూచుచు తన హృదయమున దేవునినిల్పి భగవంతుని చిత్తధ్యానము చేసెను గాని శత్రువుల నేమియు అనలేదు. ఈక్షమదాల్చుటచే ఆక్షణమునుండి అతనికెట్టిదెబ్బలు తగలలేదు. చావలేదు. చావనందుకు తండ్రివిచారించి తానేచచ్చెదనని నిర్ణయించుకొనెను. ఇదిభగవంతునితో పూర్ణముగా ఏకీభవించిన క్షమావ్రతము. తూర్పుగోదావరి అమలాపురంతాలూకా ఉప్పలగుప్తంగ్రామంలో 40 ఏండ్లక్రితము శంకరం అను యోగిని ఒకబలముగల అజ్ఞానివట్టినే హేళాకోళము చేయగా అతనిది తప్పని యోగిచెప్ప వట్టినే అతనినికొట్టెను. మరలఅతడు కొట్టుమనెను. అట్లేకొట్టెను. కుంభకాదులు

తెలిసి జపయజ్ఞమాచరించు యోగి మరలకొట్టుమనగా అట్లే మొత్తమున ఒకజాముకొట్టెను. యోగి అతనిని కొట్టక యుండెనట. యోగికి దెబ్బతగులలేదు. ఆరాత్రిగుండెరోగముతో కొట్టినవాడు కేకలువేసిచచ్చినాడని ఒక పండితుడు చెప్పెను. నేను చూడలేదుకాని యీక్షమావ్రతము పూర్ణముగా భగవంతునితో గూడినది. ఫలముజూపినది.

ఇంద్రాది దేవతల సహాయుడగువాని క్షమావ్రతము కొంతకాలమునకు ఫలించును. దేవుని ప్రార్థించుచు మంచి యోగజాతకులు సామాన్యులుకలిసిన మానవసంఘ క్షమావ్రతము. మరికొంతకాలమునకు వారుకోరిన కోరిక ఫలించును.

భారతదేశమున ఇంగ్లీషువారి సేవకులుచేయు దుష్టక్రియలకు మారుచేయక అనుభవించినవార నేకులు గలరు. దీనిలో వారినేత్రములు చూచుచుండ ఘ్రాణములు 'సోహం' మనుచున్నవి. దాన వారిశక్తి అను పుణ్యము వీరికిజెంది జయత్వముగల్గి ప్రస్తుతము భారతమును పాలించు రాజ్యాధికారులుగా చేసినది. వైశంఖరి వాక్యములం దింత అర్థమున్నట్లు కన్పడుచున్నది. క్షమాదులతో భగవదర్చన చేయువారు అతనివలె బ్రహ్మర్షులగుదురని ఆచరించినవాడగుట తనస్మృతిలో లోకకళ్యాణమునకై వ్రాసినాడు. ఆచరించి బ్రహ్మర్షులగుడు. దుర్మార్గాచరిణికి త్వరలో దుష్టఫలములు ప్రత్యక్షమగును. మంచిమార్గము ఆచరణలో తప్పు

టచే సరిచేసుకొని మరలచేయుటలో ఆలస్యమగునుగాని అందియు తొందరలోనే ఫలించును. సన్మార్గాచరణకు అనేక విఘ్నములు గల్గును. అయినను విఘ్నకర దుర్మార్గము కష్టములు పడువారినిజూచి తనకుగల్గుటజూచి దాని మాని ఆచరించువారికి తప్పకఫలించితీరును. నిష్ఫలకార్యముచేయ రాదని మనువుశాసించెను. గాన యెప్పటికైన ఫలము గన్పడు పనిని ఆచరించి సుఖముపొందు టుత్తమమార్గము.

## లౌకైకమతము

ఈమతమున సర్వమానవులు ధనము వ్యయముసేయ నవసరములేదు. సత్యాహింసాదులను ఫలముగల్గువరకు ఆచరించుటచాలును. ఇందు ఇతరులసాయము అవసరము లేదు. హృదయమున సర్వమును పాలించు మాయాదేవితో గూడిన పురాణగృహస్థుడగు భగవంతుడుగలడు. అతడు సర్వమునకు అతీతుడై యుండి పాలించగలడు. సర్వశక్తివం తుడు. అట్టి పురాణదంపతీరూపమును అంతటా జూచుచు పూజించుచు, సత్సంతానముగనుచు, పరోపకారులై చరించు టే లౌకైకమతస్థుడగుట.

## భగవదృష్టి

పురుషుడు అంటటను దేవునిచూచుట స్త్రీ భర్తను దేవునిగాచూచుటవల్ల లాభములేదనువారును మనస్సున అనుకొనగానే దేనినిజూడవలెనన్న దానినేజూడవచ్చునుగాన

యీదృష్టితో లాభములేదను వారెప్పుడు ఉందురు. నిజముగా యీదృష్టిగల్గిన స్త్రీకి ఫలములేనిచో ఆమెదృష్టిసరిగాదన దగునేకాని శాస్త్రము తప్పుగాదు. ఈఆసురీసంపద స్త్రీమాట నమ్మి శాస్త్రగౌరవముపోగొట్టరాదు. ఆమెదుష్టస్త్రీయని గాని లేకదృష్టిపూర్తిగాచూచు టభ్యాసము లేదనిగాని నిర్ణయించదగును. సర్వలోకసుందరుడగు దేవునిగా భర్తనుజూచు స్త్రీ భర్తపై నెంతప్రేమగలదగునో చెప్పగలమా! అతని స్నేహము ఆమెవీడునా! అతనివిడిచి ఉండగలదా! ఆతనితో కలహములాడునా! అతడేమిచెప్పిన అట్లునడచి సుఖజీవనము చేయదా! ఉదాహరణ॥ సీత, రాముడు. అందగాడైన పరభర్తను వ్యభిచారిణులు మోహము జెంది పొందుచుందురు. అందగాడైనభర్తను వ్యభిచారములేని భార్యలు మోహముతోపొందుదురు. ఈయిద్దరు సర్వలోకసుందరుడగు భగవంతునిగా భర్తనుజూచువారైనచో అతనిని విడువగలరా! వ్యభిచారిణికూడా సాధ్వితోపాటు సాధ్వియగుట కిదిమార్గమై యున్నది. వ్యభిచారిణికి అందమేప్రధానముగాన తన భర్తయే గొప్పఅందగాడైన వ్యభిచారము చేయదుగదా! అందుచే భర్తను దేవునిగా జూచుటచే సర్వవిధస్త్రీలు దుష్టవ్యయము, వ్యభిచారము, కలహములులేక స్నేహమున మెలగుచు గృహాశ్రమము సౌఖ్యముగా నడపగలరు. చేసినస్త్రీలకేదీని అనుభవముగల్గును.

శ్రుతిస్మృతి పురాణేతిహాసాది ఋషికృతగ్రంథధర్మము

లెప్పుడుఆచరించిన అప్పుడే ఫలించునని నొక్కిచెప్పగలను. గాన యెవరికి హితమైన ధర్మమును దానిఫలించుఅర్థము గ్రహించి అచరించిన తప్పకఫలమిడును. జనులలో ఈగ్రంథములు చదువుటే పెద్దపని; వాటిఅర్థముచేయుటలో చాల మంది వెనుకబడిపోవుదురు. ఆచరించుటలో మిగిలినవారు విసికిమానుదురు. ఎవ్వరో, కొందరు ప్రతికాలమున మరల మరల అర్థముచెప్పి ఋషిఅర్థముగ్రహించి సత్యఫలము పొందుచునేయుందురు.

భార్యను సర్వలోకసుందరియగు లక్ష్మిగాజూచిన ఆమెపై ఎక్కువప్రేమగలవాడై కలహములుబాసి సుఖముగాచరించును. దీన ఉభయులు పరస్పరము గౌరవము గలవారగుదురు. ఒకరినొకరు విడువజాలరు. దీనగృహాశ్రమము సౌఖ్యముగా నడచును. ఇట్టిభార్యాభర్తలుండుటవల్లనే గృహాశ్రమము సర్వాశ్రమశ్రేష్టమైనది. దైవీసంపద గృహస్థులు ఇంద్రాదిదేవతలగా భర్తలజూచువారు. వారిభార్యలగా తమభార్యలను చూచువారును సౌఖ్యముతో చరించగలరు.

ఈ దృష్టివిడిచిన కేవలము సన్మార్గ గృహస్థులును సౌఖ్యమునొందగలరు. కేవలము ఆసురీసంపద గృహస్థులయిన యమలోకస్థితియిచ్చటనే గాంతురు. ఒకటిదేవతాసంపదయైన ఒకటిఆసురీసంపదయైన కలియక కలహముతోనుందురు. గాన భగవద్దృష్టిసర్వవిధస్త్రీపురుషులకు సర్వసౌఖ్యము లిడు

చున్నది. పరపురుషుడు తన్నవమానింపజూచినపుడు వానిని దేవునిగాజూచిన అతడేమియు చేయలేడు. సాధారణముగా భర్తయింటనున్న శక్తియున్నంతవరకు భాగ్యకుపరునివల్ల గల్గుఅవమానములు రాకుండా కాపాడగలడు. భర్తలు తన్ను రక్షింపవీలులేని కాలమున అన్నగాగాని, తండ్రీగాగాని. భర్తగాగాని భావించు స్త్రీ దేవునిగా పరపురుషుని జూచిన అతనిఅవమానమునుండి అన్నవలె, తండ్రివలె, భర్తవలె దేవుడు తప్పించును. అని ద్రౌపది దుశ్శాసనులు భారతములో యీదృష్టి ద్రౌపదిచూచినట్లులేదు. అయినను నేనువ్రాయకారణమేమనగా భాగవతములో జడభరతుని చంపనున్నవారిపై యీదృష్టిచూచి తప్పించుకొనినారు. గాన వ్యభిచారములేని స్త్రీలు అనేకులుందురు. సాధ్వియన సాధ్వికితగిన సద్గుణములుగల్గి భగవద్దృష్టి అభ్యాసమెక్కుడు గలదని నాఅభిప్రాయము.

ఆదృష్టిచూచినగాని భగవంతుడీ లోకానికి రాడని వామనావతారజననమున భాగవతమునగలదు. ఈరెంటిని బట్టి యీదృష్టిచూచుటచే కృష్ణభగవంతుడు అగోచరముగానుండి చీరలిచ్చి ఆతనిఅవమానమునుండి ఆమెనుకాపాడెనని ఊహింపదగును ఈదృష్టితప్పనువారు తమదృష్టితప్పినదని సరిచేసుకొనదగునేగాని పెడవాదముచేయచోటులేదు. కృష్ణావతారము, వామనావతారముల భార్యాభర్తలు ఈదృష్టి గల్గి భగవంతుని తమయందైక్యముచేసి సంయోగయజ్ఞము

చేసి కనినట్లుగలదు. దానితో వారిదృష్టి సత్యమైనదని వా రనుకొనిరి. దృష్టివల్లరూపముమాత్రముగల్గును. ఐక్యము వలన సంపూర్ణశక్తిగుణములుగల్గును.

భాగవతము 10 స్కంధము - మత్తకోకిల:—ఒంటిసల్పి పురాణయోగులు యోగమార్గ నిరూఢులై । కంటినుం డురుగాని నిక్కముగానరీ భవదాకృతిన్ । గంటిభద్రము గంటి మాంసపుగన్నులన్ గనబోలదీ । తొంటిరూపు దొలంగబెట్టుము తోయజాక్షణ ముకుందన్ ॥ పుత్రరూప భగవంతునికి సంతోషించి మొక్కినది. భర్తదేవునిరూపము దాల్చియుండగా భర్తనుదేవునిగాజూచినది. గనుకనే తనకు దేవుడుగల్గినాడని, మాంసపుగన్నులతో చూడరాని భగవం తుని మానవరూపునిగా కన్నానని తానుచేసినకర్మఫలమును జూచి దేవకి సంతోషించినది. అదితియు ఇట్లేచేసినది వ్యభి చారిణితాను మోహించినవానివంటి పుత్రుని అతనినినిత్య దర్శనముచేసి పొందకయే కనుచున్నది. (పొందియుకనుచు న్నది. లోకములో జంతురూపులగు ఆవులు, నందినిచూచి ఆ ఆకారముగల సంతానము గనుచున్నవి.) (ఇందురూప మేగాని శక్తిరాదు.) గుఱ్ఱములు పెద్దగుఱ్ఱములను జూచి సంయోగముచేసిన తననుపొందిన గుఱ్ఱమువంటి దానినిగాక చూచినగుఱ్ఱమువంటి పిల్లలగనుచున్నవి. ఈ దృష్టిలో జంతువులే గొప్పసంతతిగనుచుండ మనుష్యులు కృష్ణునివంటి అవతారపురుషుల విశ్వామిత్రాదులవంటి

బ్రహ్మర్షుల కనుటెట్లు కలెక్కయో! కాదు వ్యభిచారము లేని స్త్రీయైనను యీదృష్టిలేనిచో గొప్పసంతతి కనలేదు. చూచితినని చెప్పినను నమ్మరాదు. కారణము అట్టి సంతతి యేలకల్గలేదని యూహించి గుర్రముల ఆవులవంటి కేంద్రీకరించిన స్థిరదృష్టి తనభార్యకుగల్గలే దనుకొనవలెనేగాని భార్యమాటనుబట్టి గొప్పగ్రంథాలు తప్పనరాదు.

ఆసురీసంపద స్త్రీలు భర్తను దేవునిగాచూడరు. భర్తలన్ననో దేవుడుగలడని నమ్మరు. గాన యీదృష్టి వారి కుండదు. గాన ఆజాతిలో అవతారపురుషుడుపుట్టలేదు. రాక్షస జాతి స్త్రీలలో పతివ్రతయగు లీలావతి భర్తను దేవునిగాభావించినది. (నాధదేవత అన తనతల్లి నాధునిదేవునిగా భావించునగని ప్రహ్లాదుడు చెప్పినాడు) అందుననే మహాత్ముడగు ప్రహ్లాదుని గనినది. గీతలో కృష్ణుడు ప్రహ్లాదుడు నేనే అని చెప్పెను.

ఋషులు ఋషులవంటి సాధువులను మహాత్ములగు రాజులు అట్టిసంతతిని గనగల్గిరి. గృహస్థులు బలవంతులగు సత్సంతానముగనినగాని భగవంతునిపూజలు, యుద్ధములులేని స్థిరరాజ్యములు, గృహాశ్రమసుఖము గల్గదని ముమ్మాటికినమ్ముడు. గాన ముందుగృహస్థుడు బలవంతులగు సన్మార్గులకనుట అభ్యాసముచేసినగాని గృహాశ్రమ సుఖముగల్గదు. బలవంతునిగనిన తండ్రిసంపాదింపనక్కర లేదు. బలహీనునిగనిన, తండ్రి జన్మమంతయు కష్టపడిసంపా

దించి ధానినంతయు బోగొట్ట తండ్రి, కుమారుడు దుఃఖములపాలగుదురు. దీనిని తెలిసి గృహస్థులు సత్సంతానవృద్ధి చేయదగును. భూలోకగృహస్థులు తెల్లవారు జామున, రాత్రిప్రథమజామున భగవద్ధ్యానముచేయుచు పగలంతయు రాజు, మంత్రి, రాజసేవక, వర్తక, వ్యవసాయాదులతో సత్యాహింసాదులతోగూడి ధనార్జనచేయుచు తన కుటుంబమును తన్నుపోషించుకొనుచు బలవంతులగు సాధుసాధ్వులగు బాలబాలికలగనుచు పరోపకారము లేక మెలగుచే భగవన్మతము,

దేవుని పూజించుచు సాధువులగు గృహస్థులతో నెక్కుడు వృద్ధిగానుండునది. న్యాయస్థులు, సాధువులు అగు మంత్రులచే, అట్టిసేవకులచే బలీయసాధుమార్గస్థుడగు అధ్యక్షునిచే పాలింపబడినదే లౌకికరాజ్యము. అట్లుదేవుని పూజించుచు సాధుమార్గస్థుడగు గృహస్థుడే లౌకికగృహస్థుడు. దేవుడులేడని దేవునిపూజించుటమానినను సత్య అహింసాది సద్గుణములతో నడచుచు వాటిఫలముగల్గువరకాచరించు, గృహస్థుడు ఇహమునే తనకు పరులకు కళ్యాణముచేయువాడగును. ఇట్టిమానవులనుండి జగదపకారము లేదు. ఫలమిడు యజమానియగు దేవుడులేడనిననాడు సత్య, అహింసాదిమార్గములు నడుచుట కష్టమని నాయూహ. సాగినచో మంచిదేకదా !

తమకుగల్గిన దుష్టదరిద్రమువదలక బాధింపుటచే

దేవునిదూషించుచు లేక తాము 2—3 దినములు పూజించి తిమి అతడుండినకనపడడా? మాకుకనబడలేదుగాన దేవుడు లేడనివాదించుచు అధర్మమార్గమున నడచుచు పరులకు తనకు అపకారముచేయు బలహీనులు దుష్టులునగు సంతానమును గనుచు (కొడుకుపెండ్లాడిన స్త్రీని పాలింపడు, కూతురుపెండ్లాడిభర్తదరినుండదు.) అనగా పుట్టినింటికి అత్తింటికి నష్టముచేయు సంతానమునుగనుచు లోకాపకారము చేయుచు జీవించుగృహస్థులగు స్త్రీపురుషుల, నేమనివచింప వలయునో చదువరులూహింతురుగాక!

## భారత ఋషి గ్రంథములు

శ్రుతి స్మృతి పురాణాదిఋషిగ్రంథములు సత్యమార్గములు తెల్పుచు భిన్నభిన్నముగానున్నవి. ఆచరించిన సత్యఫలమిడునవియైయున్నవి. ఫలమిడనిచో విడువదగిన దే. గాని ఆచరించినఫలమిడునని నాయూహ. మనము వాటినివిడిచి క్రొత్తమార్గముద్రొక్కినను అంతేఫలము వచ్చునుగాన ఉన్నవాటిని గ్రహించి లేనివాటినికనుగొన్న నదికొంత బాగుండునుగాని ఉన్నగ్రంథములేతప్పని చేయుక్రొత్తమార్గమేది? పేదలకు, ధనవంతులకు విరోధముపెట్టుటా? స్త్రీస్వాతంత్ర్యమని భార్యా భర్తలకు సఖ్యములేకుండాచేయుటా? సంఘములకు సంఘములకు, కులములకు కులములకు, ఒక దేశస్థులకు మరియొక దేశజులకుయుద్ధముకల్గించుటా? చెప్పుడు? వీరంద

రికి సఖ్యతచేయుటే గొప్పమార్గముగదా! ఆదేబుషులనుభ వించి సత్యము వ్రాసిరి. అందువనే భూలోక సర్వరాజ్యములగల గృహస్థులు బలవంతులు నిష్కామ, సత్కామ, సన్మార్గు లగు సాధుసంతానముగనినచో యీసత్యఫలముల తేల్చి చూపగలరు. తేల్చిచూపినట్లు పూర్వర్షి గ్రంథాలుగలవు.

కాని దుష్టులు, బలహీనులగువారిగ్రంథాల సత్య ఫలము తేల్చలేరు. కలియుగాన నేడెక్కడు దుష్టులు, బల హీనసన్మార్గు లెక్కడున్నారు. వీరుసద్గ్రంథములకు సత్యా ర్థము చెప్పలేరు. పుస్తకములు చదివితిమి, ఆచరించినఫలము గల్గునట్లు లేవనినొక్కి చెప్పెదరు. వినెడి వారెక్కడుండిఆమో దించి అదేసత్యమనిజను లెక్కడు నమ్మినదేసత్యమని గ్రంథాల దూషించుచున్నారు. శ్రుత్యాది గంథములకు సత్యార్థము చెప్పి నవాడొకడై ననుధర్మమే. అసత్యార్థము చెప్పు వారెందరేక నై నను ధర్మముకాదు. అన నిష్ఫలమే అనిగ్రహింపదగును. ఇట్టిదుష్టులు ఆచరించినను ఫలము తేలువరకు సన్మార్గమున నడువలేరు. గాన భూలోక ప్రతిరాజ్యమున ప్రతిగృహస్థుడు మొదటబలీయముగు సత్సంతానముగని వారికి సాధువిద్యల చెప్పించదగును.

గీత॥ "అధ్యాత్మ విద్యా విద్యానాం" విద్యలలో అధ్యాత్మవిద్య భగవంతుడు. అనగా దీని అభ్యసించి సిద్ధి చెందినమానవుని బ్రహ్మర్షిగాచేయునని భావము.

గరుడపురాణము :— విద్య విదేశబంధుత్వము

రాజపూజితము ధనమునిచ్చునది. గురువుగా చేయునది. ఇహపరసుఖమిచ్చునది. అట్టివిద్యయనగా బ్రహ్మవిద్యపూర్ణఫలమిచ్చును.

ప్రకృతిసత్యవిద్యయనగా పశ్చిమదేశ ఖనిజరసాయనశాస్త్రాదులు ఇహఫలము పూర్ణముగానిచ్చును. గాన 'విద్యావిహీనఃపశుః' ఇట్టిరెండు తెగగుల విద్యలుగాని, బ్రహ్మవిద్యగాని తెలియనివాడు మానవుడైనను పశువుతో సమానుడనికలదు. ఇట్టి అజ్ఞాని జీవన్ముక్తుడేజన్మమునను కాడనిభావము. కొందరు ప్రకృతిసత్యవిద్వాంసులు దేవుడు లేడనివాదించినను కొందరు ప్రకృతిసత్యము తమకు తెలిసినపుడు, వికృతిసత్యమేలయుండదని యూహించి వాదించువారునుండగలరు. కొందరు రెండూగలవని యొప్పించువారు నేమూలనో యుండకమానరు. ఇట్టి రెండుగలవారిచే లేక విడివిడిగానైన పిల్లలకు బ్రహ్మవిద్య ప్రకృతిసత్యవిద్య రెండు నేర్పించిన యిహపరసుఖము లందగలరు.

ఉత్తరగీత॥ ఆహారభయనిద్రామైథునములు సర్వజంతువులకు మనుష్యులకు సమమైయున్నవి. గాన "జ్ఞానేనహీనః పశుభిస్సమానః" అంతట తనయందు దేవునిచూచుటజ్ఞానము. అది లేనివాడు పశుసమానుడు. అనగా జంతుసముడని తెలియదగును. తల్లిదండ్రుల పూర్ణసహాయముచే కన్నపిల్లలు ప్రారబ్ధబలముగలవారై సర్వవిద్యాధికులు జ్ఞానులు, విశ్వవిజయులు అగుదురు. ఉ॥ రామాదులు - పాండవాదులు.

ప్రారబ్ధబలము॥ పురుషప్రయత్నము:— కొండశిల అను పాము (అజగరము) ఒకచోట కదలకయుండినను దానికి కావలసిన ఆహారము దరికిచేరుటచే దాన తృప్తి చెందునట్లు సత్ప్రారబ్ధబలవంతునకు కావలసినవి కోరినను కోరకున్నను దరిజేరియుండును. లేనిచో కించిత్ యత్నముచే కార్యసాఫల్యమగుచుండును. గొప్పరాజయోగబలముగలవారే ప్రారబ్ధబలముగలవారు. భారతము॥ 'పౌరుషంబు దైవయత్నంబుతోడ్పాటు లేక । ఫలము జెందంగ నేరదు పార్థివేంద్ర' పురుషప్రయత్నము జాతకమున్నను లేకున్నను సత్ప్రారబ్ధబలముగలవానికి ఆకాలమున ఫలసిద్ధిగల్గును. లేనిచో గల్గదు. జాతకమున్న ప్రారబ్ధబలము తెలియుట జరుగును. లేనిచో తెలియదు. తెలిసినవారికి తెలియనివారికి మంచికాలమైననే సత్ఫలముగల్గును. లేనినాడు కష్టములపాలుచేయును. బలహీనప్రారబ్ధముగలిగిన, తేనెటీగ దుష్టాహారమును విడచి అనగా సాధుజీవయుతులగు ఫలవృక్ష సహవాసముచేయుచు, అనేకపుష్పములజేరినగాని ఆహారము దొరకుటలేదు. కొన్ని పువ్వులమకరందముండును. కొన్నిచోట్ల మకరందముండదు. కొన్నిచోట్ల విఘ్నములు, కొన్నిచోట్ల కార్యములగుచు తుదకుభుక్తిమాత్రము సరిపోవుచుండును. అనగా బలహీన జాతకులు సాధుబిక్షగొనుచు సాధుమార్గమున భగవధ్ధ్యానముచేయుచు తేనెటీగవలె కాలముగడుపుకొనదగినదేగాని ఆహారమునకొక్కదానికే పాటుపడరాదు. మానవుడీ లోకా

నికి వచ్చుటజూడ తపస్సుజేసి బ్రహ్మర్షిత్వసిద్ధిజెందుటకే ప్రధానమైయున్నది. గాని మేడలు మిద్దెలపై దుష్టభోగము లనుభవించుటకు, దుష్టదరిద్రమని యేడ్చుటకుకాదని ఋషు లభిప్రాయము. అందుననే బలహీనులగువారు సాధుమార్గ మున మాధూకరవృత్తితో జీవించుచు విద్యాదులు నేర్ప వగినదని వ్రాసిరి. తేనెటీగతప్ప యితరమైనయీగలు తేనెటీగ ఫలముజెందక దూషింపబడుచుండును.

గీత॥ "రాజవిద్యా రాజగుహ్యం। పవిత్రమిదము త్తమం" ఈరాజవిద్యయనబడు బ్రహ్మవిద్య పూర్వము రాజ్యమేలు వారియందు రహస్యముగానున్నది. పూర్వపురాజులందరీ విద్యనేర్చెడివారు. దాన సర్వలోకాధిపుడగు భగవంతు నైక్యముచేయగోరి తపోవంతులైరి. దాన తనప్రజల పిల్లలవలె ప్రేమించి ప్రేమతో భగవంతునిపూజించు నిష్కా మసత్కామ మార్గములు ప్రచారముచేయించుచు, అట్లు చేయుడని బోధింపజేయుచు రాజ్యమును నిష్కామముగా పాలింపగల్గిరి. నేడట్లుఅభ్యసించువారికి అట్టిఫలమేగలుగ గలదు. వేదాంతబ్రాహ్మణుడన రాజుకన్న బలముగల సత్ ప్రారబ్ధముచే పుట్టినవాడు. ఇట్టివాడు బ్రహ్మవిద్యాసిద్ధి త్వరలోపొందగలడు. ఉ॥ వ్యాసుడు, శుకుడు మొదలగువారు. వీరనేకరాజులచే పూజింపబడిరి. విశేషధనముల సంపాదించి నిష్కామముగా సన్మార్గమున వ్యయముచేసిరి. బలవంతు లైన సత్సంతతినివృద్ధిచేసిరి. వీరుతాముగాక పరులును తమ

వలె బ్రిహ్మర్షులగునట్లు తగినమార్గములుగల అనేక గ్రంథ ములువ్రాసి సాధుసహాయముచేసిరి. ఆకాలమునాటిరాజులా మార్గముల నడపుచు ప్రిజలంగో ప్రచారముచేసి ప్రజలు తాను సర్వవిధసఖ్యసౌఖ్యములతో చరించిరి. వేదమార్గమున జీవించు బ్రాహ్మణునకే వేదాంతబ్రాహ్మణశక్తి గల్గను.

బ్రాహ్మణ క్షత్రియాదిజాతులలో పుట్టబడిన మానవు లలోగల వేదాంతబ్రాహ్మణులే సర్వవిధసత్యగ్రంథములు వ్రాసిరి. వేదబ్రాహ్మణక్షత్రియాపులు రాజ్యాంగకర్మలుచేసిరి గాని గ్రంథములువ్రాయలేదు. బలహీనప్రారబ్ధముగలవారు యీబ్రహ్మర్షివిద్యనభ్యసించిన ఎక్కువవిఘ్నములు చెందు చుందురు. దీనివల్లలాభములేనట్లగపడును. అట్లున్నను విశు వకఆచరించుచున్నవారికివి సిద్ధిగల్గును. వారు రాజయోగ జాతకులుకారు. గనుక వారుచెప్పినది యేకొలదిమంది జను లలోకాని ప్రజలెక్కుడునమ్మరు. వారికేరాజయోగకాలము గల్గిన ఆకాలమున ప్రిజలలోచెప్పువాక్యములు శ్రద్ధతో విని దరు. త్వరలోప్రచారము మెుక్కుడగును.

## జాతకమన ప్రారబ్ధబలాబలము దెల్పునది

మానవుసృష్టిలోనే బలవంతులను గనవచ్చును. పుట్టినవెంటనే అదినిజమని చెప్పుటకే రాముని, కృష్ణుని జాతక చక్రములు రామాయణ హరివంశములలోగలవు. పుట్టినప్పుడే చూచి వీరు అవతారపురుషులని దైవజ్ఞులగు ఋషులు చెప్పిరి.

అట్లు సరిపోయినది. బలహీనజాతకమైన పుట్టినప్పుడే తెలిసి కొని తర్వాతనైన బలవంతులగు సన్మార్గులగనుటకే యీ శాస్త్రమును ఋషులుకనిపెట్టిరి. ఉ॥ హనుమంతుడుగాక నల్గురుపుత్రులుగలరు. వీరిలో హనుమంతుడే గొప్పవాడు. వీనినే తల్లిదండ్రుల ఉపాసనాదైవమగు వాయుదేవుడు ఎక్కుడు ప్రేమించినాడు. ఇతరుల ప్రేమించలేదు. బలహీన మేధావంతులు శాస్త్రజ్ఞులైననాడు వాటిగౌరవము పోవుచుండును. పూర్వర్షులవలె బలవంతులు మేధావంతులగు నాడు వాటిసత్యార్థము, గౌరవముచెప్పెడి వారగుదురు. ఏకాలమునదుష్టులు, బలహీనమేధావంతులు శాస్త్రార్థనిర్ణయముచేయుదురో అదియొకలికాలము. ఏకాలమున సన్మార్గులు సద్బలమేధావంతులు శాస్త్రార్థ నిర్ణయముచేతురో అది కృతయుగము. అనగా ఆచరించినఫలమిచ్చుకాలమని అర్థము. తలిదండ్రులచే బలముగా సృష్టింపబడిన మానవుడు గురు సహాయమున సర్వవిద్యల సర్వశక్తులత్వరలో సంపాదించును. ఉ॥ కృష్ణుడు, బలరాముడు, గురువుసాందీపుడు 5 లేక 6 మాసములలో సర్వవిద్యాసంపన్నులై మహాశక్తివంతులైరి. మానవుడుసృష్టిలో బలహీనుడైనచో గురుదయచే కొంత కాలమునకు కొంతబాగుపడగలడు, అతడుచెప్పినది విడిచిపెట్టబుద్ధిగల్గి ఆమార్గాలనడచుట మానివేయుచుండును. అట్లుగాక విడువకఅభ్యసించినచో అతడును పూర్ణసిద్ధి చాల కాలమునకు పొందును.

## భూలోకమున సత్యగ్రంథములుఅన ఆచరించినఫలమిడునవి

ఏప్రాంతమువారి యేమతము వారిగ్రంథములైన ఆచరించిన ఫలమిడినచో సత్యమేయగును. ప్రస్తుతకాలాన జ్ఞాన విజ్ఞానోదయములకు భారతదేశమున భగవద్గీతాశ్రుతిస్మృతి పురాణేతిహాస షట్శాస్త్రదర్శనాది ఋషికృతగ్రంథముల ప్రకృతిగ్రంథములన ధనాదులార్జింప రసాయన ఖనిజాదులు తెలియుటకు పశ్చిమదేశశాస్త్రములను ప్రతిమానవుడు చదువదగినది. ఈరెండుమార్గములుజేర్చి భూలోకమునగల పాఠశాలలలో చదువునేర్పుచున్న సత్యమగు జ్ఞానోదయము గృహాశ్రమము జరుగుటకు ధనాదులార్జించుశక్తిగల్గి పరాపకారములేక సఖ్యతతో మెలగగల్గుదురని నాయూహ. మరియు కుంభకాదియోగాభ్యాసము చేయుమార్గములుగల పతంజలి యోగసూత్రాదులవంటి గ్రంథములు నేర్పిన కరువు కాలములో జలవాయుభక్షణతో ప్రాణమునిల్పగల్గి, నిరోగులు, సుజ్ఞానశక్తిసంతులగుదురు. ఇట్టివిలేనివారు కరువు కాలమున అన్నముతినని కారణాన రోగవృద్ధియై త్వరలో అకాలమృత్యువునోటబడగలరు. ఉ॥ ధర్మరాజు, రాజ్యము నోడినతర్వాత తనకూడ నున్నవారికి తనకు అరణ్యావాసమున అన్నవృద్ధిగల్గుటకు అన్నవృద్ధికారకుడగు సూర్యునెట్లారాధింపవలయునో మహాత్ములగు వారివల్ల తెలిసికొని కొన్ని దినములు వాయుభక్షకుడై సూర్యునారాధించి అతనివల్ల

యెక్కువ ఆహారవృద్ధిచెందెను. ఆసనములునేర్చిన నిరోగ మిదును. మరియు మార్కండేయపురాణమున తమరాజుకు మృత్యులక్షణములుగల ప్రజలు సూర్యునారాధించి పదివేలేండ్లు ఆయువుగల్గునట్లుచేసిరి. రాజు ఆశ్చర్యపడి యీప్రజలందరిని వేలేండ్లుండునట్లు 6 మాసములు సూర్యునారాధించి సిద్ధిగాంచెను. అన్నవృద్ధి, ఆయుర్వృద్ధి సూర్యారాధనలోగలదని తెలినది. కాన యీమార్గసత్యార్థము గ్రహించి నేడుచేయువారలకట్టే ఫలముగల్గకమానదు. ఆమార్గ సత్యార్థము తెలియనిచో ఆఫలమురాదు. పరిశుద్ధాహారమునుతిని ఆరాధించుటకు వాయుభక్షణతో ఆరాధించుటకు సమ ఫలమే ఋషులువ్రాసిరి. శుద్ధాహారములేనిచో మంచి ఫలములు. అవిలేనిచో పుణ్యవృక్షములరాలిన పత్రభక్షణ. అవిలేనివో పరిశుద్ధక్షీరములుగాని జలముగాని భక్షించుట అవిలేనిచో పరిశుద్ధవాయుభక్షణతో తపస్సుచేసి పూర్వ ఋషులు తమ సత్సంకల్పసిద్ధిత్వమును రాజర్షి, ఋషి, మహర్షి, బ్రహ్మర్షిత్వములజెందిరి. ఆమార్గములు నేడు ఆచరించు వారరుదుగానున్నారు. దాన సత్యమార్గమునకు గౌరవము లేకుండాయున్నది. తమ సత్యమార్గఫలము లేకపోవుటచే దుష్టులు తమ్మేమిబంధింతురోయని సాధువులు భయముజెంది పైకిదుష్టులయొక్క మార్గమునే గౌరవముచేసినట్లు కన్పడు చున్నారు.

## జపఫలము

ఆగ్నేయపురాణము:- "జపః ఆధివ్యాధిర్నాస్తి" జపముచేయువానిని మానసిక శరీరవ్యాధులు బాధించవు. గాన బాలబాలికలు జననీజనకాదులు భగవంతునిగూర్చి జపముచేయుట అభ్యసించిన సత్యవంతులై ఆరోగ్యముకల వారై సౌఖ్యముగాచరింతురు.

భారతము—శాంతిపర్వము 4 ఆ - 130 ప: సీ॥ వేదాంత విదులను మోదించునట్టిది। జపకర్మ మత్యంతశౌచశాలి। యైకుశాస్తీర్ణ సమావతలమున। కుశముష్టి చేకొని విశదచిత్త వృత్తినింద్రియములు విషయసక్తములుగాకుండ నిలిపి తదేక పరత। మత్సరాహంకార మానదంభాపగమంబును బ్రహ్మ చర్యంబుగల్గి। జపముసెల్లించు పురుషుండు సర్వలోక। విజయ నిస్పృహుడగు జపవిధివిశోక। హర్ష రాగాదికంబును నవ్య యంబు। నైన పదముబొందించు నృపాగ్రగణ్య.

కం॥ శౌచాదిగుణము వెడలుట। నీచత్వము వాటిలంగ నిశ్చలమతి దు। ష్టాచరితమైనజపవిధి।నా చెప్పిన సుగతిలేదు నరకముదెచ్చున్॥ జపము వేదాంతజ్ఞానులకు సంతోషకర మైనది. రెండవవిషయము చిత్తమునచేరనీక భగవంతుని గూర్చి బ్రహ్మచర్యముగల్గి జపించునతడీ సర్వలోకముల జయించును. ఇతి సత్కామజపము. ఆరీతిని దేనినికోరక భగవంతునిగూర్చి జపించినచో రాజర్షి, ఋషి, మహర్షిత్వ

ములనిచ్చి తుదకు బ్రహ్మర్షిత్వమిడును. పరాపకారముచేయు జపము నరకమిడును. ఇహపరసుఖములుండవు.

భగవద్గీత — 'యజ్ఞానాం జపయజ్ఞోస్మి' యజ్ఞము లకు భగవంతుడు ప్రధానపురుషుడై యుండును. నిష్కా మ యజ్ఞము భగవంతుడే యగును. భారతదేశమున రాసురాను ప్రకృతిశాస్త్రముల నెంతిడబ్బు సంపాదించి నను సాలెడుబియ్యముగదా! తినునది, యని వాటియందు నిరసనగల్గి వాటినివిడచిరి. జ్ఞానవిజ్ఞానమార్గములు చాల కాలమునకుగాని ఫలింపవని వాటినివిడచిరి. దాన దేశము కలియుగాన పరీక్షిత్తు, జనమేజయుల తర్వాతనుండి దుర్బ లమైనది. మరలఅభ్యసించిన వృద్ధిచెందగలదు. ఇట్లన్ని దేశాలు బాగుపడగలవు. దాన భూలోకముస్వర్గమువలెప్రకా శించును.

## ఓ భూలోక నానాసంఘజనములారా!

మానవ స్త్రీ పురుషులందరు రెండేపక్షములు అన దుష్ట సంఘము సాధుసంఘము, అను శాసనికపర్వము 1ఆ. 285 పద్య ము:— నిత్యమునత్యముపల్కువారు, శౌచయుతులు నిష్క ల్మషమతులు, సత్కర్మపరులు, విజ్ఞానము, తపము, దానము, బ్రహ్మచర్యము, శమముగల్గు, సాధుసాధ్వీలయందు లక్ష్మి వసించి నానాసౌఖ్యము లిడుచుండును. ఈసత్యాదులుగల వారు ధర్మరాజువలె దుష్టులవల్ల కష్టములుపొందినను తుదకు

సర్వసంపదల గాంతురు. నిష్కాములై సత్యాదులుగలవారు అంబరీషాదిరాజులవలె సర్వసంపదలతో ఆనందముబొందుచు బ్రహ్మర్షులై తుదకు బ్రహ్మమై ప్రకాశింతురు. అసత్యము, అశౌచము, కల్మషబుద్ధి, దుష్కర్మములు, అజ్ఞానము, తపస్సునువిడుచుట, లోభత్వము, పరస్త్రీలచేరచుట, క్రోధముగల్గినక్రూరులు, నాస్తికులు, కృతఘ్నులు, కుబుద్ధులు, భర్తనుదేవునిగా పూజింపక ప్రతికూలురై కలహములుగల్గి పరపురుషులపై మోహముచే వ్యభిచారమొనరించు స్త్రీలు గలచోట లక్ష్మి నిలువదు.

అనగా ధనవంతులుగావీరున్నను సాధుఅసాధుగౌరవములేక తుదకు ధనాదులునశించి యిహపరదూరులగుదురు. సాధుపక్షమున భగవంతుడుండి రక్షించుచుండును. దుష్టపక్షమున రాక్షసులను నాశముచేయుచుండును.

అగోచరుడగు భగవంతుడు, అగోచరులగు దేవతలు, వీరినిగురించి చాలాకాలముతపస్సుచేసినచో తపోగ్ని వెలుతురులోకన్పడి సర్వసుఖములిత్తురు. ప్రారబ్ధముఅన గతజన్మమునజీవుడుచేసిన కర్మఫలము. తల్లిదండ్రులు తమ్ము ఆజీవుడు చేరిననాటనుండి చేసినమంచిచెడుగుకర్మములగును. ఈప్రారబ్ధము కన్పించదు. అగోచరఫలమిదను. ఇదియే లేనిచో మనుష్యా! నీవుచేసినపురుషప్రయత్నములన్నియు నిత్యముఎట్టి విఘ్నములులేక ఫలించుచుండునుగదా!

పిశాచాదులు వీరును అగోచరులే. స్థూలదేహధారి

యైయున్న జీవుని స్థూలదేహాధారులు కన్పడుచున్నవి. ఈజ న్మదేస్థూలమునుండిసూక్ష్మదేహాధారియైన దేవతలు పిశాచ ములు గన్పించును. అనగాస్వప్నమునగాని లేక స్థూలదేహ భ్రాంతివిడచి సూక్ష్మదేహముతోనున్న కాలమునగాని, దేవ తలు, పిశాచములుగాన్పింతురనదగినది. దేవుడు స్థూలాది దేహములనున్న జీవునికి - అట్టే దేవపిశాచములు మానవు లకు కన్పించునట్లు కథలనేకములుగలవు. మరల అట్లుజరి గినగాని యదార్థము తెలియదు. దీనినట్లుంచుము.

ఈలోకములో రాజ్యము ప్రజలు భోజనము, భార్య గాని, ఉంపుడుకత్తెగాని ప్రత్యక్షమగుచుండును. నిత్యము చేయుపురుషప్రయత్నము ప్రత్యక్షమగుచుండును. కాని నీవు యీలోకానికి యెక్కడనుండివచ్చితివో యెక్కడికిముందు పోగలవో నీకు తెలియదు. తలిదండ్రులమాట నీవునమ్మనిచో ఎవరికిపుట్టితివో తెలియదు. నీవుపుట్టినవేళ మంచిదిగానిచో నీసంకల్పములన్నియు అగోచరప్రారబ్ధముచే నాశనమగు చుండును. జీవులప్రారబ్ధము సర్వప్రభువగు దేవునిద్వారా ఫలమిడుచుండును.

ప్రారబ్ధముమంచిదైన సంకల్పసిద్ధి యగుచుండును. నీప్రయత్నములోనే సర్వసిద్ధిలేదు. ఏదోఅగోచరముగానుండి ఫలాఫలసిద్ధినిడుచున్నట్లు నీప్రయత్నములే సాక్ష్యములు కదా! పురుషప్రయత్నములోనే సర్వసిద్ధులుగల్గుచున్న అందరు దేశాధ్యక్షులగుదురుగదా! ఒకడు దుష్కర్మము

చేయ నేనుచేసెదనని నేనుచేసెదనని పోటీలుపడు నీచజను లెక్కువుందురు. మంచికర్మములు చేయువారు, తత్ఫలము పొందువారు తక్కువగానుందురు. లోకములో రాజ్యమున చిన్నపదవులకు అనేకులు పోటీచేయుదురు. శాసనసభ్య త్వమునకు 4 గురు 5 గురు పోటీచేయుచుందురు. ఒకేదేశము లోకొన్నికోట్లజనులున్నను ప్రధానమంత్రిపదవికి, అధ్యక్ష పదవికి 4 గురు 5 గురుకన్న పోటీచేయరు. లేనిచో ఒకరిద్దరు మాత్రమేచేయుచున్నారు. ఇక అగోచరుడుగానున్న భగవం తునిగా మారుటకు అన బ్రహ్మర్షియగుటకు ద్విజత్వము చెంద అనగా దేవతగామారుటకు యెంతమందిప్రయత్నింతు రాయని అనదగియున్నది. అనగా చాలామంది తక్కువ యుందురుగాని విరు యేదేశమునవృద్ధియైన ఆదేశము నానావిధసౌఖ్యాలయమగును. బ్రహ్మర్షిత్వ, దేవతాత్వము జెందవిడిచి దుష్టమార్గముననున్న వారిపై రాక్షసపిశాచా వేశమై రాక్షసత్వ పిశాచత్వముతో మానవులు చరింతురు.

స్త్రీ పరమేశ్వరిగా మారినచో యోగిని దేవి, శివ అనిచెప్పబడును. ఈస్థితిబ్రహ్మవిద్యాసిద్ధినిగాని గల్గదు. ఈమె ప్రతివ్రతారత్నమైప్రకాశించును. ఈమె నిష్కామకర్మపతి వ్రత. స్త్రీ దేవతగామారినచో సాధువర్తనిద్యై భర్తతో సౌఖ్యముజెందుచు సత్సంతతిగనుచు పతివ్రతయని పేరు గాంచు సత్కామకర్మ పతివ్రత యనబడును.

స్త్రీ రాక్షసిగా పిశాచినిగామారుటచే వ్యభిచారిణియై

దుర్మార్గమునచరించుచు భర్తతో, పుత్రులతో స్నేహము చేయక నిత్యముకలహములుగల్గి ధనాదులు దుష్టవ్యయముగు చేయుచు, భర్తకు, భర్తకులమువారికి అపకారముచేసి వ్యభిచారిణియని పేరుగాంచి సర్వసంపదలున్నను వాటిపై పెత్తనముగాని, అనుభవించుటగానిగల్గక లేక దుష్టదరిద్రముతో బాధపడుచు తుదను నరకముచెందును. దుష్కామ స్త్రీ ఆమెతో గృహాశ్రమధర్మములు నాశనమగునేగాని సత్ఫలము లిడవు. దాన గృహస్థుడు నానాచిక్కులతో బాధ పడుచుండును. ఇట్టి స్త్రీ భార్యయగుట పురుషుడు రాక్షసి గాని పిశాచిగాని పట్టిన యెట్టిబాధగల్గునో అట్టిబాధల చెందును.

ఇట్టి స్త్రీ భార్యయగుట పూర్వకర్మ ఫలముకదా! దీనిని నీవునమ్మవు గాని నీప్రయత్నముసిద్ధికాకుండుటచే యేదో నిన్ను ఆపుచున్నదని నీవంగీకరింపకుండుట నీయల్పజ్ఞత్వమేగాని వేరుగాదు. దాన సత్కాముడవై యింద్రాదులగాని నిష్కాముడవై భగవంతునిగాని ప్రతిదినము పూజించుచు సాధు జనులు ధనవంతులైన పేదవారైనవారికి పూర్ణసహాయము చేయుచు, సన్మార్గమున నడిచిన యిహపరసుఖము లంద గలవు.

శాంతిపర్వము — భారతము — 5అ — 522 ప:— కం॥
మానుషజన్మము మేలతి। హీనపుజాతిని జనించె నేనియునన్యం।
బైన జననంబుకంటెను। దానిసుగతి బడయనగుట దత్త్వ

ప్రవణా॥ గాన మానవజన్మము హీనజన్మమైనను మంచిదే. ఈమానవజన్మముననే బ్రహ్మవిద్య నభ్యసించి దుర్మార్గము విడచిన ఆసురీ, దైవీ, సంపదపక్షస్థులగు వారందరుమోక్షము జెందగలరు.

## ఆస్తికులు

అహంబ్రహ్మాస్మి, నిష్కామసన్మార్గమున భగవంతుని పూజించుట, వీరును పుణ్యపాపము లేవందురు. అనగా పాప కర్మముచేయరు. పుణ్యకర్మఫలము భగవదర్పితము చేతురు. ఈరీతిపుణ్యపాపములు లేవందురు. ఇట్లు భగవంతునియందు గల సచ్ఛక్తి తమయందుగల్గువరకు తపస్సుచేయుట. సత్యా హింసాదిమార్గాల నడచుట, కాలముగడచినకొలది గొప్ప మేధావంతులై లోకోపకారముచే సమర్థులై బ్రహ్మిష్ఠులగు దురు. భగవంతుని తమయం దైక్యపరచి యేకత్వసిద్ధిచెందిన మహాపురుషుడు లోకకళ్యాణము చేయుచు దేవుడు నేనే అని నను అనకున్నను జగమంగీకరించును. దేవుడనిజగమంగీక రింపకున్నచో బ్రహ్మర్షిత్వసిద్ధికాలేదని అనగా 'అహంబ్రహ్మా స్మి' అనువాక్యసిద్ధి కాలేదని గ్రహించి సిద్ధిమార్గమున సిద్ధించువరకు నడచునది. ఈవాక్యసిద్ధులు ఉ॥ విశ్వామి త్రాదులు. వీరు దేముడు నేనే అనినను దోషము చెందరు. కారణము దేవుడు వారియందైక్యమై యుండుటగాంచి నేనే దేవుడనని నిశ్చయించినవారైరి. అట్లు సర్వజనాంగీకార మైనది.

## నాస్తికులు

అహంబ్రహ్మాస్మి. నేనే దేవుడనుగాన ఎవనిని పూజింపనవసరము లేదు. పాపము చేసిన, పుణ్యము చేసినను దోషము రాదు. అనగా పుణ్యపాపములు, వాటిఫలములు లేవు. భగవంతుని సచ్ఛక్తి మానవునికిగల్గుట వట్టిభ్రమ. ఏమియు చేయకుండా అంతయు భగవంతుడై యుండగావచ్చునదే మున్నది? సత్యాహింసాదులవల్ల ఫలము లేదు. దొంగతనము, అసత్యాదులవల్ల ధనాదులుగల్గును. సత్యాహింసలవల్ల ఫలముగల్గదు. అనిచెప్పుచు, రానురాను బలహీనుడై దుష్టుడనిపించుకొని అవమానముపొందుచు నానాకష్టములతో ఇహపరసుఖములేక నాశము చెందుచుండు.

ఉ॥ చార్వాకుడు మొదలగువారు.

వీరి పూర్ణాభిప్రాయము. ఈజగమును పాలించు దేవుడు లేడు. స్త్రీ పురుషులవల్లనే సంతతిగల్గునుగాని, శుక్రహేతువు అన్నము, దానికి వర్షము, దానికిసూర్యుడు, అతనికి భగవంతుడు కారణమన అంగీకరింపరు.

ఈఆస్తిక నాస్తికులు పురాతనమునుండి నేటివరకును గలరు. కొన్నిరాజ్యముల నాస్తికులు లేనట్లుగ్రంథాలగలవు.

## బ్రహ్మర్షి ఫలము

మండలబ్రాహ్మణోపనిషత్తు – భగవధ్యానములో:—

"చిరసమాధిజనిత బ్రహ్మామృతపాన పరాయణో సౌ సన్న్యాసి పరమహంస అవధూతో భవతి। తద్దర్శనేనసకలజగత్

పవిత్రంభవతి తత్సేవాపరో ఽజ్ఞోపిముక్తోభవతి తత్కులమే కోత్తర శతంతారయతి, తన్మాతృపితృజాయా పత్యావర్గంచ ముక్తంభవతి" చాలాకాలము సమాధిధ్యాన జపములవల్ల ప్రత్యక్షమగుబ్రహ్మమును అనగాభగవంతుని తనయందైక్య సిద్ధిగొనినవాడేసన్యాసి, పరమహంస, అవధూత అతనిదర్శ నమునసర్వజగములు పవిత్రమగును. అతని సేవించుఅజ్ఞుడైన అనగా బ్రాహ్మణాది నాల్గుకులములను అనగా ప్రతికుల మును, 10 విధములైనది. అందుగల వేదాంత బ్రాహ్మ ణుని అనగా బ్రహ్మర్షిని లేక దేవుని మునులుగాక ద్విజ, రాజ, వైశ్య, శూద్ర, నిషాద, పశు, మ్లేచ్ఛ, చండాలురు లేక పశ్చిమ దేశసంఘములగల్గు భారత దేశ ద్విజాదికుల సమగుణ మాన వులైనను ముక్తులగుదురు. బ్రహ్మర్షిసంబంధమగు 101 తర ములవారు తరింతురు. అతనితల్లి దండ్రి, భార్య పిల్లలకీ బ్రహ్మవిద్య తెలియబడి దానిని ఆచరించి, వారునూ త్వరలో జీవన్ముక్తులుకాగలరు.

"సుకృతపరిపాకాత్ విరక్తస్యప్రత్యగాత్మ విషయా జిజ్ఞాసాప్రవర్తతే" ఎక్కువపుణ్యకర్మ ఫలమున వాటి యందువిసుకుజనించి విరక్తుడైనవానికి భగవంతుని విష యము తెలియవలయునని జిజ్ఞాసగల్గును. "సగుణబ్రహ్మో పాసకో గుణవాన్ భవతి" తాను సగుణముతో గూడిన బ్రహ్మోపాసనచేసిన సద్గుణియగును. "నిర్గుణబ్రహ్మోపాస కస్తు బ్రహ్మైవభవతి" యింద్రియవిజయుడై త్రిగుణము

[illegible] సృష్టిఅయిన జగత్ భ్రాంతివదలి తానొక్కడే బ్రహ్మోపాసనచేయువాడు బ్రహ్మర్షి యగును. మొగట సగుణోపాసన చేసి చేసి తర్వాతనిర్గుణోపాసన చేయువాడు తప్పక బ్రహ్మర్షి కాగలడనుటకే సందేహము లేదు.

ఉ:- విశ్వామిత్రుడు.

నిరాలంబోపనిషత్తు - సర్వధర్మములు విడిచి నిర్మమ నిరహంకారుడై బ్రహ్మను అనగా భగవంతుని నొకనినే శరణుపొంది "తత్వమసి, సర్వంఖల్విదంబ్రహ్మ నేహనా నాస్తి కించ నేత్యాది" మహావాక్యార్థాను భవజ్ఞానముచే బ్రహ్మము నేనైతినని నిశ్చయించి నిర్వికల్పసమాధిచే స్వతంత్రుడై చరించువాడే సన్యాసి. జీవన్ముక్తుడు. పూజ్యుడు. యోగి. పరమహంస. అవధూత. బ్రాహ్మణుడనబడును. గాన బ్రహ్మర్షి యొకడే స్వతంత్రుడు అనగా సర్వలోకముల నిశ్చింతగా చరించగలడు. ఇతరవృత్తులుగలరాజు, వేదబ్రాహ్మణ సైనిక, వర్తక, వ్యవసాయకులు, పరతంత్రులు అన వీరి సాయమునవారు, వారిసాయమునవీరు జీవించువారు. వీరు స్వతంత్రులమనుట తమరాజ్యమున తమయింటతప్ప యితర చోట్ల స్వతంత్రులుగారు. గాన మానవులలో బ్రహ్మర్షి అధికుడు. అష్టసిద్ధులు మొదలగు గొప్పశక్తులుకలిన లాభము లేదని కొందరందురుగాని భగవంతుడు సర్వశక్తివంతుడు. అతడుగామారిన బ్రహ్మర్షి కొరకయే సర్వశక్తులు నిగ్రహాను గ్రహశక్తి సర్వసంపదలు అతనిని రాజ్యసంపదలు రాజు

నాశ్రయించియున్నట్లు ఆశ్రయించియుండును. అతడుసర్వాధిపతి. గాన అతనికన్నియు కావలసినవి స్వాధీనపడుచుండును. అతడు సాధారణముగా దేనినికోరక నిత్యానందముతో దేహయాత్రమాత్రము నడుపుచు లోకకళ్యాణమార్గములు ప్రజలకు తనకెట్టిలాభము తిరిగికోరకయే చేయుచుండును. తనకు ముఖ్యముగా కావలసినప్పుడు అగస్త్యుడు యిల్వలుల నుంచి ధనముసంపాదించి తనభార్యకు కొంతయిచ్చి మిగిలినది లోకకళ్యాణముచేయునట్లుచేయురు. ఇట్టిశక్తిరానిచో నిజమైన వేదాంతబ్రాహ్మణుడుకాడు. మెట్టవేదాంతులు తమ ఆటసాగుటకు తమకెట్టిశక్తిగల్గకుండుటజూచి మార్గము తెలియకభుక్తిజరుగుటకు, స్త్రీలనుపాడుచేయుటకు ఎక్కువ స్త్రీలతోనేసంబంధించియుందురు. వీరిది చార్వాకవేదాంతమన రాక్షసవేదాంతముగాని ఋషులమార్గముకాదు.

## బ్రాహ్మణుడనగా

భారతము — అనుశాసనికపర్వము 33 అధ్యా—16శ్లో॥ "అదైవం దైవతం కుర్యుర్దైవతంచాప్యదైవతం" బ్రాహ్మణుడనగాబ్రహ్మవిద్యాయుక్తుడగుయోగి. గొప్పయోగమిచ్చు దైవమును అనగా ప్రారబ్ధకర్మఫలమును అనగా ఒకనికి జాతకరీత్యా రాజయోగముజరుగదగినకాలమును జరుగకుండాజేయగలడు. లేనివానికి సౌఖ్యసంపదలు కల్గించగలడు. అనగా వానిదయతో సర్వసంపదలుగల్గుట. వానికోపముతో

నాశముగల్గుట జరుగుచుండునని భావము. ఈశక్తి మెట్ట వేదాంతులకు యేకాలమునగల్గదు.

## విశ్వామిత్రుడు బ్రహ్మర్షియగుట

రామాయణము 51 సర్గ బాలకాండ. 13 శ్లోకార్థము:-శతానందుడు రామునితోననుట ఎచ్చటనో పరాజితములేని మహిమగల విశ్వామిత్రునితో నీవువచ్చుట నాభాగ్యము. "అచింత్య కర్మాతపసా । బ్రహ్మర్షిరతుల్యప్రభః" విశ్వామిత్రుడు అచింత్యకార్యములు చేసినాడు. తపస్సుచే బ్రహ్మర్షిత్వము చెందినాడు. ఇతనిప్రభతో తుల్యములేదు. మహాతేజుడు. పరమగతి. ఇట్టి విశ్వామిత్రుడు నీకురక్షకుడుగానుండుట లోకములో నీకన్నధన్యుడులేడు.

52 సర్గ - 1-2 శ్లోకములలో 'వసిష్ఠంజపతాంవరం'

రాజైన ఈవిశ్వామిత్రుడు వసిష్ఠునిదరికి వెళ్ళగా 'వసిష్ఠేనమహాత్మనా - భగవాన్‌వసిష్ఠ' అని శబ్దములుగలవు. అనగా జపయజ్ఞముచే బ్రహ్మర్షిత్వము చెందినవారిలో శ్రేష్ఠుడు. మహాత్ముడన అంతటను తనయందు భగవంతునిజూచినవాడు. భగవాన్‌అన మానవుడై పుట్టి భగవంతునితో తుల్యుడగు బ్రహ్మర్షిగా మారినవాడనిఅర్థము.

దీనింబట్టి ప్రస్తుత వేదాంతాభ్యాసకులు పూర్వర్షులవలె సిద్ధిజెందినగాని లాభములేదు. లేనిచో సచ్ఛక్తి విహీన వేదాంతముచే పొందుఫలమేమి? అతనికి ఆసనమిచ్చి ్రగా

వించెను. వసిష్టుడెక్కువగా జపయజ్ఞముచేసెనుగాని విశ్వామిత్రునివలె కుంభకాదియోగములుకల్పి జపయజ్ఞముచేయనట్లున్నది. ఆకాశభూత సంబంధముగలది జపయజ్ఞము. 'ఆకాశం శబ్దగుణకం' దానియందు చెడుధ్వని, మంచిధ్వని కలదు. చెడుధ్వనివిడిచి సజ్జనహితశబ్దములు సత్యమైనవి పల్కుట, సచ్ఛబ్దములగుభగవన్నామములు నిత్యముజపించుట అట్టిసుశబ్దములతో భగవంతునిగురించి పాడుట, చెప్పుట, స్తోత్రములుచేయుట, వీరిసంగీతముచే: పశువులు పిల్లలు, త్రాచుపాములు సంతోషించి అపకారముచేయకనిలచుట, దుష్టులగు రాక్షసాదులు చెప్పినట్లునడచుట, వారి మాధుర్యవాక్కులువిని రాజులు, దేవతలు, భూలోక స్త్రీపురుషులు వశ్యులై ఏదికావలెనన్న అవియిచ్చిపూజించుట గల్గించునది. పరిశుద్ధశబ్దము అది సంగీతధ్వనిగా అక్షరములతోగూడిన శబ్దముగానున్నది. మాధుర్యభగచ్ఛబ్దములు జపించి జపించి, మధురశబ్దములగు సత్యముపల్కుచు వసిష్టుడు బ్రహ్మర్షియైనట్లు 'అజపతాంవర - జపతాంశ్రేష్ఠో' అని ప్రయోగములబట్టి తెలియుచున్నది. విశ్వామిత్రుడు జపయజ్ఞము, వాయుభక్షణచేసి బ్రహ్మర్షియయ్యెనని భావము. వసిష్టుడరుంధతితోనుండిపరిశుద్ధసాత్వికాహారముదినుచు జపయజ్ఞముచేసి బ్రహ్మర్షియయ్యెనని భావము. పందిపెంట, మనిషిమలము లేనిచోట వర్షోదకము, పాతాళగంగతో పండినసాత్వికాహారము తినినాడనిచెప్పనగును. శేషధర్మములో శ్రీకృష్ణుడు ఆంధ్రబాషలో

కవిత్వము వ్రాయకూడదనెను. అనగా సంస్కృతసమము. దేశీయ, గ్రామ్యశబ్దములతో అనగా మాధుర్యముగూడి సత్యము తెల్పునవిమాత్రము మంచిదనియు, అపశబ్దములన వినరానిమాట అనగా మనిషికి సంతోషముగల్గించనివి. సత్యార్థము పూర్తిగా తెలపనివిఅగు దుష్టభాషలోకవిత్వము వ్రాయకూడదనిభావము. ఆంధ్రదేశములో ఖరదూషణాదులవంటి దుష్టులేకాలమునను గల్గియున్నారని వారిభాషలో గ్రంథము వ్రాయరాదనియు, సుగ్రీవహనుమదాదులువంటి మహాత్ములు గోదావరిఒడ్డున అగస్త్యాదులవంటి బ్రహ్మర్షులు పూర్వముకలరు. వారంతవారుగాకున్నను ఏకాలమునకు ఆకాలమునకు తగిన సుజ్ఞానమార్గస్థులుందురనియు, వీరు మాట్లాడుమధురాంధ్రములో గ్రంథములు వ్రాయదగునని గ్రహింపదగునేగాని ఆంధ్రిమేషనికిరాదని చెప్పరాదు. కృష్ణుడు నాటికి ఆంధ్రదేశము పరిస్తుతాంధ్రముకాక పిశాచాదిభాష లెక్కుడుగానుండవచ్చు. సంస్కృతము తక్కువకావచ్చు. దాన నతడుపిశాచాదిభాషలలో కవిత్వముచెప్పరాదని చెప్పినాడని గ్రహింపనగును. ఈమధ్య కొందరుమహాత్ములు అపశబ్దములతో అనగా పామరులభాషలో గ్రంథాలువ్రాయవలెనని వాదించిరి. వాదించుచున్నారు. పామరులను మాధుర్యభాషజ్ఞులుగా చేయవలెనేగాని మాధుర్యభాషజ్ఞుల పామరభాషజ్ఞులుగాచేయరాదు. సుశబ్దోచ్చారణచే, సుశబ్దముల వినుటచే, సుధ్వనియుతసంగీతమువినుటచే, పాడుటచే 'ఆకా

'శాత్ వాయుఃపుష్టైను' సుశబ్దమున ప్రాణవాయువు, అప శబ్దమున చెడువాయువు పుట్టును. గాన వరాహోపనిషత్తు:— "ఇంద్రియాణాంమనోనాథ, మనోనాథస్తుమారుతః। మారుతస్తులయోనాథం। తంనాథంలయమాశ్రయః" ఇంద్రియ ములకు మనస్సుప్రభువు. మనస్సునకు ప్రాణవాయువురాజు. ప్రాణవాయువునకు ఆకాశమన సుశబ్దమునాథుడుగాన సుధ్వని సుశబ్దములచే అనగా "నిశ్చేష్టోనిర్వికారశ్చ లయోజీవంతి యోగినాం" ఇతర దుష్టకర్మములుమాని నిర్వికారుడై భగ వంతునిగాన, స్తోత్ర, జపములచే పూజించుచు యోగిజీవిం చును. దీన ప్రాణవాయువువృద్ధియై నిరోగియై, ఆయుర్వృద్ధి గల్గి, లోకకళ్యాణముచేయశక్తియేర్పడును. అందుచే జపము చేయువానికి ఆదివ్యాధులురావనిగలదు. చెడుధ్వనులు, చెడు శబ్దములు అసత్యముపల్కువారు ప్రాణవాయువు వృద్ధిగాక నీచులై హీనబుద్ధులై దుష్కర్మములచేయుచుందురు.

రామాయణము:— ధర్మసత్యములుగలవారికి అకాల మృత్యువురాదనెను. సత్యముపల్కుట ప్రాణవాయువృద్ధి యగును. మరియు సుశబ్దజపముచే మనస్సుమంచిదై స్వాధీన మగును. మనస్సుసంకల్పవికల్పములుగలది. మంచిమనస్సు సుసంకల్పసిద్ధియు, చెడుమనస్సు వికల్పసిద్ధినిపొందును. మంచి మనస్సుమోక్షకారణము. మ॥స్మృ॥ "మనస్సత్యేనశుధ్యతి" మనస్సుసత్యము పల్కుటచే పరిశుద్ధిచెందును.

'భద్రంబ్రూయాత్' శుభవాక్యములు పల్కుము,

పూర్వర్షులు ఆకాశభూతవిసర్గ పూర్తిగాచేసిరి. గనుకనే ఉపనిషదాదిగ్రంథములు వ్రాసి లోకకళ్యాణముచేసిరి. ఒక శబ్దమువలనదైన శరీరమునగల ఆకాశము, వాయువు, అగ్ని, జల. భూభూతములు పరిశుద్ధియై యోగ్యమనస్సుగలవాడగును.

## లోకైకభాష

అట్టిభాష లోకములో సంస్కృతభాష అయియున్నది. అదిచదివినవారు సాత్వికులుగానున్నారు. వేయేండ్లక్రితము భారతదేశమున కవులు తమదేశభాషలలోగాక సంస్కృతమునసే గ్రంథములువ్రాసెడివారు. ఇంగ్లీషుచదివెడువారు రజోగుణులుగానుందురు. ఇతరభాషలు చదువువారు రజస్తమోగుణయుక్తులగుదురు. గాన సంస్కృతభాషా సద్గ్రంథములు అన వేదాదిఋషికృతగ్రంథములు, భగవద్గీతాదిసద్గ్రంథములు అధ్యయనము చేయమనిరి. దాన ప్రాణవాయువృద్ధియై మనోజయులై, సాత్వికులై, కైవల్యమార్గస్థులగుదురు.
ఉ॥ ప్రస్తుతకాలమున తిలక్ గారు గీత॥ 18 అధ్యాయము ప్రతినాడు చదివెడువారని వారిగ్రంథానగలదు. భారతమున:- "అధ్యయనంబున దేవభావముగను" సద్గ్రంథపఠనమున ...రము. దీన తిలక్ మహాశయుడు దేశవిఖ్యాతిగాంచెను.

బలహీనజాతకుడు తనగ్రామమున యింకాబలహీన

పాలకుడు. తనయింట సాత్త్వికుడై పోషణము చెందుచుండెను. సాత్త్వికాహారమున భూభూతము, సాత్త్వికజలమున రక్తము, సాత్త్వికఘృతాదుల అగ్ని, ప్రాణవాయువుచే గాలి, సుశబ్దముల ఆకాశము మనస్సు మొదలగునవి శుద్ధమై పురుషవరి శుద్ధుడై కైవల్యమార్గమున నడిచి నడిచి బ్రహ్మప్రాప్తియగును. హారీతస్మృతి :– 'జపేన దేవతానిత్యం స్తూయమానా ప్రసీదతి ప్రసన్నే విపులాన్ గోత్రాన్ ప్రాప్నువంతి మనీషిణః। రాక్షసాశ్చ పిశాచాశ్చ మహాసర్పాంశ్చ భీషణాః। జపితానోపసర్పంతి దూరాదేవ ప్రయాంతి తే" జపముచే జపదేవత ప్రసన్నమగును. ప్రసన్నమున జపించువాని వంశవృద్ధియగును. రాక్షసులు, పిశాచములు, గొప్పభయంకర విషసర్పములు జపముచేయువాని దరికిరావు. గాన సంస్కృతభాషాభగవన్నామములు జపించువారిలో వసిష్ఠుడు శ్రేష్ఠుడై బ్రహ్మర్షి ఆయెను.

గాన సంస్కృతభాషనే భూలోకసర్వమానవులు వృద్ధి చేసి రాజకీయభాషగాజేసుకొని జపాదులుచేయుచున్న ఇహపర సర్వసౌఖ్యములుబొంది బ్రహ్మర్షులగుదురు. నీచభాషలచే గ్రంథములు వ్రాసినకవికిని, చదివెడివారికిని అల్పఫలము. హైన్యభావములుగల్గును. తొల్లి నిషాదభాషజ్ఞుడగు వాల్మీకికి ఆనీచలోగాక 'మరా' అనుశబ్దము 'రామ' శబ్దమగునని భావించి వాల్మీకి సంస్కృతభాష భగవన్నామమును జపముచేయుమని బోధించెను. దానినిజపించి ఆతడుబ్రహ్మర్షి

యయ్యె. గాంధీజీ గీతాధ్యయనముచేసెడివారు. యోగ్య గ్రంథ సత్యపారాయణుడగుట, అతనియందు కొన్నిలోప ములున్ననని కొందరనినను, భారతదేశమున గొప్పఖ్యాతి గాంచెను. ప్రస్తుతరాజ్యమేలుచున్న కాంగ్రెసువారు గాంధీ జీవలె గీతాధ్యయనముచేయ మొదలిడినవారినిజూచి ప్రతి మానవుడు అధ్యయనమాచరించి దేవత్వముచెందగలడు. అందుచెప్పిన నిష్కామమార్గమాచరించిన బ్రహ్మర్షులగు దురు. ఇది సంస్కృతభాషాధిక్యత. ఈభాషమాట్లాడిన దేవతాశక్తి ఆవేశించుననుభావమున దీనిని దేవభాషయనిరి.

ప్రస్థుతకాలములో పశ్చిమదేశాల జర్మనీదేశస్థులీ సంస్కృతభాషవృద్ధిచేసి ప్రస్థుతలోకములో మేధావంతులై పేరుగాంచిరి. పురాతనభారతదేశస్థులీ సంస్కృతభాషవృద్ధి చేసి ఎక్కువ ప్రఖ్యాతిజెందిరి.

తైత్తిరీయము:— "అన్నేన ప్రాణం, ప్రాణేనబలం" దీన మేధాగల్గుననిరి. మేధాగలవాడన ఋషియగునని ఋషియన సత్యము తెలిసి సత్యముపల్కువాడని అర్థము. పరిశుద్ధాన్నముతినిన గల్గుఫలముయిది. అన్నముమంచి దయిన ప్రాణమయము, మనోమయము మంచిదగును. పరి శుద్ధాహారమునమనస్సు మంచిదగును. లేనిచో చెడుననిగలదు. యిట్టిస్థితి, మాధుర్యభాషణమున, సుశబ్దముల ప్రాణవా యువువృద్ధియై, మనోజయత్వముగల్గి ఋషియగును. ఆకా శమునశబ్దముగలదు. అదిసుశబ్దమైన ప్రాణవాయువు వృద్ధి

నైనమనోజయశ్వాసమే ఋషినిచేయును. అనగా పరిశుద్ధాహారమున నెంతఫలమో, మనశ్శుద్ధిభగవన్నామముల పరోపకారవాక్యముల నంతకన్న తొందరలో ఎక్కువఫలమిచ్చుచున్నది. గాన వసిష్ఠుడు పరిశుద్ధాహారము, మనశ్శుద్ధి, భగవన్నామజపముల తొందరలో బ్రహ్మర్షి యయ్యెను. యిట్లుచేసినవాడు నేమనూకాగలడు. అందుచే వేలాది గ్రంధములు, గీతలు ప్రతిరోజు అధ్యయనాదులుచేయుట, భగవంతునిపై కవిత్వముజెప్పుట, భారతీయులు అలవాటుచేసి గొప్పపేరుగాంచిరి. భోజరాజు, కాళిదాసాదికవుల కాలమున సంస్కృతభాషాకవిత్వము వృద్ధియై పేరుగాంచినది. దేశభాషలున్నను నేటికినీ వైద్యాదిశాస్త్రముల భారతీయులు సంస్కృతభాషలోనే చదువుచున్నారు. సంస్కృతజన్యములగు దేశభాషలు సామాన్యసాత్వికగుణమునిచ్చును.

విశ్వామిత్రుడు తుదకు వాయుభక్షణలో జపయజ్ఞమున బ్రహ్మర్షి అయ్యెను. గాని సాత్వికాహారమున తపస్సుచే రాజర్షియయ్యెను. అనగా సాత్వికాహారనిర్ణయము వశిష్టునివలె విశ్వామిత్రునికి తెలియదనదగును. వశిష్టుడు సాత్వికాహారముతో జపయజ్ఞమున బ్రహ్మర్షి అయ్యెను. రాజైనవిశ్వామిత్రుడురాగా వశిష్ఠుడు అతనిని గౌరవించి అతిధిపూజచేసెను. తర్వాతవీరు గోవుకై కలహపడిరి. అందు కౌశికుడు ఓడెను. తర్వాత, శ్లో॥ "రాజర్షి" ధిగ్బలంక్షత్రియబలం బ్రహ్మతేజో బలంబలం — క్షత్రియబలమన

యిచట రాజ్యమేలు రాజుబలము హీనమైనది. బ్రాహ్మణ బలముగొప్పదని నిర్ణయించి రాజ్యమువీడి ఫలమూలాశనుడై భార్యనుపొందుచు వెయ్యేండ్లుజపింప సత్సంతతివృద్ధియైనది. "రాజర్షి" యని బ్రహ్మ, దేవతలు పిలిచిరి. మరల నట్లే తపముచేసెను. ఆకాలమున త్రిశంకమహారాజు వశిష్ఠునిచే శపింపబడి ఛండాలుడయ్యె. అతనికి స్వర్గముశరీరముతో పోవలెనని బుట్టగా విశ్వామిత్రునాశ్రయించి "దైవమేగొప్పది" "పౌరుషము వట్టిదే" నేను చేసినపౌరుషముచెడినది గాన విశ్వామిత్రా! "దైవం పురుషకారేణ నివర్తయితుమర్హసి" నీవు ప్రారబ్ధమును పౌరుషముచే త్రిప్పదగుదువనెను. దాన అతడట్లుసేయ స్వర్గమువచ్చు త్రిశంకునికి యింద్రాదులంగీకరింపలేదు. దాన దక్షిణదిక్కున సప్తర్షినక్షత్రముల సృజించెను. అంత దేవతలకు విశ్వామిత్రునికి రాజీ కుదిరినది. అంత త్రిశంకుడు విశ్వామిత్రనక్షత్రముల తలక్రిందుగానుండ స్వర్గభోగము లనుభవించునని దేవతలుచెప్పివెళ్ళిరి. అనగా రాజర్షియగు కాలాననే ఇంతటిశక్తి విశ్వామిత్రునికి గల్గినది. వరుణాదిదేవతల తృప్తిపరచి శునశ్శేపునికి దీర్ఘాయువు గల్గునట్లుచేసెను. ప్రస్తుతముగూడా యిట్టిసచ్ఛక్తిగల్గినగాని "రాజర్షి" అనబడడు. ఋషి మరలతడు వేయేండ్లుతపము సేయ, ఋషివైతివని బ్రహ్మాదులనిరి. "ఋషి" అనగా నిత్యము సత్యముపల్కువాడు ధర్మమున చరించువాడు.

తైత్తిరీయోపనిషత్తు:— నారాయణప్రశ్న — 42 అను

నాకము – "త్వయాజుష్టాఋషిర్భవతి, దేవిత్వమ్బ్రహ్మ ఆగతశ్రీరుతత్వయా త్వయాజుష్టశ్చిత్రం విందతేవసుసానోజుష స్వద్రవిణోనమేధే" ॥మేధ॥ అనగా సద్గ్రంధములగల సత్యార్థముగ్రహించి దానిని మరువకుండ ధారణజేసికొను నట్టిశక్తి, దీన సత్యార్థములు తెలియుచుండును. "త్వయాజుష్టాను దమానాదురుక్తాన్ బృహద్వదేమ" మేధా దేవి సీదయగలవాడు ఋషియగుచున్నాడు. సత్యలోకమును పాలించు బ్రహ్మర్షి అగుచున్నాడు. ఎక్కువసంపదలు గలవాడు. అనేకవిధములైన ధనముపొంది కుబేరునివలె ప్రకాశించుచున్నాడు. "పడవిఃకవీనాం, ఋషివిప్రాణాం" సుశబ్దములు కలవారు, కవులలో వాల్మీకాదులు, భగవస్వరూపులుగా నున్నారు. సద్గ్రంధములగు వేదాదులభ్యసించు వారిలో ఋషియై భగవంతుడుగాకన్పడుచున్నాడు. "నాఋషిఃకురుతే కావ్యం" ఋషి అయితేనేగాని సద్గ్రంధముచే లోకకళ్యాణము చేయలేడు. మేధా దేవి ఆశ్రయించినవెంటనే దురాకృతులు వెడలిపోయి సుశబ్దములుగల్గును. ఋషిఅనదగిన వాని కాశక్తియున్నగాని నమ్మదగదు.

"మహర్షి-అన సర్వేంద్రియవిజయుడుగాని తపస్వి"

మరల వేయేండ్లుతపముసేయ విశ్వామిత్రుని బ్రహ్మాదులు మహర్షి అని పిలిచిరి. నేను యింద్రియవిజయుడనైతి నన నీవుగాదు. జితేంద్రియుడవై తపస్సులోనెగ్గిన బ్రహ్మ

ర్షివి అనగా బ్రాహ్మణుడగుచున్నాడు. తైత్తిరీయోపనిషత్తు:- “మేధయా, మనీషా” మేధచే మనీషగల్గును. దాన మంచి మనస్సుగల్గును. దాన శాంతిగల్గును. దాన శుద్ధచిత్తము, దానిచే స్మారమన భగవంతుని నిరంతరస్మరణచేయుట దానిచే విజ్ఞానమన అనుభవజ్ఞానములేక విశిష్టజ్ఞానము పొందు చున్నాడు. దానిచే “ఆత్మానం వేదయతి” భగవంతుని దర్శనము జెందుచున్నాడు.

భగవద్గీత :- 2అ॥ “బుద్ధియుక్తోజహాతీహ ఉభేసుకృతదుష్కృతే” పరిశుద్ధబుద్ధితో నిష్కామచిత్తధ్యానము చేయువాడు పాపపుణ్యములవిడుచుచున్నాడు. “యోగః కర్మసుకౌశలం” ఇదే కర్మలయందలి నేర్పరిత్వముగలయోగము. గీత 18 అ॥ “బుద్ధియోగముపాశ్రిత్య మచ్చిత్త సతతంభవ। మచ్చిత్తస్సర్వదుర్గాణి మత్ప్రసాదాత్తరిష్యసి” పరిశుద్ధబుద్ధితోగూడి చిత్తము నాయందుగలవాడ వగుము. అట్లయిన నాదయచే సర్వదుఃఖములను దాటుదువు. దీనితో కృష్ణుని కృపగల్గిన అర్జునునివలె నిత్యవిజయుడు, సర్వసంపదలుగలవాడగును. ఋషికాలమున కామమును, మహర్షికాలమున కోపమును, విశ్వామిత్రుడు జయించలేదు. అనగా ఋషియైనతరువాత మేనకనుగూడి, మహర్షియైన తర్వాత రంభనుశపించియు, తపోవిఘ్నమును చెందెను.

బ్రహ్మర్షి:- తర్వాత విశ్వామిత్రుడు సర్వేంద్రియ విజయుడై తానొక్కడే నిర్గుణబ్రహ్మధ్యానము చేసి చేసి

కొంతకాలమునకు బ్రహ్మర్షి అయ్యెను. యీకాలమున పర స్త్రీని పరాశరునివలె సత్సంతతికై పొందిన దోషముచెందదు. కోపముతో శపించిన దుష్టులు నశింతురు. దాన అతనితపో బలము తగ్గదు. సర్వశక్తివంతుడగును. బ్రహ్మర్షిత్వమున బ్రాహ్మణత్వము దీర్ఘాయువుగల్గును. ఓంకారము, వషట్ కారము వేదాదిసద్గ్రంథము పరులకు అందుగల సత్యము చెప్పుటకు ఆచరించి సత్ఫలము చూపుటకు తగినవాడగునని భావము, అనగా భగవంతునివలె నిగ్రహానుగ్రహశక్తిగల వాడగునని తెలియుచున్నది. అవతార పురుషునకు బాల్యము నుండి యీశక్తిగల్గును. మానవుడుగ బుట్టి బ్రహ్మర్షిగ మారినవానికి మారినకాలమునుండి అట్టిశక్తిగల్గునని భావము. రామాయణము, బాలకాండ — దశరథుడు మొదట యేది కోరిన అదియిచ్చెదనని రామునివ్వమన యివ్వననగా విశ్వామిత్రునికి కోపమువచ్చెను. “చచాలవసుధాకృత్స్నా వివేశచభయంసురాన్” భూమిచలించెను. దేవతలు భయ పడిరి. జగన్నాశనహేతువిదియని గ్రహించి వశిష్టుడు పంప మన దశరథుడు రాముని విశ్వామిత్రుని యజ్ఞరక్షణకు పంపెను. కలియుగమాటచే నెక్కడచూచినను బ్రహ్మర్షుల యినట్లునటించువా రెక్కుడుగానున్నారు. పైశక్తివంతు లక్కడక్కడ భారతముననుండకమానరు. వారినిచేరి బహ్మ విద్యనేర్చి ఆమార్గానఅభ్యసించి, రాజర్షిత్వ, ఋషిత్వ, మహర్షిత్వ, బ్రహ్మర్షిత్వముల సిద్ధిచెందనగును.

కృతయుగమున నేమాదిచేసిన తపస్సిద్ధి కలిలో నొక్క నాటికే సిద్ధించునని వరాహపురాణమునగలదు. కృతయుగమున 10000 యేండ్లకయిన తపస్సిద్ధి కలిలో సం॥ 2–9–10 రోజులకగును.

యోగవాసిష్ఠము చిత్తవృత్తినిరోధమునకే అర్థము చెప్పినది. గీతాప్రకారము – అంతటను తనయందు భగవంతుని సదర్శించుటయని అర్థము చెప్పినను, మరికొన్ని మాసములు భగవంతుని తనయందైక్యపరచి తపస్సుచేసిన బ్రహ్మర్షి కాగలడని నాదృఢాభిప్రాయము. కలియుగమున త్వరలోనే బ్రహ్మర్షిత్వసిద్ధి కాగలదు. విశ్వామిత్రుడంతకాలము చేసినగాని సిద్ధించలేదుగదా మనకగునాయని భయపడరాదు.

అస్మద్గురూత్తముడు:– నాకు వేదాంతజ్ఞానమార్గముపదేశించిన గురువు "శ్రీ కోదండ రామరాజావధూతగారు" వాయుభక్షకులు, బ్రహ్మర్షి, నిరోగి, హిమవత్పర్వతప్రాంత నివాసి. అతడునాతో 13 యేండ్లకు మానవుడు బ్రహ్మర్షి కాగలడనియెను. అట్లుకానిచో 13, 13, 13, యిట్లు నిన్నుజగములో సజ్జనులు బ్రహ్మర్షివని అంగీకరించువరకు జపతపంబులు మానరాదనియు నేను నీదరినుండనుగనుక నేనుచెప్పి మార్గము: గీత, ఉపనిషత్తులు, శ్రుత్యాదులేగాన నీకనుమానముగల్గువేళ యాగ్రంథములుచూచిన అంతకంతకు నేను చెప్పినసత్యమార్గము తెలిసి నడువగల్గుదువు. దాన కొంత కాలమునకు బ్రహ్మర్షివికాగలవనెను. ప్రస్తుతము ధనము

శక్తిగల హెచ్చుటగల్గును. అయినను విడువక అభ్యాసము చేసి సర్వాత్మైకనంతమగు నీవిద్య సాధువులకు బోధింపుమని చెప్పి వెళ్ళెను. నాకప్పటికి 25 యేండ్లుండును. బాల్యమునుండి శివ సరస్వతీ మర్గాదుల జపించుట మాతాపితరులు అభ్యాసముచేయించిరి. నాజాతకమున గండమున్నదని అదిగోలగుటకు వారేర్పాటు చేసిరి. తర్వాత యీమహాత్ముడు మాఅత్త వారి గ్రామమున దర్శనమిడి బ్రహ్మోపాసనా మార్గము జెప్పినాడు. యిపుడునాకు 63 యేండ్లు. రమారమి 40 యేండ్ల నుండి యింటనుండియే ఆయన చెప్పినట్లు చేయుచున్నాను. 25 యేండ్లలోగా నేవ్రాసిన గ్రంథాలు నాకే పనికిరాక యున్నవి. 25 యేండ్లు దాటినతర్వాత, 80, 90 గ్రంథాలు వ్రాసితిని అవియు మధ్యస్థముగాయున్నవి. అస్మద్గురూత్తమునిదయచే మనగ్రంథాలసత్యము యితరమతగ్రంథాల సత్యము అర్థమగుచున్నది. అదిచూచి లోకకళ్యాణముగా "లోకైకకళ్యాణగృహస్థుడు" "లోకైకమతము" లోకైకరాజ్యమని మూడుగ్రంథములు వచనముగానే ప్రజలకు తెలియగలందులకు వ్రాసితిని. ఆగ్రంథముల ప్రకారము ఆచరించిన తప్పకసత్ఫలముగల్గునని నాఅభిప్రాయము. నాకు 21 సంవత్సరము మొదలు (నేడునాకు 63 సంవత్సరములు) నేటివరకు బలహీనజాతికమగుటచే నేను బ్రహ్మర్షిత్వసిద్ధిచెందినను పొందకున్ననూ కొద్ది మేధానాకుగల్గకపోలేదు. శివాది జపప్రారంభమునుండి నేటివరకు రోగములు లేవు. సద్గు

ష్టియును పొందుచు వాటిలోని సత్యాగ్రహముకనుగొనుటకై ప్రయత్నము కలుగజేయుచును సత్సృష్టి అనగా పురాతనగ్రంథములలో చెప్పబడిన విశ్వసృష్టిరహస్యములను గ్రహించవలసియున్నదనియు మానవసృష్టియైన తర్వాత ఆత్మజ్ఞానశాస్త్రములు కానవచ్చినవనియు మంచిమార్గానవృత్తిపొంది భగవంతుని జేరవచ్చునవేమార్గాల తోగూడినగ్రంథాలు వ్రాసినవాడనగుటచే లోకకళ్యాణము చేసితినిగదా అని సంతోషము పొందుచున్నాను. నాగురుకృపచే పురాతన బ్రహ్మవిద్య బలపుట్టినది మీకు తెలిపినందుకే నిత్యానందభరితుడనగుచున్నాను. యిదియెంత బ్రహ్మవిద్యా లక్షణవే గదా. గొప్పరాజయోగజాతకులకీవిద్య త్వరలో సిద్ధినిచ్చి బ్రహ్మర్షినిచేయగలదని నానమ్మకము. కవియన సత్యమును, శ్లోకపద్యములుగా వచనముగగాని వ్రాసిన వాడే కవియని చిన్నగ్రంథమువ్రాసితిని. ధనాదిసర్వదాన ములకన్న విద్యాదానముగొప్పదికదా! నిప్పులమీదు దుష్ట ప్రబంధములు నాటకము మొదలగుగ్రంథముల సత్యములే కుండుటజూచి భాషాభివృద్ధికేఅని వాటినివిడిచి శృత్యాదుల నెక్కుడుకృషిచేసి వాటిగొప్పతనము చెప్పలేక, వ్రాయలేక ఋషులభిప్రాయములకు ఆశ్చర్యపడుచు సంతసమొందు చున్నాను. ఓ మనుష్యులారా! మీరీలోకములో నుండుట నిత్యముగాదు. గనుక, ధనసిద్ధి, విద్యాధనసిద్ధి, రాజ్యసిద్ధికై పాటుబడుమీరు వాటితోపాటు బ్రహ్మర్షిత్వసిద్ధికై పాటుబ డుట ఉత్తమధర్మమని నాయభిప్రాయము.

ఉటంకి త్రి

ధ్యానబిందూపనిషత్తు:- హృత్పద్మము 8 దళములు గలది. అందు జీవుడు తూర్పు, పడమర, ఉత్తరం, ఈశాన్యం దళములనున్న సర్వసౌఖ్యములు చెందుచుండును. తక్కిన కోణ సౌఖ్యము లేదు. అతడిట్లు తిరుగుచుండును. మధ్యనున్న, "సర్వం జానాతి గాయతినృత్యంతి ఆనందంకరోతి" అన్నిటిని తెలిసియున్నాడు. పాడుచున్నాడు. నాట్యము చేయుచున్నాడు. సంతోషము నిచ్చువాడగుచున్నాడు. పరులకు సంతోషమిచ్చుటచే తాను ఆనందమునొందుచున్నాడని తెలియదగును. దీనింబట్టియే గాబోలు, వాస్తుశాస్త్రమున - తూర్పు, పడమర, ఉత్తరగృహములు, ఈశాన్యవాసము మంచిదనియు తదితర ఆగ్నేయాది గృహములు (ఆయాదిశలు మంచివిగావని) గలవు. గృహమధ్యవాసమున పరులువచ్చుట పోవుట గల్గుటచే వారితో సంతోషముతో కాలముగడపుటగల్గునన దగును. ప్రతివాడు జీవుడు పూర్వాది 4 దిక్కులగాని మధ్యగాని వున్నట్లుభావించుట శుభప్రదమిదునని నాయభిప్రాయము. ఆకమలము జీవుని వాసస్థానముగదా - డిటో:- "హృదిస్థానే జీవాత్మరూపం జ్యోతిరూప మణుమాత్రం నివర్తతే" హృదయమున అణుమాత్రమగు జ్యోతిరూపుడై జీవాత్మకలడు.

తైత్తిరీయోపనిషత్తు - 13 అనువాకము. నారాయణ ప్రశ్న:- సర్వపాలకుడు భగవంతుడు "సహస్రశీర్షం దేవం

విశ్వాక్షం విశ్వశంభువం విశ్వం నారాయణం దేవం అక్షరం పరమంపదం" సర్వజగదాత్మనగు విరాడ్రూపము. మహేశ్వరుని దేహము. సర్వలోక సర్వజంతుశిరములు అతనికి శిరస్సు. అందరి నేత్రములు అతని నేత్రములు అందరి పాదాదులు అతనికి పాదాదులు అనగా సర్వసమిష్టిరూపుడుగా యున్నాడు. అణువునకు తక్కువగానున్నాడు. అనగా సర్వశక్తివంతుడు. భగవంతుడు డెట్లుండవలెనన్న అట్లుండగలశక్తిమంతుడు. యీప్రపంచమునకు సుఖమిచ్చువాడతడే యిదివిరాడ్రూపము. యింకనేకరూపములచే వర్ణింపబడునాడు. ఉండువాడు. అట్టిభగవంతుని జ్ఞానయోగముచే పొందదగిన వాని ప్రతిమానవుడు ధ్యానింపతగినది. రాజుని ప్రజలనుసరించునట్లు భగవంతుని సర్వజీవులు అనుసరింపదగినది. అందుమానవజన్మము భగవంతునికి రాజుతర్వాత యున రాజువలె అతనిని సమీపించుటకు లేక అతనిని తనయందైక్యము చేయుటకు బ్రహ్మ యింద్రాది దేవతలకన్న తగినదైయున్నది. గాన మానవులగు స్త్రీ పురుషులందరు అనిత్యమను మేఘమువంటిదిఅగు యీమానవజన్మమునగల స్వల్పకాలమందే తప్పక ధ్యానించి ధన్యులుకాదగినవారై యున్నారు. రాజులేని రాజ్యప్రజసౌఖ్యములొందనియట్లు యీకొద్దికాలము భగవధ్యానముచేయుటమాని జడపదార్థములతో గూడిన భిన్నరూపప్రపంచము నారాధించి యేమిలాభము పొందగలరు? అన లాభము లేదనుట — యీప్రపంచమును,

అతనిభార్యయు సర్వమునకు తల్లియును పరమేశ్వరి రూపముగజూచి ఆరాధించిన కొం[illegible]వు. అనగా భార్యతో మిత్రితగల అతిథి యజమానుగాంచిన [illegible]నో యని కొత్తసౌఖ్యముపడునట్లు పరమేశ్వరి ఆరాధకుడు, తండ్రినెరుగకతల్లిదరినున్న అప్పుడూడ కొత్తకాలములనుఖము చెందినట్లు సామాన్య ప్రకృత్యైశ్వర్యములతో సుఖపడును. అప్పుడూడ పెద్దదై బలిసితల్లియనిజ్ఞానములేక కాముముతో పైబడనెంచిన నిషాకామముగలతలిచే తన్నబడి ఆసుఖమునకు దూరమగునట్లు యీప్రకృతిభాగ్యము పోగొట్టుకొనబడును. అట్లుగాక పరమేశ్వరీ బరమేశ్వరరూపముగా యీప్రపంచమునంతియు తనయందుచూచి ఆరాధించుజ్ఞాని సర్వసుఖముల నిత్యముపొందగలడు. లేక పతివ్రతయగు తల్లి, మంచిపిల్లలయందు ఎక్కువప్రేమగలది దుష్టబాలురయందు తక్కువప్రేమగలదై, భర్తయందెక్కుడు ప్రేమతో అతనుచెప్పినటులే నడచుచుండను. అటులే యీప్రపంచమును తన్ను భగవంతునిరూపముగా ఆరాధించిన పతివ్రతయగు పరమేశ్వరి దయగలదై భర్తయగు భగవంతునియిష్టప్రకారము భగవంతునితో యేకమై ఆరాధించినవానికి సర్వసౌఖ్యములు జీవన్ముక్తియిడుచుండును. భార్యాభర్తలకిష్టుడగు అతిథి సంపూర్ణ పూజాగౌరవములు జెందినట్లు పరమేశ్వరీ పరమేశ్వరారాధకుడు సంపూర్ణసౌఖ్యములొందగలడు. ఈప్రపంచమును, సర్వలోకరాజ్యములువారివి. తలితండ్రుల నిద్దగిని

పూజించుపుత్రుల కేకలహములులేక వారి ఆస్తిపై యజమా నత్వములభించునట్లు పరమేశ్వరీ పరమేశ్వరార్జన పరుడగు వానిజూచి సంతసించి తమరాజ్యమునకు అనగా యీ ప్రపంచమునకు తమవలె పాలించువానిగా చేతురు, గాన గ్రామాధ్యక్షులు, సంఘాధ్యక్షులు, రాష్ట్రాధ్యక్షులు, దేశాధ్యక్షులమని గర్వమువిడిచి పేదవారమని, ధనవంతులమని, హీనులమని, దీతనవిడిచి యివి అన అధ్యక్షతయు, ధనవంతము, బీదతనము, హీనత్వము, త్వరత్వరగా నిత్యముగాక మారినట్లు గ్రంధములకలదు. నేడంగరు జూచుచున్నమారుచున్నవి. ముందిట్లేమారగలదని నిర్ణయించి నిత్యానందుడు అక్షరస్వరూపుడగు భగవంతుని తాము జీవించుటకు తగినవస్తువులసంపాదింప కొంతకాలమువ్యయము చేసినట్లు తమకుసహాయుడై దుష్టప్రారబ్ధమునైన తనకుగల స్థితిలోశాంతిచేసి సర్వసౌఖ్యములిడుటకు కొంతకాలము ధ్యానాదులచేయుటకు వ్యయముచేయదగినది. యీప్రపంచము భగవంతునిచే సృష్టింపబడి పరిపాలింపబడుచున్నది. ప్రస్తుతము తండ్రిచేసృష్టింపబడిన పిల్లలువస్తువులు రక్షింపబడుటలేదా – తండ్రిపిల్లలకన్న వస్తువులకన్న అధికుడుగదా అటులే భగవంతుడు యీప్రపంచమునకన్న అధికుడు. ధ్యానించినవారి పాపమును, అజ్ఞానమును హరింపజేయువాడు. అనగా అజ్ఞానదృష్టిచే ప్రపంచమువలె గనబడుచున్నది. అంతయు జ్ఞానదృష్టిచే భగవంతుడుగా కనబడు

చున్నది. అనగా యీప్రపంచమును తన్ను భగవంతుని రూపముగా జూచినవాని పాపములమాత్రమే హరించు వాడు, అగు భగవంతుని ధ్యానింపదగును. ఆభగవంతుడు సర్వత్ర ప్రపంచపాలకుడు. అందుగల సర్వజీవులను పాలించు వాడు. శాశ్వతుడు, శివుడు, అచ్యుతుడు, తెలిసికొనదగిన వారిలో అన తల్లి, దండ్రి, గురువు మొదలగువారందరి కంటె తెలిసికొనదగినముఖ్యుడు. ప్రపంచమునకు ఆధార భూతుడు. అతడే జ్యోతిరూపము. వేదాంతశాస్త్రముచే తెలియదగినవాడతడే. అతడే దుష్టులకు శత్రువు. యీ ప్రపంచమంతయు యెవనిచేచూడబడుచున్నదో ఎవడువిను చున్నాడో దాని లోపల బయట అంతట భగవంతుడు వ్యాపించియున్నాడు. అనగా అట్టిరీతిని భగవంతునిచూచుచు ధ్యానించుచు వానిపలుకులు వినగోరువాడేసుజ్ఞాని, దేవుడు, అనంతుడు, అవ్యయుడు, కవి అన సర్వమువర్ణించువాడు. సంసారసుఖోత్పత్తికి కారణభూతుడు. దాన అతనిని ఉపా సించి అతనికృప ఒకరాజుకృపసేవకుడుపొంది సుఖపడినట్లు పొంది సర్వసుఖములు పొందదగినది. మానవుడా! నీయందు. తామర మొగ్గతోసమమగునట్టిది, అధోముఖమగు హృదయ కమలముగలదు. అదికంఠమునకుక్రింద నాభికిపై భాగమున 12 అంగుళములకుచివర హృదయ కమలము గలదు. యీ బ్రహ్మాండాది సర్వాండములకు ఆధారమగువాడును, ప్రకా శపరంపరలకూడుకొన్నవాడు అగు బ్రహ్మమన భగవంతు

చున్నాడు. అధోముఖముగ వ్రేలాడు హృదయకమలము నాడులచే అంతట వ్యాపింపబడియున్నది. ఆహృదయము గగ్గరగ చిన్నరంధ్రముగలదు. దానినే సుషుమ్నానాడీనాళ మందురు. ఆరంధ్రమున యీజగమంతయు ప్రతిష్ఠింపబడి యున్నది.

ఆసుషుమ్నయందు అంతరేంద్రియములైక్యము చేసు కొన్న జీవునికి భగవంతుడు తెలియబడుచున్నాడు. ఆసు షుమ్నానాడీమధ్యమున గొప్పఅగ్నికలదు. అధికజ్వాలలతో అన్నివైపులకు ముఖములుగలది. అగ్నితనకుముందున్న ఆ హారమునుభుజించును. భుజించిన దానిని అన్నిఅవయవములకు విభాగించుచుండును. ఆఅగ్నియేఅజరుడు, కవి, ఆ అగ్నిజ్వా లలు క్రిందకుపైకి అంతటావ్యాపించియున్నవి. ఆఅగ్ని ఆపాద మస్తకాంతమువరకు వ్యాపించినదై దేహమును సంతాపము నిడుచున్నది. యిట్లువ్యాపించిన అగ్నిజ్వాలలమధ్య ఒక అగ్ని జ్వాల అణుతుల్యమై ఊర్ధ్వప్రసారముగలదై యున్నది. అది నల్లమబ్బులలోమధ్య మెరుపుతీగవలె ప్రకాశించునది.

"నీవారధాన్యముగింజ కొనముల్లువలె నుండునది" పచ్చనిబంగారుకాంతి గలది. అణుతుల్యమైనది. దానికొనకు దహరాకాశమునకు మధ్య పరమేశ్వరినిగూడిన భగవంతుడు గలడు. అతడే బ్రహ్మ, శివుడు, హరి, యింద్రుడు, అక్షరుడు, శ్రేష్ఠుడు. స్వరాట్టు అనిపేర్లుగలవాడు.

ధ్యానబిందూపనిషత్తులో అణుతుల్యజ్యోతీరూపుడు

జీవాత్మ అనిగలదు - తైత్తిరీయమున అణుతుల్యమైన బంగారు కాంతిగలవాడు, జీవుడనదగును. అతనికి ఊర్ధ్వమున భగవంతుడుగలడు. జీవుడున్న కమలము అధోముఖముగాన జీవుడును అధోముఖుడై యుండుటచే దేవుడుకన్పడక తనకు బంగారుకాంతి దర్శనమగుచుండుటచే ధనాదులందెక్కుడు ప్రియుడై భగవంతుని మరచి వాటినార్జించుచున్నాడు. దాన స్వల్పసుఖ పడుచున్నాడు. కపాలాసనమునను్న జీవుడు జ్ఞానిసహవాసమున జ్ఞానమార్గమువిని జపతపంబులు భగవంతునికై నిష్కామముగ చేయుచు కమలము ఊర్ధ్వముఖమగునట్లుగా భావించగా భావించగా జీవుడు సమదర్శనత్వమన దేవుడంతటా గనుపడుటగల్గును. అపుడు కమలము వికసించి ఊర్ధ్వముఖమైనదని తెలియదగును.

యీకాలమున ఊర్ధ్వముఖుడగుజీవునికి పైనున్న భగవంతుని తనయెదుట అంతటను తనయందున్నవానిగా చూచుచు "సోహం" భావమున జపతపంబులొనరించగా యిట్లు లోపల బైట జాగ్రదాద్యవస్థల చేయగా చేయగా రాజయోగజాతకులకు తక్కువకాలములోనూ, బలహీన జాతకులకు ఎక్కువకాలమునకు రాజర్షిత్వ, ఋషిత్వ, మహర్షిత్వ, బ్రహ్మర్షిత్వసిద్ధులుగల్గి క్రమముగా సాలోక్య సామీప్య, సారూప్య, సాయుజ్యపదవులిడుచున్నవని మా గురువును, అట్టిమహాత్ములున్న ఉపనిషదాగ్రంథములును చాటుచున్నవి.

మొదటసమదర్శనత్వసిద్ధి, జాగ్రతవస్థను, తర్వాత, స్వప్నావస్థను, తర్వాతసుషుప్తి, తురీయముల సిద్ధిచెందిన వాడు బ్రహ్మర్షిత్వమొందగలడు. వరుసతప్పినపూర్ణసిద్ధిగా దని తెలియునలెను. యింటిలో 3 గుమ్మములుదాటి నాలు గవగుమ్మముగది. యందున్న తండ్రిని బయటనున్న పుత్రుడు చూడగోరిన వరుసగా గుమ్మములు దాటి అతనిని జేరి అతనిలో యేకత్వము చెందిందు పరమమిత్రతబొందిన పుత్రుడాయింటి యజమానత్వము తండ్రికృపచేపొంది లోపలబైట స్వేచ్ఛగా తిరుగునట్లు వరుసగా జాగ్రదాద్యవస్థల సమదర్శనత్వసిద్ధి గాంచినవాడే బ్రహ్మర్షియై భగవంతునిసముడై సర్వత్ర నిత్యసుఖియగును. పూర్వర్షులవలె సర్వశక్తులలోనొన్నిశక్తు లైనగల్గిన మరల మరలచేసి తమతప్పుల దిద్దుకొని సర్వశక్తివంతుడు నిత్యానందుడు అగువరకు జపతపంబులు మానరాదు, యిట్లువిజయత్వము చెందినవాడు లౌకికులకై పూర్వమువలెనే నిష్కామముగా సత్కర్మాదులు భగవదర్పి తముగా జేసి కాలముగడుపుచు తుదను అంతట భగవంతుని జూచుచుగాని భగవంతునేకముచేసిన తన్నుచూచుచుగాని ప్రాణమువదలి బ్రహ్మత్వము చెందగలడు.

అధ్యాత్మరామాయణమున — వాల్మీకిరామాయణ మున అరణ్యకాండ:— భయముచే మారీచుడు రాముని జాగ్రత్ స్వప్నములందు అంతటను చూచినట్లుగలదు. తుద కితడు రామునిచూచుచు రామునివలె కేకలువేసి రామునిచే కొట్టబడి రాముని చేరెను.

అధ్యాత్మరామాయణము తెలుగుప్రింటు సంస్కృతము 60, 70 సంవత్సరములకిందటిది. విశ్వామిత్రకృతమని గలదు. నేడదివ్యాసకృతమని వావిళ్ళవారు ప్రింటుచేయుచున్నారు. గ్రంథకర్తలు మార్పుచెందునప్పుడు మరికొంత కాలమునకు చాలమార్పులు గ్రంథములలోరాగలవు. గాన యితర దేశమునగల అధ్యాత్మరామాయణమును దీనిసరిచేసి చూడదగును. వావిళ్ళవారిపుస్తకములు పూర్వపుప్రింటుకు యిప్పటిప్రింటికి అక్కరములు శబ్దములు కొన్నిచోట్ల మార్పులుగలవు. పాతభారతములు, నవీనభారతములుచూడుడు. మంచిపుస్తకములు మార్పుచెందిన సద్విద్యాధనార్జన చేయుట కష్టమగును. డబ్బుకొరకే ప్రింటుచేయరాదు. జగత్కళ్యాణముకోరియు తమకుధనమునష్టము లేకుండయు ఆలోచించియే ప్రింటుచేయదగును. మనదేశమున మొత్తమున వావిళ్ళవారినుండియే మంచిమంచిపుస్తకములు వెలువడి లోకకళ్యాణము చేయుచున్నవి. భారతదేశమున సంస్కృతమునగల సద్గ్రంథముల ఆంధ్రాక్షరములలో ఎక్కువగాప్రింటుచేయుశక్తి భగవంతుడా వావిళ్ళవారికిచ్చుగాక. మంచిపుస్తకములన్న నాకుబహుప్రీతియగుటచే నేను చేయలేకున్నను చేసెడివారినిచూచి సంతోషించుట మంచిదిగదా.

## జీవన్ముక్తి

ముక్తికోపనిషత్తు:—"పురుషస్య కర్తృత్వ, భోక్తృత్వ, సుఖదుఃఖాది లక్షణశ్చిత్తధర్మః క్లేశరూపత్వాత్ బంధోభవతి.

తన్నిరోధనం జీవన్ముక్తిః” జీవుడు నేనే కర్తను నేనే భోక్తను అని సుఖదుఃఖాదులపొందు చిత్తధర్మములో కష్టములుపడుటే బంధమునొందుట.

యిహాపర సుఖములు లేకుండాబోవుట అట్టిసుఖదుఃఖములిడు పుణ్యపాపములవిడిచి భగవంతుని చిత్తధ్యానము చేసెడు సుజ్ఞానిజీవించియుండగా జీవన్ముక్తుడు కాగలడు. లేనిచో ప్రారబ్ధక్షయానంతరము విదేహముక్తి చెందగలడు. జీవన్ముక్తి, విదేహముక్తులున్నవనుటకు అష్టోత్తరశతోపనిషదః ప్రమాణః :- “దుఃఖనివృత్తిద్వారా నిత్యానందవ్యాప్తి ప్రయోజనంభవతి” యీబ్రహ్మోపాసనచే, నిత్యానందము గల్గును. “తత్పురుషప్రయత్నో సాధ్యోభవతి” అదిశాస్త్రీయమగు పురుషప్రయత్నమువల్లసిద్ధించును

భగవద్గీత:- “ఈశ్వరస్సర్వభూతేభ్యో హృద్దేశేర్జున తిష్ఠతి” భగవంతుడు పరమేశ్వరినిగూడి హృదయమందున్నాడని శ్రీకృష్ణుడు నిర్ణయించెను. న్యాయసిద్ధాంతముక్తావళిః :- “మనోణురూపః” మనస్సు అణురూపమైనది. బంగారుకాంతిలో అణురూపుడగు భగవంతునంటిన, జీవుడు, భగవంతునిగామారి సర్వలోకకళ్యాణము చేయుచున్నాడు. జీవునితోపాటు మనస్సును, బద్ధలయి భగవంతునిపనులు చేయును.

7 రంగుల అణువులుగలవు - బంగారుఅణువు బద్దలయినచో భగవంతుడందు జేరుటగల్గును. దాన భగవంతుని

రూపమందరికి దర్శింపవీలగునని నాయభిప్రాయము. తక్కిన ఆయురంగుల అణువులలో ప్రకృతిస్వరూపిణిశక్తి విశాలము గను దేవునిశక్తిమరుగుపడి, నశింపజేయు గొప్పకాంతి మాత్రముండును. దాన ఉపకారమును చేసికొనవచ్చును గాని పరమేశ్వరీ పరమేశ్వరరూపుడగు భగవంతునిరూపము కనపడదు.

ప్రస్తుతము అమెరికావారి ఆటం నారింజరంగు గల దని చెప్పుదురు. అదిబ్రద్ధలయిన దేవుడుగానరాక జగన్నాశ ముచేయగలదు. శాంతిమార్గముల ఉపకారముల చేయ గలరు.

గీత:- "మమమాయాదురత్యయా" నాభార్యయగు మాయాదేవియొక్క శక్తినాకుతప్ప యెవరికి దాటశక్యము గానిది. పరమేశ్వరి, భగవంతుడు, కోటిసూర్యప్రకాశములు గలవారుగాన యీజగన్నాశనకరమగు పరమేశ్వరియొక్క కాంతిశక్తి సూర్యాదులకాంతికన్న మిన్నకాంతిగానున్నది. భగవంతునిదయగలవారికే యీప్రకృతిశక్తి సర్వసౌఖ్యములనిచ్చుచున్నది. లేనిచో స్వపరములేక సర్వమునునాశనముచేయుచున్నది. మొదట శత్రుదేశమునాశనమైనను సౌఖ్యము చెందనీయక యీఆటం సృష్టించువారిలో కొంతకాలమునకు వివాదములుగల్గి సుందోపసుందులవలె యీఆటం సృష్టికర్తలను ఆదేశస్థులనందరిని నసింపజేయును. గాన మొదటనే భగవంతునిజేరి దర్శనమిడదగు బంగారురంగు

"ఆటం" బ్రద్దలుచేయ పరమేశ్వరీ పరమేశ్వర దయగల వారై ప్రత్యేక దుష్టసంహారకులు ప్రత్యేక సాధురక్షకులు అయి సర్వపాపవిముక్తులగుదురు. భారతీయులు ఆటం బ్రద్దలుచేయు మార్గాలు నాలా కాలముక్రింద నేకనుగొని నాశనకరమగు వాటిని వదిలి లోకకళ్యాణకరమగు "ఆటం" మనస్సు, జీవుడని, వీటికి భగవంతు నంటచేయదగు. సాత్వికతపస్సు చేసిన జీవుడు భగవంతునిగామారి అతనివలన లోకకళ్యాణ మగుటనగా బ్రహ్మర్షులవలన లోకకళ్యాణమగుట దుష్టనాశన మగుటగాంచి ఆమార్గాన నడువసాగిరి. సాత్వికతపస్సు చేయగా చేయగా కొంతకాలమునకు మానవుడు బ్రహ్మర్షికా గలడని నేటికిని భారతీయులలో అనేకులకు నమ్మకము గలదు.

పాశ్చాత్యులచూచి జపతపంబులుమాని వారివలె చాలమంది నడువసాగిరి. మరల వీటి మహిమాదులువిన్న హిందువులు సాత్వికులగుట త్వరలోతిరిగి ఆచరణచేసి నేడును బ్రహ్మర్షులై అనగా ఆటంబాంబులను మానవులై దుష్టఆటం బాంబుశక్తిని నశింపజేయగలరు. దుష్టవ్యతిరేకులై సాధు రక్షణ చేయగలరు.

మైత్రేయోపనిషత్తు :— "తపసా ప్రాప్యతే సత్వం సత్వాత్ సంప్రాప్యతేమనః । మనసా ప్రాప్యతేహ్యాత్మా" తపస్సుచే సాత్వికగుణవృద్ధియు దాన సాత్వికమనస్సగుటయు, ఆమనస్సుచే భగవంతుని ధ్యానించిన భగవద్దర్శనమగును.

తపస్సున మనోణువుబద్ధులయ్యి భగవత్కాంతి దర్శనము, జీవాణువు బద్ధులయ్యి భగవంతుడగుటయు గల్గును. అమెరికావారి ఆటంబాంబు, హైడ్రోజన్ బాంబులు సాధుజీవుల, దుష్టజీవులతో పాటు నశింపజేసి ఆ దేశస్థుల మహాపాపయుక్తుల చేసి తొందరగలో అమెరికావారిని నశింపజేయుగలవు. మానవుని జీవాణువుబద్ధులై భగవంతునిగా మార్పుచెందిన సాధురక్షణచేయుటకువీలై దుష్టులమాత్రము నశింపచేయగలదు. గాన భూలోకమానవులు బ్రహ్మర్షులగుటకు ప్రయత్నించి సిద్ధిపొందుదురుగాక. దీన సాధుజీవులకు, తమకుసౌఖ్యముగలుగునుగదా. పూర్ణిదుష్టులు నష్టమందుట జగత్కళ్యాణముగదా.

తపస్సు:- ధర్మనోపనిషత్తు - "వేదోక్తేన ప్రకారేణ కృచ్ఛ్రచాంద్రాయిణాదభిః । శరీరశోషణం యత్త త్తపయిత్యుచ్యతేబుధైః" వేదప్రకారము భగవంతునికై కృచ్ఛ్రచాంద్రాయణాదులచే శరీరమును శోషింపచేయుట తపస్సు. యిదిమాని జైలులో తిండిసౌఖ్యమునకుకొందరు, తమకుగల్గిన సామాన్యకోర్కెలు నెరవేరుటకు కొందరు రాష్ట్రములో ధర్మమైననూ అధర్మమైనను తమకోర్కెలు నెరవేరగా షస్తులుచేసి శరీరమెండించుచున్నారు. దాన కొందరు కోర్కెలు నెరవేరుచున్నవి. కొందరికి నెరవేరుట లేదు. యిట్టివి అసుర (రాక్షస) తపస్సులోచేయును. యీ స్థితిమాని భగవంతునిదయకొరకే తపస్సుచేయుటమంచిది. శరీరమును

పోగొట్టరాదు. అదియున్నగాని ధర్మసాధనముగాదు. ప్రాణ ముపోవువ్రతములు చేయరాదు. ప్రాణమునుండి దుష్ప్రవృత్తులుపోవగా శరీరమెండించుట శాస్త్రోక్తముగా చేసినతపస్సు ఫలించును. అవిపోయినచో శరీరమున సద్బలముచేరుచున్నది. సద్బలమున్నగాని జపాదిసత్కర్మములు చేయలేడు. నిష్కామ జపాది సత్కర్మములు చేసినగాని బ్రహ్మాత్వసిద్ధిగల్గదు.

డీటా - "శ్లో వామోక్షం కథం తేనా సంసారప్రతిపన్న వాన్, యిత్యాలోచన సమర్థజ్ఞాస్తపః, శంసతిపండితాః" యెట్లు సంసారమునుండి మోక్షముపొందుటనగా భగవంతుని చెందుటోయని ఆలోచించి ఆమార్గార్థముగోని దానిపై నడచుట పండితులుకొనియాడుతపస్సు యిది పరమోత్తమ మార్గము. — భారతం - మోక్షధర్మములలో, "మనసస్సేం ద్రియాణాంచ హ్యైకాగ్రం పరమంతపః" భగవంతుని, యింద్రియములతోగూడిన మనస్సుచే, యితరకామములేక ధ్యానించుట శ్రేష్ఠమయిన తపస్సు. — తైత్తిరీయము, నారా యణప్రశ్న:— "ఋతంతపః సత్యంతపః శృతంతపః శాంతం తపః దమస్తపః శమస్తపః దానంతపః యజ్ఞంతపః భూర్భువస్సు వర్బ్రహ్మైతదుపాస్తైతత్తపః" ఋతమన మనస్సుచేయథార్థ వస్తుచింతనముచేయుట - సత్యమన వాక్కుచే యథార్థము బల్కుట శృతమన సత్కార్యమువిని ఆచరించుట, శాంతమన కార్మికులు ధనముపంచుకొనుటలో కలహాదులు లేకుండుట రైతులు వ్యవసాయమున నీళ్ళుమొదలగువానివద్ద తగవులు

లేకుండుట శాంతి. వర్తకులు వ్యాపారముల మోసము చెంది కలహములుపడకుండుట శాంతి. రాజు యితర దేశములతో కలహములుగల్గువేళ సామవాక్యములతోగాని దానవాక్యములతోగాని కలహనివారణచేయుట శాంతి.

వేదబ్రాహ్మణుడు తన వేదమార్గముగొప్పదని రెండవ వాని వేదమార్గము తక్కువదని కలహములాడకుండుట శాంతి. దాన కొన్నిసమయముల యిట్టికలహములు తగ్గుచుండును. ఒకపుడు పై వారును ఒకరుచెప్పినట్లు వినకుండుటయు రాజులు సామదానములుచే కుదరకున్ననూ నాశనముచెందెదరు. దానిని ఒకరు వాదించలేరు.

ఉదా॥ భారతము.:- "ధర్మరాజు దుర్యోధనులు" ధర్మరాజు సామముతో చెప్పిననూ రాజ్యమువదిలి భోజనమునకుతగినట్లు చేయమనినను కుదరలేదు. యిట్టిచోట రాజులు సామదానములచే వుపయోగపడలేదు. తరువాత భేదదండోపాయములచే గొప్పయుద్ధమై అనేకులునశించిరి. గాన రాజులశాంతికాలము కొంతవరకే వుపయోగముచేయగలదు. పూర్ణశాంతి చేయలేదు. వేదబ్రాహ్మణుడును, పూర్ణశాంతిచెందలేడు. గాని వేదాంతబ్రాహ్మణుడు అన భగవంతుని కర్మజ్ఞానేంద్రియములతోగూడి యితరకామము విడిచి నిష్కామధ్యానము చేయుటచేగల్గినది. పూర్ణశాంతి. యీశాంతిగలవారు పైకార్మికులు, రైతు, వర్తకరాజు, వేదబ్రాహ్మణులైనచో మొదటనే తగవులాడుకొనుట మాని

సత్యమగు శాంతియేగ్నడి పదులలో మిత్రభావమున చరిం తురు. గాన యీశాంతి భూలోకమున ప్రతిమానవుకు సంపాదించుటే పరమోత్తమ తపస్సు చెందుటగాన శాంతి వృత్తము తపస్సనబడును.

డిటో — "మేధయామనీషా మనీపయాయనః మనసా శాంతి" మనోజయమున గొప్పశాంతి కల్గును అని గలదు. "శమదమములన" అంతర్బాహ్యేంద్రియముల జయించి అనగా జితేంద్రియుడై శత్రువులందును క్రోధములేకుండుట. "దానమన" ప్రత్యుపకారము కోరక భగవంతునిగాచూచి భగవంతుని ప్రీతికై నీటితోయిచ్చు ధనాదులు. యజ్ఞమన దేనితో భగవంతుడు తెలియ బడునో అదియజ్ఞము.

ఉ॥జపయజ్ఞాదులు, భూలోక అంతరిక్షఆకాశములనంత టను భగవంతునిగాచూచుచు భగవంతుని ప్రేమతో నిష్కామ ధ్యానము చేయుట తపస్సు. భగవధ్యానములేనివానికి సత్యా దులున్ననూ సమయమువచ్చినపుడు అసత్యాదులలో పడక తప్పదుగాన, సత్యాదులవలన యితనికి కొద్దిలాభమేగాని పూర్ణలాభముండదు. మేధగల్గిన ఋషిత్వసిద్ధి, మనీషగల్గిన మహర్షిత్వముగల్గుకాలము. వీరికి మనస్సుమంచిదగును. యీ స్థితిలోమానవుడు ధనవంతుడయ్యు, ఉన్నధనముపోయి దరి ద్రుడయినా, ధనాదులసంపాదించి పూర్ణముగా పరులకు దానముచేసి మరల తేనెటీగవలె సంపాదించగలడు. యిట్టి

మనోశక్తి యేర్పడిననాడు ప్రతిమనుష్యునకు సత్యమగుశాంతి యేర్పడి లోకకళ్యాణముచేయగల్గును. లేనిచో యితరులు కొట్టెదరనిగాని, ధూషింతురనిగాని డాంబికశాంతి, అహింసలుగలవాడు, తనకుపరులనుండి అపకారము సామాన్యముగాజరుగకుండుట గలుగునుగాని జరిగినచో యేమియు చేయలేక దుఃఖముల అవమానమునొందును. గాని డాంబిక శాంతిఫలముఅనగా ఋషిత్వసిద్ధిపొందలేడు.

"శృతంతపః" అనగా సాధువులగు మహాత్ములదరిజేరి సత్యము నేవినుచు, మనస్సులో సత్యనిర్ణయము చేయు వాక్కుతో సత్యముబల్కుచు కర్మేంద్రియ జ్ఞానేంద్రియములతో పరాపకారముమాని వుపకారము చేయుచు, శాంతుడై తానుసంపాదించినదిమంచివానికి దానముచేయుచు తే నెటీగవలెసంపాదించుచు దాన భార్య పిల్లలు తాను జీవించుచు భార్యకు పిల్లలకు భగవంతునిచేరు మార్గములు బోధించుచు సర్వమును భగవంతునిగచూచుచు కార్మిక, రైతు, వర్తక, రాజసేవక, మంత్రి, అధ్యక్షు, రాజ, వేదబ్రాహ్మణాదివృత్తులలో నొకదానినిగానిగాని వానప్రస్థయత్యాశ్రమలేక కుటీచక, బహూదక, హంస, పరమహంస, అవధూతాదివృత్తులతో సమతుల్యమార్గమున నడుచు గృహస్థుడు నిత్యానందమునొందుచు కాలముగడపువాడు, సత్యమగు శాంతిఫలము చెంది శాంతుడనబడును. యిదివిడిచినశాంతి స్వల్పఫలముగలది.

వేదములలో ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః అనికలదు. అనగా ఆధ్యాత్మిక, అధిదైవిక, అధిభౌతికములనుండి యెట్టి అపకారములు గలుగకుండుటకై శాంతి చెప్పబడినది. యీ స్థితిగలవాడుగాన "అత్రి" అని చెప్పబడెనని అధర్వ వేదమున గలదు. యీ "అత్రి" బ్రహ్మర్షిగాన యితని యందు శాంతి పూర్ణఫలమిచ్చినది. సత్యాదులీ తపస్సని దాని ఆచరించిన ఫలముపొందినవాడుగదా సంతోషించుట. సత్యము, అహింస అనిన అర్థము తెలియనివాడేమి ఆచరించ గలడు? ఆచరించిన ఏమిఫలము చెందగలడు? తపస్సన అర్థము తెలిసినతరువాత లోకవిషయములలోబడి ములిగి తేలి విసిగినవాడైన మానవుడు పట్టుబట్టిన తపస్సు చేయగలడు. లోకవిషయముల ఆధిక్యత తపస్సునగల గొప్పతనము అప్పుడు తెలియును. తపస్సు చేయుటకు యితరులనుండి దెచ్చుకొనవలసినవి లేవు. తనయందే అందుకుకావలసిన సర్వము గలవు. గాన మానవుడు గృహస్థుడైన రాజసేవక, కృషి, వర్తకాదివృత్తులలో నున్నవాడైన, ఆదేశాధ్యక్షుడుగాని, మంత్రియైయున్నవాడుగాని యీతపస్సు నాశ్రయించిన మొదట తానుబాగుపడి తరువాత తనభార్యపిల్లలను బాగు చేసుకొనుచు ఆశ్రమముల ఆవృత్తుల ధర్మమార్గము నడిపించుచు యితరప్రజలకు ధర్మము తెలుపుటచే వారును సర్వసౌఖ్యములగాంతురు. భూలోకప్రజలందరు రెండేపక్షములు, సాధుపక్షము, అసాధుపక్షము. సాధుపక్షస్థులు

నిష్కామతపస్సు, సకామతపస్సు. అసాధుపక్షస్థులు ఆసురీ తపస్సుచేయుదురు. దీని యెక్కువలాభము గలుగక సామాన్యసుఖముగల్గును. సకామతపస్సున కర్తకుసాత్విక కామసిద్ధిగల్గును. ఆసురీతపస్సుకన్న యెక్కువసౌఖ్యము సకామ తపస్సున కర్తకుగల్గును. సాత్వికకామసిద్ధిగల్గును. నిష్కామతపస్సున సర్వసౌఖ్యములు, నిత్యానందము తుదకు బ్రహ్మర్షిత్వసిద్ధిగల్గును.

"ప్రాయశ్చిత్తము"

మనుస్మృతి-11అధ్యాయం – "ప్రాయోనామ, తపః ప్రోక్తంచిత్తం నిశ్చయఉచ్యతే। తపోనిశ్చయసంయుక్తం, ప్రాయశ్చిత్త మతిస్మృతం" చిత్తమందు నిష్కామభగవ ధ్యానమున వేడిమిగలిగించుటయే ప్రాయశ్చిత్తము. దీన ధనపుత్రాదివృద్ధిచే వారికేమిభాధగల్గునో అనిలోన బాధించు పుణ్యరూపబంధమును, ధనాదిసౌఖ్యములేక లోనబయట నానాకష్టములగల్గించు పాపరూపబంధమును యీప్రాయిశ్చిత్తముచే వదలబడి మానవుడు దేవత్వము చెందగలడు. మరియు నానావిధదోషములకు ప్రాయిశ్చిత్తము గలదు. అటులాచరించిన ఆయాదోషహరమగును. వేదాంతబ్రాహ్మణునికి జ్ఞానమే అనగా భగవంతుని అంతట అనగా భూమ్యంతరిక్షాకాశములనంతటను చూచుటే తపస్సు.

డిటో:– "ఔషధాన్యగదో విద్యాదైవీచవివిధాస్థితిః।

తపసైవప్రసిద్ధ్యంతి తపస్త్రేషాంహిసాధనం" రోగహరౌష ధములు రోగములేకుండుట. బ్రహ్మావిద్యాప్రాప్తి, దైవీ స బంధసర్వమును తపస్సువల్లగల్గును. గాన మానవుడు ఔన్నత్యము చెందుటకు తపస్సొక సాధనము.

డిటో- "మనుః" "యద్దుస్తరం యద్దురాపం, దుర్గం, యచ్చదుష్కరం, సర్వంతు తపసాసాధ్యం, తపో హిదు రతిక్రిమం" ఏదినవ్యగహాదిదోషములచే దాటరానిదో ఏదిపొందవీలుకానిదో ఏదిచరించుటకు ఎక్కువకష్టమైనదో అది అంతయు తపస్సుచే సాధింపవీలగును. గాన తపస్సు సర్వసాధ్యశక్తిగలదని భావము. అనగా దాటరాని ప్రారబ్ధ కర్మఫలముల్నైన తప్పించుకొనుటకుగాని, మానవుడుపొందు టకువీలుగాని భగవచ్ఛక్తి సంపాదించుటకుగాని, ప్రపంచ మునకష్టసుఖ మిశ్రఫలములిడు అజ్ఞానదృష్టివిడిచి, నిత్యమును సర్వదేహధారులను, సర్వమును దేవునిగా చూచువారితో గూడి సంతోషముతోచరించు సుజ్ఞానశక్తి సంపాదించుట గాని, తపస్సేసాధనమైయున్నది. అనగా తపస్సే సాధ్య మగును. గాని భౌతికవాదుల వాదములచేగాని శుష్కవే దాంతవాక్యములగాని సాధ్యపడదు. ఓ మనుష్యుడా! నీవు యీలోకానికివచ్చినది ఆటంబాంబులతో సాధువుల అసా ధువుల విచారణలేకయే అనగా నీకు విరోధులుగానివారిని జంపి రాష్ట్రము లేలుటకా?

(దుష్టులు, శత్రువులు అగువారినిచంపుట రాజధర్మము

అగుట భారతీయయుద్ధములు ప్రత్యేకముగ అట్టిపక్షములు రెండు ఒకచోటనిల్చి గెల్పుఓటములు పొందెడివారు. దాన మిగిలినప్రజలకేమి బాధకరముగాకుండెడిది. నేటి పాశ్చాత్య యుద్ధములు, ప్రజలను, సైనికుల, అధ్యక్షుల, పట్టణగ్రామా దులను నాశనముచేయుచున్నారు. రాజ్యమునకు రాజుండ రాదని, ప్రజారాజ్యములు స్థాపించిరి. మొదటిదానికన్న రెండవదానితో జగన్నాశనమగునాఅను భయయుద్ధములు జరుగనున్నట్లున్నది. యీప్రజారాజ్యములతోను సుఖమేమి గలదు. తమకు విరోధమగు దుష్టరాజకీయపక్షమును శిక్షిం చుట ధర్మముగాని రాజ్యములోనుండు సాధుప్రజల నశింప జేయుట ధర్మమా! ధర్మాధర్మమెరుంగని పాశ్చాత్యమార్గ ముల వారివిద్యల భారతీయులు వృద్ధిచేసిరి. వృద్ధిచేయు చున్నారు. ఆమార్గాలమంచిమార్గములుగొనుచు మన దేశ శాస్త్రవిద్యల బ్రహ్మవిద్యను, సత్యాహింస తపోదమశమాది ధర్మముల ఫలమిడువరకు ఆచరించినగాని, భారతీయులు బ్రహ్మర్షులకాలమునాటి ఔన్నత్యముపొందలేరు. గాన పశ్చిమ దేశపు మంచిమార్గముల, మన దేశపు మంచిమార్గముల ఆచరించి మన దేశపు ఔన్నత్యము భారతీయులులోకమునకు చాటి లోకకళ్యాణముచేయుదురుగాక! సత్యాహింసాదులు మంచివని నొక్కిచెప్పినంత నెట్టిలాభముండదు. స్వల్పలాభ మున్నను ఎక్కువయుపయోగము కాదు. కృషి, గోరక్షణా దులచే కోట్లార్జించుటకా, సేవకవృత్తినుండుటకా, భిక్షుకు

డగుటకా కాదు. యివి అన్నియు నీకుభుక్తిమార్గమిచ్చును. ధనాదులున్నవని తృప్తిజెందుమటె, దానినంతయు నొకసారి భక్షించలేవు. గాన అట్టిభుక్తినొందుచు, దరిద్రుడవైన, ధనాదులనిల్వచేయగల్గవని తృప్తిచెంది భుక్తిమాత్రము సంపాదించుచు నిష్కాముడవై, భగవధ్యానముచేయుచు, సర్వమున్ప్రేమతో భగవంతునిగాచూచుచు రాష్ట్రమేలుట మొదలగు వృత్తులలో నొకటిగగొనిగాని అన్న, ఫల, జల, వాయుభక్షణల నొకటిగొనిగాని జీవించుచూ సత్యాహింసాదులపొంది పరోపకారమున మెలగుచున్న బ్రహ్మర్షివిగాగాని భగవంతుని కృపగలవాడవుగాగాని అగుదువు. అందులకు మానవ స్త్రీ పురుషరూపములుగా మీరువచ్చితిరనే నాయభిప్రాయము. దేవుడున్నాడా? లేడాఅని సందేహములుచేయుచుగాని పైసత్యాదులాచరింపకయున్నగాని కొంతకాలమునకీ లోకమునుండి మారిపోదువు. అది నీకు తెలియనిసంగతిగాదు. జీవించుకాలముననే రాజర్షి, ఋషి, మహర్షి, బ్రహ్మర్షిత్వసిద్ధికై పాటుపడుము దాన సౌఖ్యశాంతియేర్పడును. భగవంతుని అన్నివస్తువులచూచుట వేర్వేమన్న అది పురాతనమన్నను, నవీనమన్నను ఒకటే ధర్మమార్గము, అది రెండుగామారదు. అన్నియుగముల సత్య అహింసాది ధర్మములు (బహ్మజ్ఞానమునకే ధర్మమార్గమునయున్నదిగాని మార్పుచెందదు.) అసత్యాదులెప్పుడూ దుష్టఫలములనే యిచ్చును. కృతయుగాదులవారు కష్టపడి సత్యాదులఫలము

చాలకాలమునకు చేర్చగల్గిరి. గాని కలియుగస్థులు ఆమార్గమునసడిచి తొందరలోనే ఆఫలము జెందగలరు. యింతే భేదము. మొదట ఆటంబాంబుకనిపెట్టినవానికి యెక్కువ కాలముబట్టెను. తరువాతవారు తొంతరగాచేయుచుండిగ చా. ప్రస్తుత ప్రజారాజ్యమువారు అమెరికావారికన్న ధనవంత ముగా చేయలేరు. చేసిననూ అమెరికావారు విషయ భోగము లెక్కువ పొందుచు తమ శతృవులచూచి భయ ముతో జీవించుచున్నారేగాని నిర్భయముగాలేరు. వారు వృద్ధిచేయునది సాత్వికాహారముగాదు. న్యాయార్జితధనము గాదు. గాన మనిషి పందిపెంటలతో దుష్టజలముతో వృద్ధి యగు ఆహారమువృద్ధిచేయక గోమలాదులతో పరిశుద్ధ జలముతో వృద్ధియగు సాత్వికాహారము వృద్ధిచేసిన దానిని భక్షించినజనులకు ఆ అన్నమున ప్రాణమయము అనగా ప్రాణవాయువు వృద్ధియై దాన మనోమయమున సాత్విక మనస్సుగలిగి దాన విజ్ఞానమయమున అనుభవముగా సత్యే ఫలముచెంది దాన ఆనందమయమున నిత్యానందమున మానవుడు పొందగలడు. యిదిసాత్వికాహారమునగల్గు లాభ ము. అమెరికాహారము ప్రజలకిట్టిసుఖమిడుటలేదు. అది మిశ్రమాహారమైనది. "వర్షమమృతం" అని అధర్వణ వేదము. గాన యజ్ఞములచే వర్షమెపుడుగావలెనన్న అపుడు కురియుమార్గములు వేదములందుగలవు. భారతదేశమునం దింకనూ వేదపండితులున్నారు. వారికి ప్రోత్సాహమిచ్చి

దీనిసత్యము తెలిసికొనుట మంచిది. ప్రాజెక్టులకు కోట్లు వ్యయపరచువారు దీని సత్యము తెలియుటకు వకకోటివ్యయ పరచిన తెలియగలదు. ఆమార్గములు తిరిగి కనుగొనిన శ్రేష్ఠమగు సాత్వికాహారము లభించుననుట కేసంశయమును డదు. పాతాళగంగపంటయున్ను శ్రేష్ఠమే. గంగానదిపంటయు శ్రేష్ఠమే. మిగిలిన నదీనీరముల పరిశుద్ధిచేసిననీరములతో చెడ యెరువులనిడక మంచియెరువులతో పండించుట శ్రేష్ఠము. లేనిచో మిశ్రమాహారమగును. దీనరజోగుణవృద్ధియగు. యిట్టి మిశ్రమాహారాదులను భగవంతునిచిత్తధ్యానము ప్రతిదినము చేయువారైన దానదోషమునశించి శ్రేష్ఠాహారముతిన్న ఫల మునొందును. అనగా పూర్వకాలవర్షోదక ఫలాన్నముతిన్న సాత్వికజనులలో సమసాత్వికగుణవృద్ధిగలవారగుదురు. దీన సత్యాహింసాది ధర్మఫలముల కనుగొనగల శక్తివంతులగు దురు. లేనిచో అనగా సాత్వికాహారవృద్ధిలేని దేశజులు దైవ ధ్యానములేనిదేశజులు యిహపరసుఖముల చెందలేక మిశ్రమ వ్యాధులతోజీవింతురు. భూలోకములో యేదేశమునదుష్టా హారవృద్ధియగునో వారు రజోగుణ,తమోగుణ వృద్ధిచెంది వ్యభి చారాదివిషయములలో విషయలోలురై చెడుదురేగాని సౌఖ్యముజెందరు.

భగవధ్యానములేక దుష్టాహారవృద్ధిలోయున్న దుష్టు లు మరింతదుష్టులై జగదపకారముచేతురు. గాన పేదవారు ధనవంతులు సాత్వికాహారముతినిన సాత్వికులై మిత్రులై

చరింతురు. లేనిచో నావల్లనే నీకు ధనము వృద్ధియైనదని పేద వారును, నావల్ల మీకు కూడుదొరకుచున్నదని ధనవంతులు కలహములుపడి నాశనమగుదురు. భూలోకములో ధనవంతుడొకడు, దరిద్రుడొకడని మానవులు నిర్ణయింపబడలేదు. కొంతకాలము దరిద్రముగానుండుట కొంతకాలము ధనముగా నుండుట లేక యెప్పుడూధనముతో లేక యెప్పుడూ దరిద్రముతో యుంపటగలదు. అది పుట్టుకలోనేయున్నది. వేరుగాదుగాన పుట్టుకలోయున్న ముండ్లచెట్లు తులసిచెట్లగుట కష్టము. గాన యీమార్పుకై కాలముగడుపక, లేనివారు పాండవులు, రామలక్ష్మణులు ద్రౌపదీ సీతలు, అరణ్యమున ఫల జల వాయు భక్షణాలతో దైవధ్యానపరులై కాలము గడిపినట్లు గడుపదగును.

ఉన్నవారు రాజ్యమేలుచూ తృప్తిగా సాత్వికాహార మునుతిని ధర్మరాజాదులవలె దైవధ్యానము చేయుచు బ్రహ్మర్షిత్వసిద్ధి చెందుటకై పాటుబడుట పరమోత్తమ ధర్మము. ధనాదులు, దరిద్రము, కాలమునుబట్టి వచ్చునవి పోవునవి మానవుడటులేయుండును. గాన ధనవంతులు, పేదవారుగదా! లోకములోయుంపట. వీరు సాత్వికాహారముదినుచూ దైవజ్ఞానపరులైన మిత్రులుగా చరించుచు లోకోపకారులై బ్రహ్మర్షిత్వము చెందగలరు. ఇదే సాత్విక తపస్సు దీన తప్పక బ్రహ్మర్షిత్వము చెందగలరు. సాత్వికాహారముతిని రామాయణములో "వశిష్ఠోజపతాంవరం"

వశిష్ఠుడు జపయజ్ఞముచేయువారిలో శ్రేష్ఠుడు. అనగా ప్రతి దినము జపయజ్ఞముచేయువాడు. దీన సాత్వికుడై కొంత కాలమునకు బ్రహ్మర్షి అయ్యెను. భార్యను విడువలేదు. సన్యాసిగాలేదు. గృహస్థాశ్రమి తాను తన భార్యగూడా సాత్వికాహారముతిని జపయజ్ఞముచేయునది. దాన యిరువురూ సాత్వికులై స్నేహమునచరింతురు. ప్రతిగృహియిట్లు చేసిన భార్యాభర్తలు సుఖపడుదురు. పేదవారు, ధనవంతులు సాత్వికాహారముదిని దేవునిధ్యానించువారైన మిత్రులయి వకరికొకరు తమకుతగిన మహోపకారములు చేసికొనుచు జీవింతురు. యిద్దరుస్నేహితులూ అట్టివారైన కలహముతెన్నడూనూబడరు. అట్టివారు రాజు రాజసేవకులు. ప్రజలయిన్ని వకరికొకరు మిత్రులై దుష్టపక్షములులేక సుఖింతురు. గాన భూలోకరాజ్యపాలకులు ప్రజలగు గృహస్థులు, సాత్వికాన్నముతిని దైవధ్యానపరులైయున్న లేక మిశ్రమాహారము తిన్ననూ దేవునిచిత్తధ్యానము చేయువారయ్యిన్ని, రాజపాలకులు రాజసేవకులు ప్రజలు మిత్రులై దుష్టపక్షములేకస్వర్గసమసుఖ మనుభవింతురు. కలిలోమాత్రము దీర్ఘకాల బ్రహ్మచర్యము, సన్యాసత్వముగూడదని, పరాశర్షి వాక్యము గాన కలిలో గృహాశ్రమమునుండియే అన్ని ఆశ్రమముల ఫలములు సంపాదించవచ్చును. భగవంతుని అంతటాచూచినట్లు భాగవత, రామాయణ, భారతాదిగ్రంధములగలదు. కలియుగాన నేడెవరైనచూచినారాయన్న అరవిందఘోషు

అంతటను శ్రీకృష్ణునిచూచినట్లు అతనిచరిత్రలోనూ, రామదాసు అంతటను రామునిచూచినట్లు అతనిచరిత్రలోనూ గలదు. తరువాయిత కొంతకాలమునకు విడువరానిజైళ్ళనుండి వీరిద్దరూ భగవంతునిదయచే విడువబడిరి. తరువాత తమ మార్గముచాలమంచిదని చాలమందికిబోధించి విశేష కీర్తిసంపాదించిరి. దుష్టుడొకడు పూర్వపుణ్యముచే యిట్లు జైళ్ళనుండి విడుదలయైననూ పూరుపేరుండదు. వానినుంచి నేర్వవలసినది గొప్పమార్గములేమి యుండవు. పైవారిద్దరూ తమను పాలించురాజుల పరసహాయములేక దేవుని సహాయముతో గజగజలాడించిరి. యింతకన్న ఆధిక్యమేమి కావలయును. నిష్కామములకు, దుష్కామములకు భేదమింత కలదు. ప్రతిదానిని భగవంతునిగ చూచుటలో సిద్ధుడగుటచే వివేకానందులకు అమెరికాలో యెక్కువ సఖ్యత ఏర్పడి అక్కడ మనదేశమున పెద్దపేరుపొందినాడు.

భగవంతుని పూజించుటకు సంఘముగూడదు. దానివిదలునేర్చుకొని ఎవరికివారే ఆచరించుకొనుటేగాని రెండవ వారుండరాదు. నిష్కామతపస్వి వందలాదియెకరముల గోరిగాని కోట్లధనమార్జింపగోరిగాని రాజ్యమేలగాని కోరడు. రాజ్యముమొదలు ఎకరాలవరకు యెంతయెక్కువ తక్కువగానున్ననూ భుక్తికి, పరోపకారమునకే, వుపయోగమనియెంచి అటులు సాత్వికముగా తనకుగల్గిన దానిని ఆచరించుచు సర్వశక్తివంతుడు, సర్వలోకపాలకుడగు భగవత్సమా[illegible]

భగవంతుని దయగలవాఁడో భగవంతుఁడగు బ్రహ్మర్షియో అగుటకుసంకల్పించి నిష్కాముఁడై దుష్కామవర్జితుఁడై సర్వశక్తివంతుఁడు సర్వపాలకశక్తి తనకుగల్గువరకు, విశ్వామిత్రుఁనివలె విడువక ఆచరించుచే భగవంతునిపూజాఫలము చెందుట. యిట్టిసత్కామనిష్కామములు రాజసేవక వర్తకవ్యవసాయాది వృత్తులలోయున్న తామేలుభాగములను, వర్తకాదివ్యాపారములు దుర్మార్గమున ప్రజలుజరుగనీయక లంచగొండితనము మొదలుగా దుష్టవృత్తులువాల్పడక రాజువలన తమకుగల్గు జీతములతోనూ న్యాయముగా తనకువర్తక వ్యవసాయాదులవలనగల్గు లాభములతోడను జీవించుచు తామున్నస్థానమున సంపూర్ణధర్మమును స్థాపించిన వరులు తాము సుఖపడుదురు. యిట్లు అధ్యక్షులు, మంత్రులైన ఆరాజ్యప్రజలు దుష్టపక్షవృద్ధిగాక సుఖింతురు. అంతేగాని పాశ్చాత్యమతము యిజములనుండి యెట్టిలాభముగలుగక కొందరికిసుఖము, కొందరికినష్టముగల్గుచు తుదకు మొత్తమునకు నాశనమేర్పడగలదు. వేదాంతసారమగు లోకైకమతము ఆచరించి సౌఖ్యముచెందుడు. నాచేరచింపబడిన పంచమహాపాతక నిషేధమనుగ్రంథము ॥గీ॥ షట్కర్మయుక్తాగ్రజన్ముఁడైనను సమస్తోర్వీశుఁడౌ క్షత్రియుండెయైన, గోరక్షణాదులన్గూడుకోమటియైన, శుభసేవగావించు శూద్రుఁడైన, చరణరక్షలనమ్ము చర్మకారుండైన, భూరిస్వధర్మియై బోయయైన వెదురుచాపలనమ్మి బ్రతుకుమేదరియైన, రహింబట్ట

లుదిగెడి రజకుడైన ॥గీ॥ నేమిమనుజుఁడు మానవావల్లత్తకుల కాంక్షవిడిచి స్వకర్మముల్ గాంచుచుండె వాటిఫలముల నీశ్వరార్పణమొనర్చు। టభ్యాసించిన మోక్షంబునందగలడు॥

ఉ॥ త్రాటినిచూచి పామని యెదన్ చరియించుచుండు వానికే। నాటికినైన సర్పము గనుంబడునట్లు ప్రతిస్వరూప మునన్। సూటిగకంటదైవమనుచున్ బ్రమచూచుచునుండు వాని కే। నాటికినైన దేవుడుగనంబడుజుమ్మి। దలంపమా నవా॥ "నాన్యపంథాయనవిద్యతే॥"

"సంచితకర్మము ప్రారబ్ధము"

ఆధ్యాత్మోపనిషత్తు:- సంచితమన అనేకజన్మముల నుండిగల్గు కర్మఫలములమాట "అహంబ్రహ్మేతివిజ్ఞా నాత్। కల్పకోటిశతార్జితం। సంచితం విలయంయాతి ప్రభో దాత్ స్వప్నకర్మవత్" నేను బ్రహ్మమనెడి అపరోక్షసాక్షా త్కారమువలననగా పరోక్షమున తనయందు భగవంతుడు యేకమై తాను భగవంతునిప్రకాశించునట్లు కన్పడిననాడు, అనేకకల్పములచేసిన పుణ్యాపాపసంచిత కర్మములన్నియు స్వప్నకర్మములులేచిన, లేనియట్లు నశించును.

ఆగామి:- తాను బ్రహ్మము అనగా స్త్రీ పురుష ద్వంద్వస్వరూపుడగు భగవంతునివలె తనకు తాను కన్పడిన నాడు ఆగామికర్మములు భాధింపవు, కల్లుకుండలోగల ఆకా శము ఆకల్లువాసనచెందనియట్లు ఆత్మఉపాదిధర్మముల ఫల ములంటబడవు.

ప్రారబ్ధము:- "జ్ఞానోదయాత్పురారబ్ధం, కర్మజ్ఞానాన్నసస్యతి" (నపశ్యతి)జ్ఞానోత్పత్తికికంటె అనగాఅంతటను భగవన్మయముగ చూచుట అను దృష్టిగల్గుటకంటె వెనుక చేయబడిన కర్మఫలములను ప్రారబ్ధమన యీజన్మమునకు వెనుక జన్మమున జీవుడు చేసిన కర్మఫలము, పుత్రునకు వెనుక జన్మము తలిదండ్రులు (ఆత్మావై పుత్రనామాసి) తండ్రియే పుత్రుడుగా పుట్టును. వారు చేసిన మంచిచెడ్డకర్మములును స్వర్గ నరకాదులనుండి తానువచ్చునపుడు గతజన్మ శేషకర్మ ఫలము ప్రారబ్ధమనబడును. యిది జ్ఞానోత్పత్తి అయిననూ నశించదు. అనుభవించితీరవలెను. యిదే జాతకము, జ్యోతిశ్శాస్త్రమన ప్రారబ్ధము తెల్పునది. దుష్టుడయిన సత్కాముడయిన ప్రారబ్ధబాధ పడవలసినదేగాని విడువదు. జ్ఞానియైన నిష్కాముడై సత్కర్మఫలార్పణ చేయుచు దేవుని అర్చించువాడయ్యు యెక్కువయోగము జరుగదు గాని తానున్నస్థితిలో ఆప్రారబ్ధకర్మబాధలు భగవంతుని దయచే తప్పుకొనుచుండును. మొదలంటనశించదు. అనగా శరీరము పోయినగానిపోదు. గాన తలితండ్రులు సంతానముగనునపుడే అన సృష్టికాలమందే చాలజాగ్రత్తగా సన్మార్గులై తమకు లోకమునకు కళ్యాణకరులు బలవంతులగు పుత్రపుత్రికల కనదగినది. దాన ప్రారబ్ధము చాలసౌఖ్యముల నిచ్చును. లేనిచో చాలకష్టముల జీవుడనుభవించితీరవలెను.

బృహత్పరాశరస్మృతి:—గాయత్రీమంత్రజపం దుష్టప్రారబ్ధకర్మఫలముల నశింపచేసి సుఖమిదునని గలదు. చెడుజాతక కాలము మంచిగానడచునని భావము. గొప్పజాతకముగా చేయదు. ప్రస్తుతకాలాన గాయిత్రిమంత్ర మేరీతిశాస్త్ర ప్రకారము చేయవలెనో ఆమార్గము తెలిసినవా రరుదుగా నున్నారు. మానవులు యీగాయత్రీ మంత్ర విమర్శనముచేసి పూర్వమువలె దానిఫలములిడు మార్గముగైకొన్న చాల లాభముగలుగగలదు. స్మృతికన్న శృతివాక్యమే శ్రేష్టము గాన సామాన్యమధ్యమ ప్రారబ్ధములు సుఖమిడుగాని పూర్ణదుష్టప్రారబ్ధము అనుభవించకతీరదు.

భారతము:— పరులదైవమును అనగా ప్రారబ్ధమును అదైవముగను అదైవమును దైవముగను చేయుశక్తి వేదాంత బ్రాహ్మణునికిగలదుగాని తన ప్రారబ్ధము బ్రహ్మజ్ఞానిగాని, బ్రహ్మర్షిగాని, పోవగా కోరక అనుభవించును. కోరినచో కైవల్యముభంగమగునని వారియూహ. పరుల సామాన్య, మధ్యమ, దుష్టప్రారబ్ధముల వైద్యమంత్రాదులనలన త్రిప్పగలరు. పూర్ణదుష్టప్రారబ్ధముల త్రిప్పసహాయిపడిననూ దుర్యోధనుని వలె కర్తనిలిచియుండడు. ఉదా:— మైత్రేయుడు చెప్పిన సుఖమార్గమువినని దుర్యోధనుని శపించెను. అవతారపురుషుడగు శ్రీకృష్ణుడు దుర్యోధనాదులకు చెప్పిననూ వినక తరువాత పాండవులకుసహాయముచేసి ఓడింపచేసెను. మైత్రేయుడు నిష్కామ బ్రాహ్మణధర్మముగలవాడన వేదాంత

బ్రాహ్మణసిద్ధము, రెండవది నిష్కామక్షత్రియధర్మము శ్రీకృష్ణునిది యిట్టిధర్మము మానవసృష్టి స్థితిలయములమార్చ గొప్పశక్తిగలది. ఆశక్తి దుష్టుడగుదుర్యోధనునిపైబడి అందరికి దర్శనమిచ్చినది. గాన తలితండ్రులు పిల్లలుకనుటలోనే సన్మార్గబలవంతులనే గనవలయుదాన తలిదండ్రులు పుత్రపుత్రికలు సుఖింతురు. లేనిచో ధృతరాష్ట్రదుర్యోధనునివలె వుభయులు నానాఅవమానములతో కష్టములతో కాలము గడిపి నశింతురు.

"ఒకరికొకరు మానవులే భూలోక కల్పవృక్షములు"

ఒకరినిజూచినపుడు భయసందేహములు, చంపవలెనన్న ఊహలుగల్గిన గతము నేజన్మముననో అతడు తనకపకారియని తలచి మానవధర్మప్రకారము సత్యాహింసాదిమార్గములు విడువక, వానిని దేవునిగాజూచి ఉపకారము చేయునది. ఒకరినిజూచినపుడు సంతోషాదులుగల్గిన గతమున నేజన్మముననో అతడు తనకుపకారియని సత్యాహింసాది ధర్మమునుండి దేవునిగాజూచి ఉపకారముచేయునది. పరులనుండి తనకెట్టి కష్టములుగల్గినను దేవునిగావారినిజూచి తిరిగి అపకారము చేయకుండుటేగొప్పనీతి. పూర్ణదుష్టుడైన వారితోస్నేహము మానునది. లేనిచోరాజుచే దండింపచేయునదేగాని తాను దండింపరాదు. ప్రాణముతీయవచ్చిన గురువగు పరశురామునుండి భీష్మునివలె ప్రాణమురక్షించుకొనునది. లేక

దేవునిగా జూడగల్గిన భాగవతములో జడభరతుని కాళికా మలువల్ల అపకారముజరగనట్లు, ఎదుటవానివల్ల ప్రాణములుహరింపబడక, భగవంతునిచే రక్షింపబడును. ప్రహ్లాదునివంటి మహాత్ముని ఎట్టిదుర్మార్గులు బాధింపలేరు. అట్టివాడు తప్పించుకొనజూడడు.

బ్రహ్మర్షియగు జమదగ్ని ఊరుకొన్న కార్తవీర్యార్జునుని మంత్రులుచంపిరి. అతడు ఎదుటవారిని చంపగలవాడయ్యు, ఊరుకొనెను. అతడుమరల భృగుమహర్షి దయచే బ్రతికెను. గాధాయని జమదగ్నివలె ఊరుకొనక అతిక్షుమదుఃఖంబు తెచ్చునని తలచి, పూర్వదుష్టులబారినుండి తప్పించుకొనుచు అవమానమునకోర్చి, బ్రహ్మర్షిత్వసిద్ధి మార్గమున చరించుటే మేలు. సర్వజంతువులు ఒకనినొకటిచూచినపుడు సంతోషాదులు, సుఖమును, అసూయాదులు, కష్టములు గల్గించును. ప్రారబ్ధప్రకారము జరుగునని పురుషుడు శాస్త్రీయపురుష ప్రయత్నము మానరాదు. చెడుకాలమునయత్నము ఫలింపదు. మంచికాలమున యత్నము సిద్ధించును. చెడుకర్మములుచేయుటమాని, ఫలింపకున్నను మంచికర్మములనే నిష్కామ, సత్కామ్యములచేయుట మంచిది. మంచిమార్గమున నడచుచూ చిత్తమునభగవధ్యానము చేయుచు కైవల్యసిద్ధికై ఎక్కువ పాటుపడునది.

## బ్రహ్మర్షిత్వసిద్ధి

చిత్తమును దుష్టవృత్తుల నడిపించుటే బంధనహేతువు.

నిష్కామ, సన్మార్గమున నడచుచు భగవధ్యానము చేయు టచేజీవన్ముక్తి సిద్ధింపగలదు. యిదిబ్రతికియుండగా గల్గునది. అనగా బ్రహ్మార్షిత్వసిద్ధిగాంచుటయే జీవన్ముక్తి. కుంభకాది యోగాః ఎక్కువకాలముజీవించిన, విశ్వామిత్రాదులకువలె జీవన్ముక్తితప్పక హీనజాతకులకును గల్గగలదు. రాజయోగ జాతకులకు త్వరలోసిద్ధించగలదు. ప్రారబ్ధమున మంచి చెడ్డలనుభవించుచు దేహాంతమునగల్గునది విదేహముక్తి.

ముక్తికోపనిషత్తు:– యీ బ్రహ్మవిద్యచే నిత్యానం దముగల్గును. యిదియే ప్రయోజనము. దుఃఖరాహిత్యముఅగు టే కైవల్యము. కర్తృత్వాదిదుఃఖ నివృత్తిద్వారా నిత్యానంద ప్రయోజనం భవతి, తత్ పురుషప్రయత్నసాధ్యోభవతి, యథా పుత్రకామేష్టినాపుత్రం, వాణిజ్యాదినావిత్తం, తథాపురుషప్ర యత్న సాధ్య వేదాంత శ్రవణాది జనితసమాధినా జీవన్ముక్త్యాధి లాభోభవతి ” ప్రారబ్ధము చెడుదైనకాలాన, సత్కామములు జేయు పురుషప్రయత్నము విఫలమగునుగాని, బీదలకు, ధనవం తులకు ప్రారబ్ధముచెడుదైనను, మంచిదైనను, నిష్కామ భగవధ్యానముచేగల్గు జీవన్ముక్తి పురుషప్రయత్నముచే సిద్ధిం చును. అనగా దేవుని ప్రార్థించుటకు చెడుప్రారబ్ధము అడ్డుచేయ లేదని తెలియుచున్నది.

గాన అందరూ దేవుని ప్రార్థించి ఫలము జెందవచ్చు. “ జీవన్ముక్తుడనగా ” సర్వశక్తివంతుడు. సర్వపాలకుడు సృష్టి, స్థితి, లయశక్తివంతుడు, నిగ్రహానుగ్రహాశక్తివంతుడు. దేని

మండియును భయము లేనివాడు. సర్వదయాయుతుడు అనిఅర్థము. ప్రస్తుతము భూలోకమున మంత్రులు దేశాధ్యక్షులగుటయే గొప్ప భాగ్యమనితలచుచున్నారుగాని, దీనికన్న మిన్న భాగ్యము గలది బ్రహ్మర్షిత్వసిద్ధియని పూర్వభారతీయులు దానిని పొందినారు.

ఉ॥- విశ్వామిత్రాదులు - విశ్వామిత్రుడు భూలోక మంతయుపాలించిన వేదాంతబ్రాహ్మణుడు. ఒంటరిగానున్న వాడునుఅగు వశిష్టునిచే అవమానమొంది క్షత్రియబలము హీనమని బ్రాహ్మణత్వసిద్ధికై పాటుపడి బ్రహ్మర్షి అయినాడు. నేడు ఆచరించుజనులట్లే కాగలరు. "పరమార్థాయ శాస్త్రీతం" శాస్త్రమువిడిచిన కర్మమార్గము అనర్థమిడును. గురువుచెప్పినది పూర్వులాచరించినట్లు శాస్త్రమునగల మార్గమున నడచిన తప్పక సిద్ధిగల్గును. గాన మానవులు ప్రారబ్ధముపై ఆధారపడక సత్పురుషప్రయత్నము విడువక చేయుచున్నచో యీ బ్రహ్మర్షిత్వసిద్ధి తప్పక కాగలదు.

"పురుషసూక్త పురుషుడే విష్ణువు. దేవునకు అనంతరూపములు గలవు. అందులో ఒకగొప్పరూప వర్ణన యిందుగలదు. విష్ణువన అంతటా నిండియుండి పాలించు శక్తిగలవాడు"

యీవిష్ణునిముఖము - వేదబ్రాహ్మణుడు - యింద్రుడు అగ్ని - బాహువులు రాజులు - ఊరువులు వర్తకులు - పాద

ములు శూద్రులు, మనస్సు చంద్రుడు — నేత్రములుసూర్యుడు. ద్యులోకము శిరస్సు - వాయువే ప్రాణము - దిశలు చెవులు - పాదములుభూమి - యిదివిష్ణురూపము. యీరూపమున వేద బ్రాహ్మణులలో సన్మార్గులు అతనిముఖమును, అట్టిసత్కామ రాజులు బాహువులును, అట్టిసత్కామవైశ్యులు తొడలును అట్టిసత్కామశూద్రులు పాదములు చెందగలరు. అనగా ఆ పురుషుని ఒక అవయవమునుమాత్రమే పొందుదురు.

వేదాంతబ్రాహ్మణుడు నిష్కామభగవధ్యాన సన్మార్గుడగుటచే సుజ్ఞానియై విష్ణువేయగుచున్నాడు. భూలోక ప్రజలందరు 4 జాతులుక్రింద విభజింపబడిరి. యీ నాలుగు జాతులలో నెవడయ్ని వేదాంతబ్రాహ్మణత్వసిద్ధికై పాటుబడినవిష్ణువేయగును. అనగా బ్రహ్మర్షియేయగును. దుష్టులీ రెండుమార్గాలఫలము చెందక నానాకష్టములపాలై తుదకు నరకమున బడుదురు. జన్మమంతయు సత్కామమార్గాన నడిపి భగవంతుని ఒక అవయవము చేరుటకన్న జన్మమంతయు నిష్కామభగవధ్యాన సన్మార్గమున నడిపి భగవంతునిగా మారుట అనగా బ్రహ్మర్షియగుట ధన్యతగాదా! ఆలోచించుడు. మనుస్మృతి- 1 అధ్యాయం:- "బ్రాహ్మణోజాయమానోహిపృథివ్యామధి జాయతే ఈశ్వరస్సర్వభూతానాం ధర్మకోశస్య గుప్తయే" బ్రహ్మజ్ఞానిపుట్టుకతోనే భూజనులకన్న మిన్నజన్మముగలవాడు. సర్వధర్మప్రభువు. స్వతంత్రుడు. సర్వాధికారి. వేదాంతబ్రాహ్మణజన్మము. గతజన్మమున

బ్రహ్మర్షిత్వసిద్ధికై పాటుబడి జయత్వముపొందనవానికి రెండవ జన్మమున గల్గునని భగవద్గీత చెప్పుచున్నది. మొదటిజన్మముననే కుంభకాదియోగాల ఆయిర్వృద్ధిచేసిన ఆజన్మముననే సిద్ధిగాగలదు. అట్టిది చేయనివారికి రెండవజన్మమున సిద్ధించునని గలదు. రాజ్యమేలురాజుజాతకమునకన్న బలీయమగు సుభగ్రిహసంపత్తి, వేదాంతబ్రాహ్మణుని జాతకమందుండును. అట్టిస్థితిగల్గిన ఆజన్మమున రాజయోగదశలో బ్రహ్మర్షిత్వసిద్ధిగల్గునని చెప్పదగినది. బలహీనజాతకులకు కొంతసిద్ధికలుగకమానదు. ప్రజాగౌరవము, జయత్వము, సంతోషము, ఆరోగ్యము బ్రహ్మజ్ఞానాభ్యాసకులకు ఎక్కువగా గల్గుచునేయుండును. స్వల్పకష్టములు, అనారోగ్యములుకల్గినను వెంటనే తొలగుచుండును. బ్రహ్మజ్ఞానాభ్యాసకునివలె నటించు దుష్టవ్యభిచారికి నానాకష్టములుకలిగి బాధలుగలిగించును. ఎట్టికష్టములును సత్యఅహింసాదులు విడువని బ్రహ్మజ్ఞానికి కష్టములు స్వల్పబాధలిడి పోవుచుండును.

## సంకల్పములువలన నౌకరికన్ననౌకరు అధికులు హీనులు అగుచుందురు

కార్మికుడు:— 1 రూపాయి 2 రూపాయిలు మాత్రము ప్రతిదినముకోరును. అదిసిద్ధించిన సంతసించును.

వ్యవసాయకుడు:— 10 ఎకరములువాడు 1000 ఎకరములువరకుకోరి అదిగల్గిన సంతసించును.

వర్తకుడు:- వేలు, లక్షలు, కోట్లు, ధనముకోరి అది గల్గిన సంతసించును.

వేదబ్రాహ్మణుడు:- దేవతలదయసంపాదించి దాన గొప్పధనాదులగోనకోరి అదిగల్గిన సంతసించును.

రాజు:- భూలోకములో అనేక దేశాలలో నొక దేశము పాలింపగోరి అదికలిగిన సంతసించును.

రారాజు:- భూలోకమంతయు నేలకోరి అదిగల్గిన సంతసించును.

మరికొందరురాజులు:-స్వర్గమర్త్యపాతాళము లేలకోరి అదికల్గిన సంతసించిరి. (బలిచక్రవర్తి మొదలగువారు)

బ్రహ్మ:- పదునాలుగుభువనములు పాలింపగోరి అదికల్గిన సంతసించును.

విష్ణువు- ఈశ్వరుడు:- (అన నొక్క-టేమూర్తి) నిష్కాములై నానావిధలోకముల బ్రహ్మమునకు అపరమూర్తులై బ్రహ్మమును తనయందైక్యపర్చి పాలించువారు.

బ్రహ్మము:- మాయాదేవి అనుభార్యనుగూడి సర్వము పాలించువాడు. యితడంతటగలడు. ప్రతిదేహధారి హృదయాంతరాళమునగలడు. సర్వశక్తివంతుడు.

బ్రహ్మజ్ఞాని:-బ్రహ్మమునుగాని అపరమూర్తులగు నారాయణ శివుల నొకనిగాని తనయందంతట చూచుచు తనయందైక్యముచేయు కోరికతో. పాటుబడువాడు. తానటులైక్య స్థిద్ధిచెందిన సంతసించును.

(బ్రి)హ్మర్షి:- సర్వదేహధారులను సర్వమును తన్ను బ్రహ్మముగగాని, శివనారాయణుల నొకనిగాని జూచుచు అతనిని తనయందైక్యసిద్ధిచెందినవాఁడు. పైవారందరు నిష్కాములై యీసిద్ధిచెందిన జగమంతయు బ్రహ్మర్షులగుదురు. యిటులయిన్నచో సర్వసౌఖ్యములతో భూజగము భగవన్నివాసమైనదగును. మానవజన్మలకే అట్లగుటకుమార్గముగాని మానవాకారులలో కొందరే మానవులుంచురు. వారు మాత్రమునిష్కామమార్గాన నడువగలరు, వీరిలో నొకనికి బ్రహ్మైక్యసిద్ధిగల్గిన సర్వసంకల్పసిద్ధిఅగునని స్థిరబుద్ధిగల్గను. అపుడు అన్నిటిపై నిష్కామమేర్పడును. దాన తనయందు భగవంతునైక్యముచేయుటయను పనియొక్కటేగలదని యితరముపై భ్రాంతివిడిచి నిత్యమెక్కుడు శ్రద్ధతో ఐక్యసిద్ధిమార్గాన నడచుచు తక్కినభోజనాది సదుపాయములున్నను లేకున్నను లెక్కసేయక ధనమున్న పరిశుద్ధాహారము రెండు పూటలాతినుటతప్ప మరియేమియుతినడు. లేకున్న యేకభుక్తముచేయును. లేకున్న పత్రి ఫల జలముల భక్షించును. అవియు లేకున్న కుంభకాదియోగములు నేర్చి వాయుభక్షణ చేసియైన విశ్వామిత్రునివలె బ్రహ్మర్షిత్వసిద్ధి అగువఱకు విడువడు. సర్వశక్తులు తనయందుచేరుట తనకే తెలియుచుండును. దానికితోడు జగముగూడ బ్రహ్మర్షియనిపిలిచిన సిద్ధుడైనట్లెరింగ సిద్ధుడయ్యినతర్వాతకూడా మునుపటివలె నే నిష్కామముగసత్కర్మములు జగత్కల్యాణమునకై చేయుచు అంతమున బ్రహ్మముగానిలచును.

వశిష్ఠునిమార్గము—మానవుడు పరిశుద్ధసాత్వికాహారము రెండుపూటలాతినుచు జపయజ్ఞము నిత్యముచేయుచు బ్రహ్మర్షిత్వముచెందుచున్నాడు. యీమార్గము సుఖకరముగాయున్నది. వశిష్ఠుడు సర్వశక్తివంతుడు. "హే భగవన్ వసిష్ఠా" అని రామాదులచే పిలువబడినవాడు. యీబ్రహ్మవిద్యాసిద్ధి మానవజన్మలకు సాధ్యముగాని దేవతాదియితర జన్మలకుసాధ్యముగానిది.

ఓమానవశరీరధారీ:- నీగుణకర్మములబట్టి నీవెవడవో అనగా నీవురాక్షసుడవో, దేవతవో, యక్షాదులలోనొకడవో మనుష్యుడవో, ఋషివో, విష్ణ్వంశసంభూతుడవో నీవు తెలిసికొని రాక్షసుడవైన తమోగుణకర్మము లుండును. అవి బాయుటచాలకష్టము. అనగా దుర్మార్గవర్తనమన్న చాల ప్రీతిగాయుండను. గాన యీదుష్టగుణమువిడిచియు దేవతా యక్షాదుల నొకడవయ్యు సత్కామ సన్మార్గమున నుండుము. దీనిని విడిచి అనగా దుష్కామమువిడిచి సత్కామసన్మార్గ ఫలము భగవదర్పితముచేసినచో మానవజన్మసాఫల్యమొందగలవు. గతజన్మమున బ్రహ్మోపాసన చేయుచు సిద్ధిచెందక మరణముచెంది శుభలోకములకేగి మరల మిగిలినది పూర్తి సిద్ధిచెంద భూలోకమునకువచ్చు మానవజన్మలు కొందరు గలరు. వారు మొదటనుండియు బ్రహ్మవిద్యయందెక్కుడు భ్రాంతిచెంది అభ్యాసముచే సిద్ధిగాంచి బ్రహ్మర్షులగుదురు. అన్నదానాది సత్కర్మములుచేయుచు స్వర్గమార్గము చూపు

వారు. దేవతలు, రాక్షసాదులు, పరస్త్రీలచేరిచి గృహ స్థుల కుటుంబ బాంతముచేయుట (అనగా దుష్టసంతతిగనుట) అసత్యవాదములనెగ్గించి సంతోషించుట, సాధుస్త్రీల సాధు పురుషుల అవమానాదులతో బాధించుట అన్యాయధనార్జన మానవాద దుష్టకులములతో పండిన ఆహార కంద ఫల ధాన్యముల ఆహారముగాగొనుట నిత్యము తమజాతివారికి పరులకు అపకారములు చేయుచుండుటగలవారు నరక మార్గముచూపు పిశాచ రాక్షసాది మానవు లనబడుదురు. నిష్కాములు, సత్కాములు, దుష్కాములని మానవులు మూడు తెరగులు. అందునిష్కాములు సత్కాములుగలిసి సాధుపక్షమనియు, దుష్కాములు అసాధుపక్షమనియు మాన వులందరు 2 పక్షములుగ నున్నారు.

దేవీభాగవతము – 6 స్కంధము:– "నాఋషిః కురుతే కావ్యం" "నావిష్ణుః పృధివీపతిః" సత్యమార్గములుగల గ్రంథములువ్రాసి లోకకళ్యాణముచేయువాడు. గతజన్మమున ఋషియనియు నిష్కాముడై బ్రహ్మత్వము చెందుమార్గములు. భగవంతునిపూజించు సత్యమార్గములు ప్రజలకు తెలియ చేయుచు తానుచేయుచు సాత్వికాహారవృద్ధి తానుపాలించు రాజ్యమున వృద్ధిచేయుచు, ధర్మమార్గధనార్జనచేయ బోధిం చుచు పాలించురాజు విష్ణుఅంశమే అట్లుపుట్టెనని తెలియ వలెను. సత్కర్మసన్మార్గులుగతమున దేవతలని వ్యాసుడు మానవులలో కొందరి గతజన్మములను వ్రాసినాడు. శుక్రనీతి–

విష్ణుఅంశరాజు - నిష్కాముడు. తత్వసిద్ధుడు, దేవతారాజు, సత్కాముడు - మునిరాజు - ధర్మమార్గసుడు.

రాక్షసరాజు:- దుష్కాముడు, దుష్టప్రియుడు, సాధ్వపకారి, అధర్మమూర్తి.

రాజ్యమేలురాజు గతము ఆజన్మగలవాడని గ్రహింపదగును. యెంతచదివినను ఆచరించినను లాభములేని అసత్యవర్ణనలతో గూడిన గ్రంథము వ్రాసినవాడు శుష్క వేదాంతి. లేక (రాక్షసకవి) అనదగునని నాయూహ. దేవతారాక్షసాదులారా - మీరు భూలోకమున మానవాకారులై పుట్టితిరిగాన మానవునికి కైవల్యసిద్ధిచెంద నర్హతగలదు. గాన మీగుణకర్మములుబాసి నిష్కాములై భగవధ్యానముచేసిన కైవల్యమందగలరు. మీరు మానవాకారులై పుట్టిన కైవల్యముగల్గునని తలంతురుగదా. అట్లేపుట్టినారు. గాన మీరు నిష్కామమార్గమున చరించుడు.

లోకైకభగవదాధిజ్యము - లోకైకమతము:- భగవన్మతము లేక యింద్రియవిజయయుద్ధము (అనిన యొకటే అర్థము)

ఓ మనుష్యుడా! యింద్రియములజయించి భగవంతుని పూజించుటే లోకైకమతమని, పరులకుబోధించుచు భగవంతునైక్యసిద్ధిగొని బ్రహ్మర్షివై భగవదాధిజ్యముగు సర్వలోకముల కళ్యాణముగపాలించుటే మానవజన్మ సాఫల్యమని అర్థము. భూలోకము మిగిలినలోకములు భగవంతుని

రాజ్యము. అందునివసించువారు జీవులు. అన్నిలోకాలకన్న యీభూలోకములో మానవజన్మము శ్రేష్ఠము. అందు భగవంతుని పూజించువారు శ్రేష్ఠులు. యిందు ధర్మార్థకామ మోక్షములు 4 గలవు.

ధర్మమన:- సత్యమునుష్ఠించినది. ధర్మముచే అర్థము సంపాదించదగినది. ధర్మకామము.- ధర్మమార్గమున సాధు స్త్రీని వివాహమాడి సాధువులగు పుత్ర పుత్రికలగన్నది. ధర్మ మోక్షము:- శాస్త్రీయధర్మమార్గముల నడిచి కైవల్యసిద్ధి గాంచునది. "ధర్మంచర" నిత్యము ధర్మముగానడచుటగల గృహస్థుడు. "ధర్మచరుడు" ధర్మాత్ముడు ధర్మకాముడు, ధర్మమోక్షయుక్తుడై చంద్రునివలె ప్రకాశించును.

భగవంతుడు స్త్రీ పురుషరూపుడని భగవద్గీత చెప్పెను నాశనములేనివాడు. సత్యస్వరూపుడు. నిత్యానందుడని ఉపనిషత్తులు చెప్పును. క్రీస్తుమతములో అనేకభేదములుగలవు. మహమ్మదీయమతమున అనేక భేదములుగలవు. బుద్ధమతములో అనేకభేదములుగలవు. హిందూమతములో అనేక భేదములుగలవు. యింకను చిన్నచిన్న మతము లనేకము లున్ననూ యివిలోకములో పెద్దమతములు. అన్నిమత గ్రంథములు సత్యాహింసాదిమార్గములు దుష్కర్మమార్గములు వాటి ఫలములు చెప్పబడినవి. సత్కర్మమార్గము. యిహపరసుఖమనియు, దుష్కర్మమార్గము యిహపరకష్టమని చెప్పుచున్నది. బుద్ధమతమున దేవునికిబదులు బుద్ధుని

పూజించుట అహింసాదులతో నడచు సత్కామమార్గము చెప్పబడినది. వేదహిందూమతమున సత్కామ దుష్కామ మార్గములు వాటి ఫలములు సత్యాహింసాదులకుగల ఫలములుగలవు. అట్టిఫలములుగల్గువరకు ఆచరించుడని శాసించినది.

దుష్కామమార్గము దీన మానవుడు ఒకసంవత్సరము మెల్లమెల్లగా ఆచరించుసరికి మానవులలో ఎక్కుడువిరోధములు కలహములు ప్రారంభమగును. అతనినడకను సాగనీయరు. వారినిదాటినచో రాజ్యమేలువారు సాగనీయరు. మధ్యమధ్యకొందరితో సత్యముచెప్పుచుండుటచే కొలదికాలముసాగునుగాని లేనిచో దుష్కామమార్గము ఆచరించు వానినిచూచి గ్రామస్థులు తమయూరినుండి వెడలగొట్టుదురు. సన్మార్గమొక యేడాదిచరించినవానినిచూచి అతడు వూరువిడతునన వెడలవద్దనిప్రార్థించి ఆపుచేయుదురు. దీనింబట్టి మానవుడు దుష్కామసత్కామ ఫలములు తెలిసికొనందగును. మరియు యేలోకమునుండియో యీలోకమునకు వచ్చిన దేహధారి స్థిరముగాయుండడు. చచ్చినతరువాత యేమగునో ఋషులకు శాస్త్రములకుదక్క పామరులకు తెలియదు గాని వకచోటనుండివచ్చుటంబట్టి మరియొకచోటికి పోవుచున్నాడనిన పామరుడును గ్రహించవచ్చును.

సత్కామసన్మార్గము యిక్కడ సుఖమిచ్చుచున్నది. అదియే పరమునగూడ సుఖమిచ్చునని తెలియునది.

దుష్కామమిక్కడ దుఃఖమిడుచున్నది. అదిగాె పరమున దుఃఖమిడునని తెలియుచున్నది. భూలోకసర్వవిధ మతగ్రంథ ములుకన్న హిందూమతములో సత్కాము మార్గమున యింద్రాదిదేవతలశాస్త్రీయపద్ధతుల పూజించిన అతిత్వరలో కర్తకుసత్కామసిద్ధియగుననిగలదు. అట్లుఫలమిడనిచో చేసెడి వారు తప్పుమార్గమని మరలమరల సత్యమార్గస్థులచే చేయించిన ఫలముతప్పకగలుగగలదు. గాని వేదాదిసద్గ్రంథములు తప్పనరాదు. యిదికలియుగఫలమని చెప్పరాదు. కలిలో వేదమార్గమువిడుతురనికలదు. విడువకున్న సత్వఫలమే గల్గునని ఋషులువ్రాసిరి.

భగవన్మతము. ॥గీత॥ ఉపనిషత్తులు:— భూలోకములో సర్వమతగ్రంథములుకన్న యెక్కువనిష్కామమార్గము చెప్ప బడినది. యిదియేకైవల్యమార్గము. యిందు తనకు తెలిసిన దుష్కర్మములువిడిచి తెలియనిదుష్కర్మములు పెద్దలవలన తెలిసికొని వాటినివిడిచి సత్కర్మములుచేయుచు సత్యా హింసాదిమార్గముల నడచుచు లోకులకు మహోపకారము లచే సంతోషింపచేయుచూ వాటిఫలము భగవదర్పితము చేయుట యీమార్గమున సాలోక్యము — సామీప్యము — సారూప్యం — సాయుజ్యములను 4 ఫలమార్గములు. అందు సాలోక్యమన — భగవంతుని యెపుడోవకపుడు కనుగొనుచు అతనిలోకమునుండిసుఖపడుట. సామీప్యము :— అతనిని నిర తరము చూచుచు సంతోషించుచు సుఖముగకాలముగడపుట

యీ రెండుఫలములు తనవలనగాని సద్భార్యవలనగాని, సత్పుత్రునివలనగాని గల్గునని శాస్త్రము చెప్పుచున్నది. సారూప్యము:- అతని ఆకారముమాత్రముగల్గి సుఖించుట యీ మూడును పరమోత్తమజన్మము నిచ్చుచున్నవి. సాయుజ్యమన:- భగవంతునిగా తానుమారుట యితడుస్వతంత్రుడై తనపై పాలించు రాజులేనివాడుగా ధర్మరక్షణకు భూలోకమున పుట్టుచూపోవుచుండును. అపుడు వేదాంతశాస్త్ర బోధన చేయును. లేక దుష్టులశిక్షించి శిష్టులరక్షించి తత్వబోధను చేయును. యీసాయుజ్యపదవి తానుకష్టపడి సంపాదించవలెనే గాని పరులసాయమునగలుగదు. రాజర్షి, ఋషి, మహర్షి, బ్రిహ్మర్షులు క్రమముగా సాలోక్య, సామీప్య, సారూప్య, సాయుజ్యపదవులనొందెదరని నాయభిప్రాయము. యీకైవల్యమార్గము అవతారపురుషులగుకృష్ణరామాదులు, బ్రహ్మర్షులగు వసిష్టాదులు గీత, వుపనిషదాదిగ్రంథములు వివరముగావ్రాసిరి. సగుణరూపులగు అవతారపురుషులు బ్రహ్మర్షులు జన్మాంతమున సర్వసుఖాస్పదమగు నిర్గుణబ్రహ్మమును చెందెదరు. స్వర్గనరకముల చెందరు. భూలోకముననున్నంతకాలము నిత్యవిజయ, నిత్యానందులై చరింతురు. భూలోకములో అధర్మమార్గవృద్ధి కాలమున వీరుబుట్టి సత్కామనిష్కామమార్గముల ఫలకుడునట్టి సత్యమార్గములు నిష్కామముగానే బోధించుచుందురు.

భాగవతము - 5 స్కంధము :- ఉ॥ భారతవర్షజంతువుల భాగ్యము లేమనిచెప్పవచ్చు ఈ। భారత, వర్షమందుహరి

బల్మొరఁబుట్టుచు ప్రాణికోటికిన్ ! ధీరతతోడ తత్వముప దేశ
ము చేయుచు సెల్మిచేయుచున్ ! ఆరయ బాంధవాకృతి స్మృతా
స్థలచేయుచునుండు నెంతయున్॥ ఇట్టిస్థితిగలవాడు విష్ణువని
గాని బ్రహ్మర్షియనిగాని గ్రహించునది.

## మానవుడు బ్రహ్మర్షిగామారుట నమ్మదగినదా

గృహరాజ్యమున చిన్నకుర్రవాడుగాబుట్టి తలిదండ్రు
లసాన్నిధ్యమునుండి వారుచెప్పినట్లు నిష్కామముగా నడ
చుచు బాల్యావస్థలో తనకుగలిగినవిఅన్నియు తలిదండ్రులకే
యిచ్చుచు సత్యాహింసాదిమార్గములనడచు సత్పుత్రినికి
సంతసించి తమవలెపుత్రుడగుటకు సత్కన్యనువివాహముచేసి
తమఆస్తిని సాధుమార్గాలరక్షించుచు తమకుసహాయము
చేయదగినవాడనిదోచినకాలమున తమ ఆస్తిపై పెత్తనమిచ్చి
అతనిరక్షణలో తాముండిగాని వేరుగావానప్రస్థాదులనుండిగాని
బ్రహ్మర్షిత్వమునకై జపాదియజ్ఞములుచేయువారు పూర్వ
మెక్కుడుగాను, నేడు అకడక్కడయున్నట్లు లందరెరింగినదే
గదా! (దుష్టపుత్రులవలన ఉభయులు కష్టములుపాలగుట
అందరెరింగినదేగదా) యిందు తలిదండ్రుల బాల్యమున
సేవించుపుత్రుడును, కోడలునూ యౌవనావస్థలో కొందరికి
తమ తలిదండ్రులవలె తండ్రులగుచున్నారుగదా.

దీనింబట్టి సర్వశక్తివంతులు, స్వతంత్రులు, సర్వజననీజనక
రూపులు, పరమేశ్వరీ పరమేశ్వరరూపులు, యిద్దరేకమైయున్న

భగవంతునిపూజించు భార్యాభర్తలు కొంతకాలమునకు భగవంతునిగా అనగా బ్రహ్మర్షిగామారరనుట హాస్యాస్పదముగయున్నది. రాజ్యమున రాజు, లేక అధ్యక్షుడు, ప్రధాధ్యక్షుడు, అధ్యక్షుడింటనుండి రానికాలమున ప్రధాధ్యక్షుడు అధ్యక్షునివలె రాజ్యమేలుచుండెను. అతనిస్పర్శ లేక యొుప్రశ్నో దర్శనముగల రాజసేవకులయినవారు రాజ్యములోవున్నత రాజసేవాపదవులుగాని రాజప్రతినిధిపదవులుగాని బొందెదరుగాని రాజుగాగాని అధ్యక్షుడగగాని ధర్మముగాగారు. ప్రస్తుతకాలమున రాజసేవకుడు అధ్యక్షుడగుటకు చాల కాలము మంచిమార్గస్థుడని పేరుపొందినగాని ప్రజలు నమ్మరు. ప్రజలునమ్మినతరువాత రాజసేవకుడు అధ్యక్షుడగుచున్నాడు. యీరాజసేవకునికి అధ్యక్షుని దర్శన స్పర్శనము లెక్కుండి వానినడవడలుచూచుచు తెలిసినవాడైనగాని అధ్యక్షుడైనను పాలించలేడు. దుష్టప్రజలు దుష్టాధ్యక్షునిసాధుప్రజలు సాధుఅధ్యక్షుని యెన్నుకొందురు.

ఉదా:— హిట్లరు జర్మనీకి, ఐసెన్‌హోవర్ అమెరికాకు రాజసేవకులయ్యి అధ్యక్షులైరి. దుష్టాధ్యక్షునివలన జగన్నాశనమును, సాధ్వాధ్యక్షునివలన జగద్రక్షణము, యుద్ధాదిభయములులేక సౌఖ్యముగానడచుట అందరెరింగినదే. రాజసేవకులకందరికి అధ్యక్షపదవి రాదు. పూర్ణనిష్కామము అనగా అవినీతి, లంచగొండితనము మొదలగుదుష్టమార్గములు లేనివాడు. సత్యమార్గస్థుడు. న్యాయపాలనగల అధ్యక్షుని

దర్శనస్పర్శనములుగల ఒకానొకనికిమాత్రమే యీఅధ్యక్ష పదవిదొరుకుచుండును. గురువు, శిష్యుడు:– గురువు యం. ఏ అయ్యి వేదపండితుడయ్యి వాని దర్శనస్పర్శనములుకల్గి శ్రద్ధతో వానిని పదిపండ్రెండేండ్లనుసరించి శిష్యుడుగదా! యం. ఏ. లేక వేదపండితుడై మరల కొందరికి గురువగు చున్నాడు. "భ్రమరకీటకన్యాయము" గొల్లభామయనుకీటకము కందిరీగనాశ్రయించి దాని దర్శనస్పర్శనములుగలిగి యేకధ్యానిచెంది, భ్రమరమగుచున్నది. యివన్నియుగోచరముగాజరుగుచున్నవిగదా.

ఇట్లే మానవుడు భగవంతునిగామారును. కొందరు భగవంతుడు అవాజ్మానసగోచరుడగునందురు. అనగా వాక్కు మనస్సులజయించినతర్వాత జపయజ్ఞాదులు చేయువానికి గోచరుడగునందురు. కొందరు భగవంతుడు గోచరుడుకాడందురు. అనగా ప్రకృతిదృష్టిలో చెట్టు, కుక్క, మనిషి, గుర్రము, మొదలగునవి గోచరించునట్లు సామాన్యముగా గోచరించడు. భగవంతుడు కలడనినవారు అతడుగోచరించు సత్యార్థమెరిగినడచినవారైనచో అతనిదర్శనమగుగాని, లేడనిన వారికి చెట్లు చేమలే కనపడుచుండును. సాధారణముగా సామాన్యమానవుడైనవాడు. ఒకకాలమునకు అధ్యక్షుడు గాని, ప్రధానమంత్రిగాని అయినచో వారిదర్శనము కొందరికి సత్యమును, కొందరికి అప్పుడప్పుడు, కొందరికి ఎప్పుడో ఒకప్పుడు, అగుచుండును. కొందరికి అసలేలేదుగదా!

యిక సర్వలోకప్రభువగు భగవంతునిదర్శనమగుట యింతి కన్న తేలికయని గ్రంథాలుచెప్పుచున్నవి. సత్యమార్గస్థుడగు ఒకనివల్ల భగవద్దర్శనమగు సత్యమార్గమును తెలిసికొని అక్కడనుంచి యితరసహాయములేక ఒంటరిగా తనంతట తానే. సర్వాంతర్యామియు, ప్రతిదేహధారిహృదయకమల మధ్యనివాసియగు భగవంతుని అనగా ఒకయింటిలో మూడు గదులుదాటి నాల్గవగదిలోనున్నవాసిని బయటనున్నవారు చూడవలెనన్న, వారెంతశ్రద్ధతో, ప్రేమతో, ధర్మమార్గమున, శుభవాక్యములతో, ఆర్యా! తమకృపారసమున మేముబాగుపడుటకై తమరుచెప్పినచొప్పున నడచుటకు సిద్ధముగానున్నామని యితరాలోచనలులేక, పిలిచినపుడుగదా అదివిని దయతోనున్న యజమాని ఆగుమ్మములుదాటి బయటకువచ్చి బయటనున్నవారికి దర్శనమిచ్చి వారిఅభిప్రాయములకు తగుఉత్తరములు చెప్పుటగలుగుగదా! అట్లేశరీర మనుయింట మూడవస్థలుదాటి తురీయావస్థలోగోచరించు భగవంతుడు జాగ్రదవస్థలో ఎట్లుదర్శనమిచ్చును? యింటికి బైటనున్నవారివలె, శ్రద్ధ, ప్రేమ, శుభవాక్యములతో పిలువగా, పిలువగా యజమానిదర్శనమిడును. లేకభగవంతుడు అంతటనున్నవాడుగాన, శ్రద్ధ, ప్రేమ, శుభవాక్యముల సత్య మార్గముల ప్రార్థించిన గజేంద్రునివలె రక్షింపగా దర్శన మిడును.

దుష్టాహారముతినుచు, దుష్టసహవాసము చేయుచు, దుష్టశాసనములచే అధర్మముస్థాపించు పూర్ణదుష్టుడు, రాజ్య

మేలు హిరణ్యాక్షునివంటి వానినిశిక్షింపగా దర్శనమిచ్చువాడు భగవంతుడు. హిరణ్యాక్షునివంటి దుష్టులీకాలాన లేరు. అట్టి దుష్టరాజములు నేడున్నవనికొందరన్న—

గణేశగీత:— "వర్ణాశ్రమాన్ మునీన్ సాధూన్ పాలయే బహురూపధృక్" అనేకవిధముల సాధుమార్గము రక్షింతునని భగవంతుడనెను. మరియు భగవంతుడు అణువు కన్న అణువు. మహాత్ముకన్నమహాత్మ. నేను హైడ్రోజన్ బాంబు, ఆటంబాంబు రూపములో అతడుండి జగమందరికి ఆటంబాంబుకలవారికి, భయముగల్గచేయుచుండుటచే, అందరు చచ్చెదరని భయముతో శాంతిబోధనలు చేసుకొనుచు, మాదిశాంతిఅంటె మాదిశాంతిమార్గమని చెప్పుకొనుచు న్నారు. దాని భయముతో జగముకొంత ధర్మమార్గమున నడచుకొనుటకు జూచుచున్నది. యీకాలమున సత్యమార్గ ములుచెప్పువారున్న తప్పక యీభయస్థులు ధర్మమార్గమున నడవగలరు. భూభూతాణువు ఆటంబాంబు, జలభూతాణువు వారుణాస్త్రము, అగ్నిభూతాణువు ఆగ్నేయాస్త్రము, వాయుభూతాణువువాయవ్యాస్త్రము వీటివల్ల పూర్వము, నేడును, జగన్నాశమిచ్చును. పూర్వముదుష్టులపైనుపయో గించిరి. ఆఅణువులలో భగవంతడుండి లోకమునకు భయ మిడుచున్నాడు. ఆకాశభూతాణువు భగవంతునిగురించి శుభ శబ్దప్రార్థన, శుభశబ్దోచ్చారణ, శుభశబ్దస్తోత్రములు శుభ శబ్దములువినుచు, శుభశబ్దపారాయణము చేయగా చేయగా శుభశబ్దాణువుబద్ధలై ఆకాంతిలో పంచభూతాతీతుడు,

పంచభూతాంతర్యామియును సర్వశక్తివంతుఁడగు భగవంతుని దర్శనముగల్గి మానవుఁడు సర్వసౌఖ్యములఁ జెందును.

ఆకాశభూతమునుండి వాయురాది పంచభూతములు పుట్టెను. ఆకాశభూతము దేవునికి చాలదగ్గిరదై యున్నది. అందుచే దానియం దనుజనించిన శబ్దమున అన ధ్వనిచే లేక శుభవాక్యములచే లేక యీ రెంటికలుపుటచే అనగా వుదాత్తాదిస్వరధ్వనితో గూడిన శబ్దోచ్చారణచే గాని సత్యముగు సంగీతముతో గూడిన శుభవాక్యోచ్చారణతో గాని, భగవంతుని ప్రార్థించిన జపయజ్ఞమొనరించిన కొంతకాలమునకు ఆకాశభూతశబ్దాణువు బద్ధలై దానికాంతిలో భగవంతునిదర్శనము పొందుదురు. యిందుకితరుల సహాయమక్కర లేదు. అట్లుపొందినవారు పూర్వము వశిష్ఠాదిఋషులు, కలియుగమున త్యాగరాజాదులు (సంగీతశబ్దాణువు బ్రద్దలుచేసి దానికాంతిలో భగవంతుని చూచినట్లు వారికీర్తనలగలదు) రాజుదుష్టుడయ్యి అధర్మస్థాపన చేసి అనేకగృహస్థులపాడు చేయును. అందుచే అతను కోరికున్ననూ భగవంతుఁడు శిక్షింపదర్శనమిడును. గాన గృహస్థుడు సాయములేనివాడగు వాల్మీకివంటి మహాక్రూరునకు దర్శనమిడడు. గాన అతనినుండి అతనే పాడగును. ఇతఁడు పరులకు బాధలనిడునే గాని నాశనము చేయలేడు. వకరిద్దరిని చంపగల్గునుగాని అనేకులహత్య చేయలేడు. భయముతో తిరుగునేగాని అధర్మము ప్రజలస్థాపించలేడు. యిట్టిదుష్టులకును నాస్తికులై దుష్టాచారసంబంధులగువారికి పూర్వమున

నేడును భగవంతునిదర్శనముగాదు. తనపాపమునకు భయము బొంది వాల్మీకి సత్యవంతుడు దేవర్షియగు నారదోపదేశమున విశేషకాలముతపస్సుచేసి ఆపాపములుబాపుకొని బ్రహ్మర్షియై రామాయణాదిసద్గ్రంథములవ్రాసి లోకకళ్యాణము చేసెను.

వాల్మీకిపుట్టుకతో బ్రాహ్మణుడయ్యు, ఆయాంచిధర్మములు విడచి దుష్టులగూడిపాపియై విశేషకాలముతపస్సు చేసినగాని బాగుపడలేదు. కులముగొప్పదిగాదు సంఘము గొప్పదిగాదు. అందుగల సద్ధర్మమునాశ్రయించిన గొప్పఫల మిడునదియైయున్నది. గాన నేటివాల్మీకివంటి దుష్టగృహస్థులు తమపాపమార్గమునకు నేటికయిన్న స్వస్తిచెప్పి వాల్మీకివలె ధర్మమార్గమున తపస్సుచేసినగాని భగవద్దర్శనముగాదు. ఓ మనుష్యులారా! ధనవంతులగు మీరు దానధర్మాదిశుభ మార్గములనడచుటలేదు. బీదవారగుమీరు ధర్మాదిశుభ మార్గముననడచుటలేదు. అధర్మాలతో అన్యాయమార్గములతో యెక్కువవేగముగ గర్వముతో ధైర్యముతో నడుచుచున్నారు. కొలదికాలమునకు వీటిఫలముఫలించి నానా కష్టములపాలయ్యెదరు. సాధుమార్గస్థులైనచో కొంతకాలమునకు దానిఫలముఫలించి నానాసౌఖ్యములందెదరు. మానవునికి 4 శరీరములుగలవు. స్థూల, సూక్ష్మ, కారణ, మహాకారణములు – స్థూలమునకున్నట్లె ముఖాదిఅవయవములు ఆ దేహములకుండునుగదా అవి అంతకంతకు సూక్ష్మములై

యుండును. గాన మానవుడు చతుర్ముఖ బ్రహ్మతుల్యుడుగా నున్నాడు. మొదట 1వ ముఖముతో, తరువాత 2 వ ముఖము తో. తరువాత 3వ ముఖముతో, తరువాత 4వ ముఖముతో తరువాత 1, 2 కల్పి, తరువాత 1, 2, 3 కల్పి, తరువాతను 1, 2, 3, 4 ముఖములతో వకేసారి అంతటను దేవుని చూచుచు తన్నను దేవునిగాచూచుచు జపాదిస్తోత్రాదులు చేయువారు తప్పక భగవంతుని దర్శించగలరు అట్లుచూచుచు అతనిని తనయందైక్యపరచిన తన్నంతటచూచుచు నిష్కామ జపాదులచేయువాడు కొంతకాలమునకువసిష్ఠునివలె బ్రహ్మర్షి కాగలడు.

## " దివ్యదృష్టి ఎంతకాలము - ఆరాధన "

రామగీత:- "యావన్నపశ్యే దఖిలం మదాత్మకం, తావన్మదారాధన తత్పరోభవేత్ " ప్రకృతినంతటిని భూలోకమున సర్వమును, జాగ్రదాద్యవస్థలలోను, రామమయముగా చూచువరకు చిత్తధ్యానము చేయుచుండవలెను. అట్లైనతరువాత దేవుడగు రాముడు సాక్షాత్కరించును. ధృవ, ప్రహ్లాద - గజేంద్ర - రామదాసు - చరిత్రలను చదువుము, అంతేయుండును. రా॥గీ॥ శ్లో॥ యస్సేవ తేమామగుణం గుణాత్మకం। హృదాకదావా యదివాగుణాత్పరం। సోహంస్వపాదాంచిత రేణుభిః స్పృశన్ పునాతి లోకత్రితయం యధా కవిః " నన్ను నిర్గుణుడని లేక గుణయుతుడని లేక గుణాత్పరు

డని హృదయమున సేవించువాడు నేనే అగును. అనగా నాయట్టిశక్తివంతుడగును. అతనిపాదధూళిచే సూర్యునిచతె ముల్లోకములు పవిత్రత చెందును. యిట్టిమహాత్మురు అహింసా వ్రతసిద్ధుడగును.

వానియందా వ్రతఫలములన్నియు గల్గును. యితని పాదధూళిగాలితగిలినంత దుష్టులకు సన్మార్గులకు సౌఖ్యముగా యుండియెట్టిబాధలు చెందక స్నేహమునచరింతురు. వట్టినే అహింస, మంచిదని చెప్పినంతలాభములేదు. అట్లు చేసిన వానికే ఫలించగలదు. భగవద్గీత:— 6 అధ్యాయం. 30శ్లోకం:- "యోమాంపశ్యతి సర్వత్ర। సర్వాంచమయిపశ్యతి। తస్యాహం నప్రణశ్యామి సచమేనప్రణశ్యతి" యెవడుసర్వభూతములః నన్నుగాచూచునో అనగా ప్రతిదేహధారిని, కృష్ణునిగా చూచుట లేక రెండవపక్షము ప్రతిదేహధారిలో కృష్ణుని చూచుటగల్గిననూ లేక సర్వమునూ నాయందుచూడగల్గి ననూ నేనువానికి గనపడుదును. నాకు వాడుకనబడుచుం డును. అని స్పష్టముగాగలదు. యీస్థితి ఆచరింపకయే మూఢులు నాస్తికులు దేవుడున్న తమకు భూలోకములో నిందరిలోకొందరికయ్ని కనపడడాయని యందురు. యిట్టి కృషిచేయువారికి గనిపించును. గాని యితరులకు గనిపించ డని తెలియునది. గొప్పభాగ్యరేఖగలవానికే పూర్వమున, నేడును, యీదృష్టిగల్గునుగదా. డిటో 13 అధ్యాయం:- సమంసర్వేషు భూతేషు తిష్ఠంతం పరమేశ్వరం వినశ్యత్స్వవి।

నశ్యంతి। యఃపశ్యతిసపశ్యతి" సర్వగాత్రహ్యాసదసత్తుల సను-
ముగనున్నవాడు. అవి నశించినను నాశనముచెందని పరమేశ్వ-
రుని చూచినవాడే కన్నులుగలవాడు. యితరుడెంతగొప్ప
వాడయ్యినను, హీనుడైనను గుడ్డివాడేయని భావము.
భాగవతము:- 7 స్కంధము - ప్రహ్లాదుడు — తండ్రి "హరి
జేరుమనియెడు తండ్రితండ్రి" అని చెప్పినాడు. యిదిగాకున్న
యింద్రాదిదేవతలు మానవులకు సన్మార్గులపూజింపవలసి
చెప్పుతండ్రి మధ్యముడనియు, నాయమూహా. పైరీతి హరిని
పూజించుమనిచెప్పుతల్లి తల్లి, గురువుగురువు, భార్యాభార్య,
పుత్రుడు, పుత్రుడు, స్నేహితుడు, స్నేహితుడు.

మనుస్మృతి:— బుద్ధిర్జ్ఞానేనశుద్ధ్యతి ,విద్యాతపోభ్యాం
భూతాత్మా, అద్భిర్గాత్రాణి శుద్ధ్యంతి, "మనస్సత్యేనశుద్ధ్యతి"
భగవంతుని అంతటచూచుటజ్ఞానము అట్లుచూచిన బుద్ధిపరి
శుద్ధమగును. అంతవరకు మానవుని బుద్ధిమంతుడనుట
సామాన్యపుమాటయైయున్నది. భగవన్నామములలో తనకు
హితమగు శుభశబ్దముగాని, శుభశబ్దములుగానిగాని సర్వేం
ద్రియములతో అర్చించుట, తానొక్కడే దేవునర్చించుట,
నేర్చినజీవుడు పరిశుద్ధుడై కైవల్యార్హుడగును. గంగాజలము,
పాతాళగంగ, వర్షోదకము, బట్టెపట్టిననీరు, గోజలము,
(గోక్షీరము) స్నానముచేసిన శరీరము పరిశుద్ధమగును.
తక్కిన నద్యాదిస్నానము కలిలో సామాన్యఫలమిడును.
నదీనామ దేవతను మనసుతో పిలిచి స్నానమాడిన మంచి

ఫలముక్తులిలోగ్గినందురు. నదీనాము దేవతలీ లోకమును లేవని అవి పరమేశ్వరలోకము చేరినవనియు వాటికి కైత్గినదని దేవీ భాగవతమున కలదు. సత్యము పలుకుటచే నాశుద్ధముగల్గును. అది ఆకాశముగలది. ఆకాశమున వాయువుపుట్టునుగాన ప్రాణవాయువృద్ధియై యింద్రియములకు ప్రభువు. మనస్సు దానికి ప్రభువు ప్రాణవాయువుగాన మనశ్శాంతియై మనస్సు పరిశుద్ధిచెందును. మనుస్మృతిలో - ఒక్క శ్లోకమునకే యింతటి గొప్పర్థముగలదు. ఆగ్రంథప్రతిశ్లోకమున యేదోవిధముగ మంచి, మానవునకుగలుగునదియేయైయున్నది. ఋషిగ్రంథము లన్నియు అర్థముచక్కగాచెప్పిన మంచిఫలములిచ్చునవియై యున్నవి. పైమను శ్లోకమున నడచిన మానవుడు యిహమున రోగాదులు లేక సౌఖ్యముగా విజయవంతుడై చరించుచు కైవల్యార్హుడగును. సాధ్వాహారము సాధుజలముల భక్షించుచు, భగవంతుని సేవించువాడయ్యె అతిత్వరలో పరిశుద్ధుడై కైవల్యార్హుడగును.

ఉదా:- రామాయణము - దశరథుడు గృహస్థుడు. నిష్కామసన్మార్గుడై సత్సంతానముగనుటచేతనే గృహస్థులు బాగుపడుటకు మొదటమెట్టన్నట్లు అవతారపురుషులగు శ్రీరాముని లక్ష్మణ భరత శత్రుఘ్నులను మహాపురుషులను గనుటచూచి ప్రజలందరూ సాధుసంతానాభివృద్ధిచేయుచు మహర్షులవలె ప్రకాశించిరనిగలదు.

భాగవతము:- చిత్తధ్యానులగుచు అంతటను దేవు

నిగా చూచినతర్వాత అనగా భగవంతుని ఛాయారూపము గన్పడినతరువాత మానవునినీడ కన్పడినచో తర్వాత మానవుడ ప్రత్యక్షమగునట్లు ధ్రువ, ప్రహ్లాద, గజేంద్ర, అంబరీషాదులకు, భగవంతుడగువిష్ణువు ప్రత్యక్షమై వరములిచ్చినట్లుగలదు. గాన నేకునూ అట్టిరీతిగా చేయువారికి భగవంతుడు ప్రత్యక్షమగుననుట కేసందేహమునూ లేదు అదృష్టి నిజమా కాదా అనువారు భగవంతునైక్యముచేసి అతనినంతటా చూచుచు ఋతుకాలమున రజస్వలైనతర్వాత, 8, 10, 12, 14, 16 రాత్రుల యెక్కువకామాతురయు, భగవంతునిపైదృష్టిగల్గిన భార్యనుపొందిననాడు, అవతారపురుషునిగాని బ్రహ్మజ్ఞానినిగాని కనితీరును. గయ్యాళిగాని, వ్యభిచారిణిగాని భార్యయైనచో యిట్టిగొప్పసంతతి కనలేదు. సద్భార్యకనితీరును. యిట్టిగొప్పసంతతిని వృద్ధిచేసి భగవంతుడున్నాడనియెంచి బ్రహ్మర్షియగుటకు ప్రయత్నించి సిద్ధిచెందుటుత్తమము గాని యిది అబద్ధమని వాదించినందున లాభము లేదు. చేసిచూచి కాదనుముగాని వట్టినే దేముడు లేడని వాదించరాదు. గుడ్లగూబ:- సూర్యుడు లేడనినంత సూర్యుడు లేకుండపోవునే, అటులే మూఢులగుమనుష్యులారా మీరు దేవుడు లేడన్నంతనే దేవుడు లేకుండాపోవునే, అట్లనుకొనుట తమోగుణవృద్ధిలక్షణమని గ్రహించి దానినివిడిచి సాత్వికులై దేవునిపూజించిన వడ్లుజల్లిన ఆరుమాసాలకు ఫలించినట్లు కొంతకాలమునకు ఫలించును. దేవునిపూజింపలేక దేవుని

ఇంటెన్సంతానముగనలేక మిక్కుటముగాభుజించి దుష్టకామా భివృద్ధిచెంది పరస్త్రీలచెరచుచు భార్యయుండగా దుష్టపుత్రి పుత్రికలగని పరులపిల్లల పెండ్లిచేసి దాన వారికి యెక్కువ బాధలుగలుగజేయుచు చుట్టుపట్టుల పరుల కపకారము చేయుచు, అన్యాయధనార్జనచేయుచు యెపుడునూ అసత్యము నేపల్కి కాలముగడుపు మూర్ఖలోకాన స్థిరముగా నుండు నట్లుతలచి యిట్లుచేయుచున్నారే, తుదకు నానాబాధలు అవమానములు ధనాదులచిక్కులు, యిక్కడనే అనుభవించుట కు ర్తుగలవారై తరువాత దేహాంతమున నరకబాధలుపొందుదురు.

రాజ్యములో ఒకానొక యోగ్యుడే దేశాధ్యక్షుడగును. గృహరాజ్యమున, సత్పుత్రుడే గృహాధ్యక్షుడగును. భగవంతునిరాజ్యమగు సర్వలోకములలో భూలోకమునమాత్రము అంతటను భగవంతునిచూచుచు అతని ఐక్యసిద్ధిచెందు ప్రతి మానవుడు బ్రహ్మర్షియై సర్వలోకోపకారముచేయుచు నిత్యానందుడై సర్వశక్తివంతుడై చరించుచు తుదకు సర్వసుఖాస్పదమగు బ్రహ్మమును చెందును. గాన యీభగవద్గీతోపనిషదాది సద్గ్రంథముల సత్యార్థముగానివారు నిష్కామ సన్మార్గులగు గొప్పపండితులదరి సత్యార్థము తెలిసికొని ఆచరించిన ప్రతిమానవుడు బ్రహ్మర్షిత్వము చెందకలడు. యిక్కడ దుష్టపాండిత్యము, దుష్టప్రబంధములు, అనగా జనోపయోగములేని గ్రంథములువ్రాయువారు సంస్కృత

భాషకు సత్యార్థములతో ఇతర భాషకు మార్పు చేయ లేకున్నను గ్రంథములు వ్రాయువారు పండితకవులుగారు. సర్వగ్రంథములచదివి భాషాపాండిత్యముగల్గి భగవంతుని సమదర్శనత్వముగలవాడును అట్టి సత్యమార్గములు గ్రంథములు వ్రాసి లోకకళ్యాణముచేయువారు పండితకవులు. లక్షణము కు॥ ఉపనిషత్తులు. లక్ష్యము పురాణేతిహాసములు. "సత్యం వద" "ధర్మంచర" హరిశ్చంద్ర, ధర్మరాజు, ఋషులు, సత్యధర్మమార్గమునడిచి సత్యధర్మఫలముల చెందుట లక్ష్యము. యిటులే చెప్పుటకు లక్షణలక్ష్యములున్నవి.

గాన ఓమానవుడా! నీవు కార్మికుడవుగాని, రైతువుగాని, ధనవంతుడవుగాని, వర్తకుడవుగాని. సైనికుడవుగాని, దేశాధ్యక్షుడవుగాని అయ్యిననూ నీవు యిక్కడేస్థిరముగావుందునని యూహించక మానవజన్మము, మేఘమువంటిదనితలంచి ఉన్న స్వల్పకాలములో సత్యధర్మమార్గముల నడచుచు దుష్కామక్రోధాదిదుర్గుణములు వదలి ప్రజలకు మహోపకారము చేయుచు, భగవంతునిప్రేమతో పూజించువాడవయ్యి యెప్పటికయ్ని బ్రహ్మర్షివిగాగలవు.

"పాశ్చాత్యమతములు లేక యిజముల లాభమున్నదా"

వారికి పురాతనచరిత్రలు అనుభవమునకు సరిపోవు పవిలేవు. నవీనమార్గములేవి మంచివాఅని వెదకుచు, క్రిందమీదబడుచు, మాదిమంచిమార్గము, మాదిమంచిమార్గమను

చున్నారు. వారి యిజములు గంటకు మార్పుచెందుచున్నవి. గాన యివిభారతదేశానికి పనికిరావు. యీ దేశమున అనేకలక్షలఏండ్లనుంచి సత్యధర్మాదులు, నేను చేసిచూచిన సరిపోవు, అనేకచరిత్రములుగలవు. సత్యధర్మాదులు పూర్వమున, నేడను మంచిఫలమొసంగును. చెడుఫలములిడవు. దుష్టకామాదులు చెడుఫలములిడును. మంచిఫలములిడవు. పేదవారు, ధనవంతులు దేశముననుండురు. పేదవారిలోను, ధనవంతులలోను, అతిక్రూరులుగలరు. అట్టిక్రూరులవిడిచి పేదవారిలో ధనవంతులలో సాధువులకు సాయముచేయదగును. కొందరు పేదవారినిరక్షించి ధనవంతుల నాశముచేయదగునందురు. ధనవంతులులేకున్న కార్మికులుజీవించుట కష్టము. కార్మికులు లేకున్న ధనమార్జించుటకష్టము. భూలోకమునవీరిద్దరుండక తప్పదు. వీరిద్దరిసఖ్యత కుదిరిననాడేసుఖముగల్గును. పూర్వము భారతదేశాన బ్రహ్మర్షిత్వముచెంద ఆహారలోపము లేకుండ చేసికొని సర్వమువిడిచినట్లు, నేడుభూలోకములో రాజ్యమున్నను లెక్కగొనక, దుష్టమార్గాల ధనార్జనచేయుచు కుక్షింభరులై దాన ధర్మ సత్యాదులఫలము కనుగొనుటమాని దేవునిపూజమాని సత్సంతానముగనదగు యౌవనస్త్రీలతో సహచరులై భాషించుచు యిదియే స్త్రీస్వాతంత్ర్యమని కేకలువైచుచు ఆస్త్రీలభర్తలు కొందరదిచూచి విడాకులిచ్చుకొనుచు ప్రస్తుతమిహసుఖముగొనక పరసుఖమును నాశనముచేసుకొనుచున్నారు. కొన్ని రాజ్యముల ధనవంతులకే

గౌరవము. పేదవారికంతగా గౌరవములేదు. యీధనము ఎట్టి దాన ధర్మ సత్కార్యాదులకు వ్యయపరచవలెనో తెలియదు. స్త్రీ స్వాతంత్ర్యమన విడాకులెక్కుడై గృహాశ్రమసుఖము లేక అల్లల్లాడుచున్నారు. ఆమార్గములు మన దేశమునకు పనికిరాక పురాతనమన, 4 వేల యేండ్ల క్రిందటికాలము, అందు గల రాజచరిత్రలు, గృహస్థధర్మములు, ఆశ్రమధర్మములు, సత్యధర్మాదుల స్థిరపరిచినట్లుగలదు. యివి సంస్కృతభాషను గలవు. చాలకాలమీ దేశము పరదేశ భాషజ్ఞులచే పాలింపబడి వారిలక్షణములు, చాలమంది నేర్చుకొనిరి. నేడాభాషజ్ఞులెక్కుడగుటచే వారిగ్రంథాలను వారిని అనుసరించుచున్నారు.

తొల్లిరాజులు, బ్రాహ్మణ, క్షత్రియ, వైశ, శూద్ర సంఘముల నాల్గింటిసిగొని వర్ణముగురిపించుట మొదలగువనులలో నాల్గుసంఘములలో పేదవారిలో ధనవంతులలో దుష్టశిక్షణ, సాధురక్షణ సేయుచు సఖ్యముగా పాలించిరి. వారందరికి గుణకర్మమె ప్రధానముగాని, కులము ప్రధానము లేదు. కులమున చాలకాలమునాటి రాజకీయసంఘము ఏక వృత్తివారు వివాహాదిసంబంధములు చాలకాలమునుండిచేసు కొనుచున్నారు. నేడానామములే స్థిరముగానున్నవి. యీ నామములు కలియుగాంతమువరకు నామమాత్రముగాయుండ కపోవు. కల్క్యవతారము బ్రాహ్మణునికి పుట్టునని కల్కిపురాణమునగలదు. పూర్వకాలమునుండి నేటికలియుగ బ్రాహ్మణక్షత్రియాదులు ఒకటేఅనుటకు వంశవృక్షములు లేవుగాని

జనులనుకొనుటకలదు. రాజ్యమేలువారు, యీకులనామ సంఘములకుదోడైన కొంతవృద్ధిగాంచును. గాని లేనిచో నామమాత్రములై యుండును. వాటి గుణకర్మములు చాలతగ్గి పోయినవి.

పాశ్చాత్యులను అందరూ అనుసరించు చున్నారు. పూర్వము ఒకసంఘము లేనిచో తక్కినసంఘములు సాగవని తమతమ కర్మముల సఖ్యముగాచేసినారు. దానితో రాజ్య మందు సుఖముగలిగెడిది. నేటి నవీనసంఘములకా చెల్మి లేదు. గృహాశ్రమము, భార్యా భర్త, భార్య సహాయములేనిచో కాలముగడపలేరు. దాన పురుషుని వివాహామై పరమేశ్వరుడు భార్యనుకూడియున్నట్లు యిద్దరుయేకముగాయుండిరి. దేవుని చూచియే, భార్యాభర్తలనుసరించిరి. పరమేశ్వరి పరమే శ్వరునేగాని రెండవవానినిగోరదు. అతడునూ పరమేశ్వరినే ప్రేమించియున్నాడు. అట్లు భార్య పరపురుషసంబంధములేక భర్తను దేవునిగాచూచుచు భార్యను దేవిగచూచుచు పూర్వమందెక్కుడుగను నేడుతక్కువగను జరుగుచున్నారు. స్త్రీ భర్తతోనుండి యిల్లు ధన పుత్రాదులందు స్వాతంత్రత గలది, పరపురుషునిగోరుట అను నొకటిమాత్రి మామెకు స్వతంత్రములేదు. అవతారాది పురుషులగనుటకు యీామె సాయమున్నగాని జరుగదు. వ్యభిచారిణియైన దుష్టసంతతి గనును.

దాన భారతీయుడు యావనభార్యను పరులతో

మాట్లాడుటకయ్ను అంగీకరింపడు. అనగా కుటుంబాంగితమగు ననిభయము. వ్యభిచారికాని స్త్రీకి దుష్టులగు అత్త, ఆడ బిడ్డలు లేకున్న నిశ్చింతత. యింటియందు సర్వస్వతంత్రము నేటికిన్నీ పేదవారియిండ్ల, ధనవంతులయిండ్ల జరుగుచునే యున్నది. భగవంతునిచూచియే భార్యాభర్తధర్మములు, సర్వము అభ్యసించి, కొందరు బ్రహ్మర్షులైరి. కొందరుమహర్షి, ఋషులైరి. కొందరుసన్యాసులైరి. కొందరు పూర్వమున నేడునూ భర్తలున్ననూ లేకున్ననూ పరపురుషులతో స్వేచ్ఛావిహారులైయున్నారు. అట్లుండుట భూలోకసహజము. పాశ్చాత్యదేశజులవలె స్వల్పమునకే విడాకులు జరుగు చున్నట్లు భారతదేశమునజరుగక ఎంతోగొప్పచిక్కుగల్గిన నాడు ఒకరి సంబంధము వకరు మానుదురు. గృహాశ్రమ మీతీరున సఖ్యముగనడచుట కనిపెట్టిరి. పేదవారు, ధన వంతులు ప్రతిరోజున పంచయజ్ఞములుచేసి దేవ, పితృ, రాక్షస, ముని, మనుష్యుల తృప్తిచేయువారు.

గ్రామములో పదిమందిధనవంతులు 100 మందికి ప్రతి నాడు భోజనమిడితృప్తిచేయువారు, తక్కువవడ్డీకి ఋణము లిచ్చువారు, కూరగాయలు పేదల కుచితముగాయిచ్చువారు, ధాన్యాదులప్పిచ్చువారు, పేదవారు తమకుదగినకర్మముల సాయముచేసెడివారు. దాన ఉభయులకు సఖ్యతగల్గి మన గల్గిరి. నేటి ధనవంతులు ఆకర్మములన్నియు మానినను భోజనములిడిన స్నేహముండెడిది. ధన ధాన్యాదుల ఋణ

ములియ్యేరు, కూరగాయలుచితముగానివ్వరు, పేదవారుపొంగి యుండవలెనని వారికోరిక. యిట్టిధనవంతు లెంతకాలమో మనజాలరు. పేదవారెదురుతిరిగి దుష్టధనవంతుల లెక్క చేయుటలేదు. వీరినిచూచివారు వారినిచూచివీరు భయ పడుచున్నారు. దుష్టధనవంతుడగుటచే తిండిజరుగుటతప్ప స్వేచ్ఛలేదు. గౌరవములేదు. గాన పూర్వమార్గమున నడి చిన ఉభయులుసఖ్యముగ యుండగలరు.

ఆశ్రమములు:— జీవితము 100 యేండ్లలో 25 యేండ్ల వరకు సత్యమగు బ్రహ్మవిద్యాదివిద్యలు నేర్చుట, పైపాతి కేండ్లవరకు గృహస్థుడై చదివినబ్రహ్మవిద్యాదివిద్యల అనుభ వముచూచుకొనుచు తనప్రారబ్ధమునకు తగిన ధనాదులతో గృహస్థుడై సత్సంతానవృద్ధిచేసి 50 యేండ్లుదాటిన తరు వాత తనసంతతతాను గృహాదిభాగ్యముల విముఖుడై తక్కినజీవితకాలమంతయు వానప్రస్థయత్యాశ్రమము లనగా తపస్సుచే బ్రహ్మస్థిత్వముచెంద అన్నిసంఘములవారు పాటు పడిరి. నేడదివిడిచి, తిరుగుచున్నారుగాన కొంతకాలమున కామార్గమురాకమానదు. యిట్లు భారతదేశము పురాతనపు రాజు, ప్రజలు, భార్యాభర్తలు, పేదవారు, ధనవంతులు ఆశ్రమస్థులుసర్వసుఖములందిరి. నేడాపోల్కిగనిన అల్లఅగును. భూలోకమున అన్ని దేశములు నిముషనిముషమునకుపోవు (యిజముల, మతముల) విడిచి పురాతనభారతదేశధర్మములు చెందిన సుఖవంతులగుదురు. ప్రజలు నాల్గుపక్షములగుట

అనగా ఎక్కువ తెలివిగల మానవులు బ్రాహ్మణులనియు, కొద్దితక్కువ క్షత్రియవైశ్యులు, కొద్ది తెలివిగలవారుశూద్రులుగా విభజింపబడి రాజ్యము సాగుటకును వీరందరిలో దుర్మార్గపక్షము, సాధుపక్షముగుట, శిక్షింపబడుటకు రక్షింపబడుటకునై యున్నది. గాన రెండుపక్షములేగాని ఒకేపక్షము భూలోకమున నేకాలమునసుండదు. ఏమూలనో యేస్త్రీలో దుష్టులకనుచునే యుందురు.

కలాతీతము, సర్వమతాతీతము, సంఘాతీతము, కుల మన భారతమున పూర్వసంఘము. సంఘమున – నేడన్ని దేశములగలదు. రెండునూ గుణకర్మములొక్కటే. పూర్వ బ్రాహ్మణుడు వర్షాదులు కురిపించువాడు. క్షత్రియుదు సైనికుడుగా, వైశ్యుడువర్తకుడుగా, శూద్రుడురైతుగా కార్మికుడుగాయున్నారు. ప్రస్తుతము యింజనీయర్లు, వర్షపునీటిని రైతులకుఉపయోగపరచగలరు. ఆవృత్తులుగల యితరులునూ నేడు సంఘములో సైనికవర్తకులని, రైతు కార్మికులని పిలువబడుచున్నారు. పూర్వకులములు, నేటిసంఘములు, రాజ్యాంగములు, రాజే సంఘములతో పాలించుచున్నాడు. రాజే నేడు ఆవృత్తులసంఘముల పేర పనిచేయుచున్నాడు. భిన్నమతములు రాజునుబట్టివృద్ధిచెందినవి, పూర్వముకులముల దూషించుకొన్నట్లు నేడుసంఘములు, సంఘములు దూషించుకొనుచున్నారు. రాజ్యకాంక్షాపరులే పూర్వము కులవృద్ధిచేసిరి. నేడు సంఘవృద్ధిచేయుచున్నారు. కులములన్నియు వేదోక్త

ముగా నడచునవి. నేడు సంఘములకట్టి కట్టుబాట్లులేవు. పూర్వమేకులమతములవలన లాభము లేదని వేదాంతబ్రాహ్మ ణులునిర్ణయించిరి. అవి జగముజరుగుటకే ఉపయోగమనిరి. "వజ్రసూచకోపనిషత్తు, నిరాలంబోపనిషత్తు" భగవద్గీతలు॥ యిట్టి గుణకర్మములుగలవాడెవడైన వేదాంతబ్రాహ్మణు డనిరి. అన్నిజాతులవారు యీ బ్రాహ్మణత్వసిద్ధిచెందవచ్చు- హిందూమతములో వేదమతము, భిన్నదేవతాపూజలుసాగు టకు రాజ్యాంగములుసాగుటకు బ్రాహ్మణక్షత్రియాది సంఘ ములున్నూ, వాటిధర్మములుగలది. దీన భుక్తిజరుగుచు సన్మార్గమైనస్వర్గమును, ఆధర్మమువిడిచిన దుఃఖముల నరక ములనిచ్చును. ప్రస్తుతము భారతదేశములో యీకుల మతములు రాజసహాయములేనిచో వృద్ధిచెందవు. యిది వరకు కులమను సంఘధర్మమున అలవాటుపడినవారు, ప్రస్తుత సంఘములో చేరి బ్రాహ్మణులు బ్రాహ్మణులకు, రాజులు రాజులకు, రెడ్లు రెడ్లకు, రాజకీయోద్యోగాదికృతుల సాయముచేయుచుందురు. అట్లైన తమకు సహాయులుగా యుందురని వారియూహ. సంఘములవారును తాముబాగు చేయదలచిన సంఘములకెక్కుడు సహాయము చేయుచుందురు, అట్లైన వీరు తమకు సహాయముగానుందురని వారియూహ. కుల సంఘములు రెండును ఒకే అభిప్రాయములో నున్నవి, అది సహజమే. రాజ్యము సంఘములున్నగాని జరుగదు.

డాన రాజు అభిమానముగల సంఘములగాని, కులములగాని పూర్వమును నేడునూ ఉద్యోగాదులపొందుటే గొప్ప తనము. పూర్వము రాజులు రాజ్యకాంక్షులై మతములజేరి సంఘబలము చెంది రాజ్యము లేలుచూ మతయుద్ధము చేసిరి. ఓడినచో మతము, రాజ్యము యోంకిపోయెడిది. కులాతీతము సంఘాతీతమగు మతాతీతమగు భారతమతసారమగు వేదాంతమతమే లౌకికమతము. యిది అభిన్నమతము. యేరు లెన్ని యున్ననూ సాగరమున చేరునట్లు యెన్ని నామములతో పూజించిననూ దేవుడొక్కడే. ఫలమొక్కటే. యిందు సంఘములు పనికిరావు. రాజ్యకాంక్ష లేదు. భగవంతునిపై కాంక్ష, పరోపకారము, రాజ్యశాసనములు, పాలించుడని ప్రజలకుబోధించును. రాజ్యమున్నగాని గృహాశ్రమము జరుగదు. యితరాశ్రమములుసాగవు. గాన రాజ్యమెపుడూ యుండవలయునందురు. దరిద్రజాతకులకు భగవంతుని కృప గల్గుట ఆలస్యముగానూ, రాజయోగజాతకునికి తొందర లోకల్గునని వారియూహ. రాజ్యకాంక్షులు, వర్తకకృషి, కార్మికులు, వేదబ్రాహ్మణాదులు, భూలోకమునగల సర్వవిధప్రజలు ప్రతినాడూ సర్వమునకురాజగు భగవంతుని పూజించి సన్మార్గముతో దిరగవలయునందురు. భిన్నమతములులేవు భూలోకసర్వప్రజలకు దేవుడొక్కడే. వక్కటే విధమగుపూజ. అదినానావిధముల పుష్పాదులతోగాని విడిచిగాని సర్వేంద్రియార్చనచేయుచు భగవంతుని తానొక్కడుగనుండియే చేయుదగును.

భూలోకసర్వప్రజలు యిందుకుకావలసిన సామాగ్రి కొన ధనవ్యయములేదు. అన్నియు తనయందేగలవన భగవ దర్శనకు తగినయింద్రియములు తానూగలవు. యింధు పరమేశ్వరీ పరమేశ్వరరూపుడగు భగవంతుని కృపచెందుట లేక ఐక్యసిద్ధిచెందుటే ముఖ్యకర్మములు. రాజ్యములేలగా ప్రబోధముండదు. అధర్మములువిడిచి ధర్మములనడుచుట ముఖ్యము. అందరికి దేవుడొకడేయగు మతముగాన భూలోక దేశజులకు, రాజులకు, భార్యాభర్తలకు విభేదములురావు. పేదవారికి ధనవంతులకు విరోధములురావు. ఆశ్రమస్థులకు విరోధమురాదు. భగవంతుని సత్ శక్తి సత్కృపసంపాదించుటే తగినగొప్పమార్గము. యిందునడిచి ఆఫలముచెందు వరకుచేయుటే. నిష్కామసత్కర్మములు ఫలముగలుగ లేదని విసుగుచెంది విడువరాదు. అర్ధము తెలిసి ఆచరించుట ముఖ్యము.

" భగవంతుడు సర్వలోకప్రభువు, భగవతిసర్వలోకరాజ్ఞి! "

సర్వలోకముల బాహ్యాంతరగములు అతనిరాజ్యము.

పరాశరహోర:- " జీవానాం కర్మఫలదో గ్రహరూపీ జనార్దనః " జీవులగతజన్మ శుభాశుభకర్మఫలమును వారికై తలిదండ్రులుసృష్టించుటయందు గర్భధారణకాలమందుచేయు శుభాశుభకర్మఫలముకల్పి ప్రారబ్ధమనబడును. ఆప్రారబ్ధ ఫలమును గ్రహరూపియగు జనార్దనుడు తగినట్లు మంచి

చెడ్డలిడి అనుభవింపచేయుచు పాలించుచున్నాము. ఆప్రారబ్ధఫలమున ఋషులు జ్యోతిశ్శాస్త్రముద్వారా తెలిసికొనిరి. అందు పరాశరహోరచాలగొప్పది. సత్యమైనది. దానిలో గ్రహరాజయోగములు పరీక్షించితిని. అట్టిరాజయోగ దశలు అంతర్దశాదులు కేంద్రకోణతృతీయలాభములనున్న గొప్పగాయోగింతురు. లేనిచో కొంతతక్కువగా యోగింతురు. రాజయోగములేని చెడుగ్రహదశలు కేంద్రకోణములనున్న యోగింతురనిచెప్పు సామాన్యులను చాలమందిని చూచితిని. యెట్టిసత్యశాస్త్రమైన హీనులచేతిలోబడునపుడు తప్పులుగా చెప్పబడుచుండును.

సర్వశాస్త్రములు, సత్యార్థములు తెలియ బలహీనులయినపుడు సత్యార్థము తెలిసిన పండితులదరి కొంతకాలముండి అనుభవముగా చూచిన సత్యము తేలిపోవును. యిట్లు 40 యేండ్లుకృషిచేసి యీశాస్త్రముసత్యమని నమ్మిగా ప్రజలకు తెలియవ్రాయగల్గితిని. యీశాస్త్రము ప్రతివ్యక్తియు నేర్చుటమంచిది. తప్పైననేను కవినిగనుక దానినేవ్రాసి యుందును. యీశాస్త్రములో నొకకానీ సంపాదించుట విడిచి యదార్థము తెలియుటకే పాటుపడితిని. వ్యర్థులు ఉపష్కాములగు తలిదండ్రులు అనగా సత్సంతానముగన పాటుపడనివారు జననకాలమైన సరిగాచెప్పలేక జ్యోతిషము తప్పందురు. సత్సంతానముగనువారు గొప్పవాడా తక్కువవాడా పుత్రుడని తెలియుటకు జననకాలమున దగ్గిరవుండి

.వేసికొందురు. యిప్పటిపంచాంగముల యేపంచాంగము సత్యమైనదన అందుగల గ్రహములు పరాశరహోర రాజ యోగప్రకారము యోగించినచో మంచిదనియు లేనిచో తప్పని గ్రహించదగును.

జైమిన్యాది ఋషికృతగ్రంథములు మంచివే ఉదా:- గురుశనులు ఒకపంచాంగమునకు ఒకపంచాంగమునకు 15దినములు తేడాగా రాశి ప్రవేశముచేయుచున్నవి. యిట్లే దినములు, గడియలు తేడాగా అన్నిగ్రహములు ప్రవేశమగును. ఆకాలమున నేకులు పుట్టుదురు. అట్టికాలమున రాజయోగ గ్రహదశలు జరుగుటనుబట్టి పంచాంగముల మంచిచెడ్డలు తెలియును. ఫలమునుబట్టి చెట్టుచెప్పునట్లు గ్రహఫలమును బట్టి సత్యపంచాంగములు తెలియవచ్చును. జాతకముహూర్తభాగములు, ఫలభాగములు గాన యిందుగల ఫలము జరిగిన పంచాంగమే సత్యమైనది. లేనిచో కాదనిచెప్పవలయును. ఒకపంచాంగమురీత్యా రాశినిబట్టి గ్రహములు యోగముగాక రెండవపంచాంగముబట్టి యోగగ్రహములయ్ని రెండుజూచిన పంచాంగముల గొప్పతనము సత్యాసత్యములు తెలియును. రాజయోగదశలనగా గొప్పఫలమిడునవి.

ఆగొప్ప జరుగనిచో మీకే తెలియును. యీశాస్త్రముతప్ప ప్రారబ్ధఫలము పూర్ణముగా తెలియ రెండవమార్గము లేదు. సాముద్రికముగలదుగాని యింతవిచక్షణగా చెప్ప

లేదు. ఉపాసనలచే చెప్పువారుకలరుగాని యింతవిచక్షణగా చెప్పలేరు. అని నాయభిప్రాయము. యీశాస్త్రము ప్రతి వారు నేర్చుకొనుటమంచిది. చెడుదశలశాంతిచేసిన ఆకాల మునగల్లు ఒకదుడుకులుతగ్గి శాంతముగానుండునేగాని గొప్ప రాజయోగమివ్వదు. గాన తలిదండ్రులు చెడుజీవుల మంచి వారిగా చేయశక్తిగలవారు. తలిదండ్రులు సంయోగయజ్ఞము చేయ గర్భమైనకాలమునుబట్టి గొప్పవాడు తక్కువవాడుగా నిర్ణయింపబడును. గాన వారు సత్కాలమున సంయోగ యజ్ఞముచేయుచు పిల్లలనుకనినచో వారును జగమున అట్లు చేసిన గృహస్థులపిల్లలందరు హెచ్చుతగ్గులుగాయున్నను మంచిమార్గస్థులై రామసుగ్రీవాది వానరులవలె పరాపకార ముచేయలేకమనగలరు. పిల్లలకుయింతకన్న తలిదండ్రులుసేయు ఉపకారములేదు. హీనులగని గొప్పధనమునిచ్చినను పోగొట్టురుగు. గొప్పవానినిగాగని ఆస్తిలేకున్ననూ ధనము గొప్పగా సంపాదించగలడు. ఉదా:— రామలక్ష్మణాదులు గాన తలిదండ్రులు పిల్లలనుసృష్టించుటలోనే కడుంగడు జాగ్రత్తపొందవలసియున్నది. రెండవమార్గములేదు. రెండ వమార్గములేదు. తలిదండ్రులే అపకారము పిల్లలనుగను టలో చేయుచున్నారుగాని దేవుడేమియు చేయుటలేదు. గృహస్థుడు భార్యయందున్న భగమును సృష్టికాలమున పొందుచు భగవంతుడగుచున్నాడు. గాన సృష్టికర్తయగు కాలమున వానికి వానిజాతకఫలము చెప్పరాదు. పిల్లలను

కనుటయందు భగవంతుని పూజించుటయందుమాత్రము పేదవారికి ధనవంతులకు స్వతంత్రతగలదు. తక్కిన కాలమంతయు జాతకమునగల్గు ఫలములుజరుగును. అందుచే పేదవారికి ధనవంతులు, ధనవంతులకు పేదవారు వారివారి సృష్టికాలములబట్టిపుట్టుచున్నారు. మానవుడు పుట్టిననిమిషమునుండి జాతకమేపోవువరకుపనిచేయును. గాన తలిదండ్రులు చేసినకర్మమునకు, జీవునిపూర్వకర్మమునకు దగినఫలములిచ్చి రాజ్యమున ప్రజలకు రాజువలె భగవంతుడు జగములేలుచున్నాడు. మంచిజీవుడయ్యు దుష్టజీవుడయ్యు తలిదండ్రులు చెడ్డవారైన దుష్టులుగానే పుత్రులుపుట్టుదురు. మంచివారైన మంచిజీవుడు మరింతమంచివాడుగాను దుష్టుడు మంచివాడుగానూపుట్టును. గాన యీజగము బాగుచేయవలెనన్నగృహస్థులగు తలిదండ్రులే బాగుచేయగలరు. యితరులవల్లగాదు. యితరులవల్లగాదు. రాజు, గురువు, తండ్రి, తల్లి నీతిబోధింతురేగాని హీనుని గొప్పవానిగాచేయలేరు. రాజు గొప్పవుద్యోగమిచ్చినను హీనుడుభరించి పాలించలేడు. నేను చెప్పినవాక్యము పండితులు పామరులు, మరిమరి విచారణ చేయదగును. రాజైన తనరాజయోగకాలమున జనులకుపకారముచేయుచు, అంబరీషరాజువలె బ్రహ్మర్షిగామార, కడుంగడుప్రయత్నించిన సిద్ధిగల్గును. తక్కిన వర్తకులు, రైతులు యిందాదులపూజించి వర్షాదులుగల్గించు వేద బ్రాహ్మణులును తమతమకర్మములుచేసికొనుచు భగవం

తుని పూజించదగును. చెడుప్రారబ్ధముగలవాడు శాంతి చేయించుకొనుచు సత్సంతతిగనుట భగవంతుని పూజించుటకుమాత్రము ప్రతివానికి స్వతంత్రముగలదుగాన అవి మాత్రము చేసి, దానగల్గు ఫలసహాయము చెందదగును. తక్కిన యేపనులుచేసినను లాభమిడదు గాన అతడు అన్న వస్త్రాదులకుమాత్రము చూచుకొనుచు లేనివేళల వ్రతోపవాసముల ఋషులవలె దేవునిపూజించి బ్రహ్మర్షిఅగుటకే ప్రయత్నించుట గొప్పమార్గము. డబ్బులేమిచే దొంగతనము మొదలగుదుష్కర్మములు చేయరాదు. యిట్లు జగములోనందరుగాని, మూడువంతులుగాని భగవదర్చనపరులు వృద్ధియైనచో జగము వైకుంఠమువలె ప్రకాశించును.

## "ప్రారబ్ధము"

ఓ మనుష్యుడా! నీవుచేయుప్రయత్నములు ఫలింపకుండుటయే అగోచరభగవంతునిచే అగోచరప్రారబ్ధఫలము గల్గుటయని తెలయునది. ఎవ్వరూగానరారు. తనప్రయత్నములు విఫలమగును. దీనింబట్టి అగోచరముగా ఎవరో వుండి చేయుచున్నట్లు తెలియుటలేదా! బ్రహ్మర్షివైన యీ ప్రారబ్ధఫలబాధావిముక్తుడవై నీవున్నస్థితిలో ఆనందముననుండవచ్చుగాని లేనిచో ప్రారబ్ధఫలముతప్పకొన నీతండ్రి నీతాత, నీతరముకాదని ముమ్మాటికినమ్ముము. గొప్పయోగముగలవాడు హీనునిచూచి హేళనచేయును. తనకు

హీనకాలముగల్గిన పనులహేళన చేయును. గాన భగవంతునికి సర్వలోకములు రాజ్యము. అందరిని ప్రారబ్ధకర్మఫలముచే పాలించుచున్నాడు. అతనికై చేయు పురుషప్రయత్నములచే కొంతశాంతినిచ్చుచున్నాడు. భగవంతునివిడిచి చేయుకర్మములన్నియు ప్రారబ్ధముమంచిదయినకాలమున ఫలించును. లేనికాలమున యెట్టిమంచిపురుషప్రయత్నములు పూర్ణముగా ఫలించవు. గాన భగవంతుడు ప్రారబ్ధము పురుషప్రయత్నములరెంటిని పాలించుట సత్యమని తెలియుము. యీ శక్తి యితరులకులేదు. దాన దేవుడున్నాడని నమ్మిపూజించుము. ప్రారబ్ధము తెలిసికొనినందున చెడుకాలమున శాంతి చేసుకొనుటకు మంచికాలమున సర్వకార్యసిద్ధినొందుటకు లాభకారి. ఎవరిప్రారబ్ధమువారు తొలగించుకొనలేక పోయిననూ యితరసహాయమున తమప్రారబ్ధమును చాలవరకు తొలగింపజేసికొనవచ్చునని నాయభిప్రాయము.

లోకములో రాజులు, గురువులు, తలిదండ్రులు, స్నేహితులు, వర్తకులు, రైతులు, పురుషప్రయత్నమును చేయువారుమాత్రము అయియున్నారు. మంచిపురుషప్రయత్నము చేయువారినిమాత్రము తమదగ్గరకు చేరనిత్తురు. లేనిచో దూరముగాగెంటుదురు. మంచిపురుషప్రయత్నమునకు తగినఫలము తామివ్వలేరుగాని ఫలము చెప్పుదురు. కొద్దిసాయముచేతురు. అనగా మంచిపురుష ప్రయత్నము గలవానిని పాలించుచున్నారు. యితరులకై చేసిన పురుష

ప్రయత్నమునకు తగుఫలము అతడిప్పుడు. పొందినవాడిచ్చు నో లేదో యిచ్చునరకు తెలియదు. గాన నిష్కాములై పరోపకారము చేయును.

భగవంతుని పూజించిన, భగవంతునినుండి తప్పక ఫలముగల్గగలదు. యీమార్గములో పరులనుండి, ఫలము గల్గినను, లేకున్నను, కష్టముండదు. దేవునికై చేయు, నిష్కామపురుషప్రయత్నము శాస్త్రమార్గమున నడిపింపదగును. లోకములో ఒకమానవునిపూజించి గౌరవించిన, అతడు తగిన, గౌరవము మరలయిచ్చునుగదా! మరియు మానవులు కైవల్యమార్గముమాని, యిహభోగ, కర్మఫలము. సిద్ధింపవలయునన్న—

గీత:— 4అ. 12 శ్లో॥ కాంక్షంతః కర్మణాం సిద్ధిం యజంత ఇహ దేవతాః। క్షిప్రంహిమానుషే లోకే సిద్ధిర్భవతి కర్మజా" యీలోక కర్మఫలసిద్ధి గావలయునన్న శాస్త్రీయముగా యింద్రాది దేవతలపూజించిన త్వరలో కర్మఫలము గల్గునని శ్రీకృష్ణనిర్ణయము. కాని మానవుల సాయమున అట్టిపనులుగావచ్చునుగాని పూర్ణముగాకావు. యింద్రాది దేవతల సాయముగోరుట వేదమార్గము. దేవునిసాయము గోరుట, వేదాంతమార్గము. ఓ మనుష్యుడా! తెలుసుకొని చరింపుము. దేవుని, దేవతల సాయములేని నీవు మంచి మానవులసహవాసమున నైన కొంతబాగుపడగలవు. మనుష్యుడా నీవు దుష్టసంతానవృద్ధిచేసి ధ్యాన తిండిలోపమైన,

"దేశములో పరులను, రాజులను, పీడించువారిగా తయారు చేసి, నీకు, నీసంతతికి, యిహపరములు లేకుండ చేయుచున్నావు. నీకుతగునా! నేను చెప్పినది విచారణ చేయుము. రామాయణ, భారతముల, దేవుని, యింద్రాది దేవతల సహాయమున, సంతతివృద్ధిచేసి తల్లిదండ్రులైనవారు, యిహపర సుఖమందినట్లు వినుట లేదా. నీవు పురాణములు చెప్పచూ, వినిపించుచూ, దుష్టసంతతిగనుటయు, దుర్మార్గముగ నడచుటయు జూడ కంసునితల్లితో, పద్మపురాణమున రాక్షసుల మగుమేము, వేదాదులు చదువుదుముగాని, ఆధర్మముల ఆచరింపము. అధర్మములో నేచరింతుమని చెప్పినాడు. గాన నీ వెవరవయితివో గ్రహించి ఆ అధర్మమార్గము విడిచి ధర్మమార్గమును కొద్దిగానైన రుచిచూడదగునని నా అభిప్రాయము.

దాన కొద్దిసుఖమైనగాంతువు. లేనిచో యిహపర సుఖములొందవని నమ్ముము. పూర్వఋషిగ్రంధములు కలిలో ఫలమిడవనుట చాలతప్పు. ఆచరింపకుండు టేకలి. ఆచరించిన ఫలము పూర్వముకన్న ఎక్కువ పూర్ణముగా గల్గుననిగలదు. నీవాగ్రంధములకు సత్యార్థము చేయలేకయు, యితరులవద్ద, సత్యార్థము తెలియకుండుటంబట్టియు, గ్రంధములుతప్పని తేలికగా పల్కుచున్నావు. యికనైన దుష్టుడా! పెడవాదముమాని ధర్మమార్గమున నడువుము. ప్రస్తుత భారతమున కాంగ్రెసు, కమ్యూనిష్టులు, సోషలిష్టు, ప్రజాసోషలిష్టు,

ప్రజాపార్టీ మొదలగుసంఘములవారు, కులమతములు ఉండ కూడదనుచున్నారు. వీరు రాజ్యకాంక్షులై, కులమతములు లేచిన తమ సంఘమున కేమిహానిగల్గునోయని చెప్పెదరుగాని రాజుసహాయమున్నగాని అవి లేననేసంగతిని గ్రహించలేరు. మరియు అవి పాతిసంఘములు. అందు ధర్మములు నామ మాత్రముగానున్నవి. గనుకనే ప్రజలీకొత్తసంఘములచేరు చున్నారు. వీరందరూ అహింస, సత్యధర్మమార్గస్థులై, రాజ్యకాంక్షులైనచో తాముసుఖమొందుచు. పరులకుసుఖ మిడగలరు. కాంగ్రెస్ సంఘమును, రాజ్యకాంక్షగలదేగాని పైపక్షములకన్న మాధ్యపానని షేధము, సత్యాహింసలు, ప్రతి వాడూ పొందవలయుననుచున్నది. కొందరు నిజముగా ఆచరించువారును యీసంఘమునగలరు. కొందరు రాజ్య కాంక్షులు, ధనకాంక్షులు యిందుజేరి సేవకులుగా శాసన సభాసభ్యులుగయుండి అధర్మమున నడచుటచే యీసంఘ మున అధర్ములున్నారని యితరసంఘము లనుచున్నవి. యిందుగలసేవకులు సత్యాహింసాది మార్గస్థులైనచో రాజ శాసనప్రకారము మద్యపానాది దుష్కర్మములు మూడు గంటలలో దేశములోలేకుండ చేయగలరు. కొందరైనను శ్రద్ధతో శాసనముపాలించువారున్నారు. గనుకనే కొందరు దుష్టులు శిక్షింపబడుటచూచి మరికొందరు దుష్కర్మముల చేయ భయపడుచున్నారు.

వీరు చెప్పెడిది సత్యాహింసలు రెండునూ ప్రజలు,

సేవకులు, శాసనసభ్యులు, వాటికిచెప్పిన ఫలము గల్గువరకు ఆచరించిన ప్రపంచవిజేతలయ్యెదరు. అన సర్వసఖ్యతి. జయము గాంతురు. కాంగ్రెసువారు మతములున్న కలహములు గల్గునని వానినివద్దనిరి. భిన్నమతములున్న వారు చెప్పినట్లే జరుగును. గాని భారతమున నాల్గువేలయేండ్ల క్రితముననే కులాతీతము, మతాతీతము, సంఘాతీతము, అగు వేదాంత మతము లేక భగవన్మతము, లేక లోకైకమతము, భగవత్కాంక్షులు స్థాపించిరి. అందులో అనేకులాచరించి ఫలములందిరి. వీరికియితర, మత, కుల, సంఘసంబంధముండదు.

వేదాంతమున చెప్పబడునది బ్రహ్మవిద్య. అనగా భగవంతునిగూర్చి చెప్పువిద్య. దీనియందు విద్వాంసుడై, బ్రహ్మర్షియై జనకుడు నిష్కామముగ, రాజ్యమేలి ప్రజలకు సౌఖ్యముగల్గించె. ఆరాజ్యముననె నిష్కామముగ ధర్మవ్యాధుడు ప్రజాగూపుడై తనవృత్తినుండి జీవించుచూ బ్రహ్మత్వసిద్ధింగాంచి వేదబ్రాహ్మణులకు గురువై ఆనందమునచరించె. భారతములో బ్రహ్మత్వసిద్ధిగల తులాజాజుడనువైశ్యుడు ప్రజారూపమున నిష్కామముగా విశేషధనాదులుఆర్జించి, లోకకళ్యాణముచే, చరించె, కాన రాజ్యకాంక్షులైనను, ధనకాంక్షులైనను, వృత్తికాంక్షులైనను, ధనవంతులైననూ, పేదవారైననూ, బ్రహ్మవిద్యావిద్వాంసులై, నిష్కామ సన్మార్గమున సత్యాహింసాదులతోనడచువారైన తమజాతకమునకు తగినస్థితులలో శాంతులై పరోపకారులై ధర్మ

రక్షణచేయుచు జనక, ధర్మ. వ్యాధాదులవలె నిత్యానంద ముతో చరింపగలరు. గాన భారతదేశమున నేమి, యితర దేశమున నేమి, నానావిధప్రజలు భగవతాకాంక్షులై రాజ్య కాంక్ష, ధనకాంక్షలలోనున్ననూ, నిష్కాములై లోకక ల్యాణముచేయువారైన అందరు సౌఖ్యముల ఆనందమునొన గలరు. ప్రారబ్ధము చెడుగానున్నవానికి నాల్గుఎకరములు యిచ్చిననూ పండదు. కాని అర్ధనా, అణా, ఒకపూట భోజ నము, వస్త్రకులు, రైతులుయిత్తురేగాని, అతనికి దరిద్ర శాంతిగల్గదు. భగవంతుని శాస్త్రీయముగ పూజించిననూ బ్రహ్మర్షిదయపొందినను, ఆచెడుప్రారబ్ధమును శాంతింపజేసి సుఖముగా నడుపగలరు. యితరులు చెడుప్రారబ్ధఫలమును సుఖముగాచేయు లేరని నాయూహ. గాన భగవంతునిపూజిం చుచూ, బ్రహ్మర్షులుగా మారుటకు తగుకృషిచేయుచు ఏకాంక్షులైయున్నను, నిష్కాములై లోకకళ్యాణముచేయుట అభ్యసించువారు, అన్ని సౌఖ్యముల తమరున్నస్థితిలో పొందుచు, ఆనందమునచరింతురని నా అభిప్రాయము. గాన సర్వదేశజులు, ప్రతిదినము లోకైకరాజగు భగవంతుని పూజించుటయుత్తమమార్గము. రాజర్షికి అప్పటప్పట దేవుని దర్శనముగల్గును. దాన అతడు కొంతచెడు ప్రారబ్ధమును బాపుకొనగలడు. ఋషికిసామీప్యమున దర్శనమగుచుండును. దాన అర్ధభాగప్రారబ్ధఫలమును తొలగించుకొనును. మహర్షి నిత్యమూదేవుని అంతటాజూచువాడగుటచే సారూప్యము

చెంది మూడువంతులు చెడు ప్రారబ్ధమును దాటును. బ్రహ్మర్షి అంతటనూ పాలించు భగవంతుని అంతటనూ చూచుచూ తనయందు జేర్చి అర్చించి అర్చించి తుదకు బ్రహ్మైక్యసిద్ధి చెంది బ్రహ్మర్షియనబడును. ఇతడు సర్వదుష్ట ప్రారబ్ధముల బాపగలడు. అనుభవింపవలెననియున్న అనుభవించును. అతని యిష్టముగా ప్రారబ్ధము నడచునని శాస్త్రములు చెప్పుచున్నవి. బ్రహ్మర్షి ప్రారబ్ధముపోవలెనను కాంక్షతో నుండడు. అనుభవించుచుండును. ఒకవేళ తనకు యిష్టములేనినాడు దానిని బాపుకొను శక్తివంతుడై యుండును. ఎంతచిన్నస్థితిలో నున్నను, పెద్దస్థితిలోనున్నను నిత్యానందముతో నుండును. బ్రహ్మజ్ఞానముగల్గుటకు పూర్వముగల్గు ప్రారబ్ధము అనుభవించుచుండును. (అనగా పుట్టినజాతకస్థితి అని భావము) అది చెడుదైనను, అతనిని బాధింపక ఆస్థితిలో గౌరవము జయము, సుఖముగానడచును. ధనము వృద్ధి ఎక్కువగాగాదు. గాన విచారింపడు. కాలము నిత్యానందమున జరుగుటయే అతడు ఆశించినది. అదిమాత్రము తప్పక ఫలించును. బ్రహ్మవిద్యాభ్యాసకునకు గొప్పజాతకుడైన రాజయోగ కాలమున బ్రహ్మర్షిత్వసిద్ధిగల్గును.

చెడుజాతకుడైన నానావిఘ్నములుగల్గును. విసుకక రసాయనాదులు రోగహారమునకు ఆయుర్వృద్ధికిదినుచు బ్రహ్మవిద్యాభ్యాసము చేయుచున్న కొంతఆలస్యముగా సిద్ధి గల్గగలదు. మహాపాపులైనను, మహాపుణ్యులైనను భగవం

తునిపూజింప అర్హులైయున్నారు. అతనిదయనొందు అందరు అర్హతగల్గియున్నారు.

భగవద్గీత॥ 2 అ:- యావానర్థ ఉదపానే సర్వతస్సంప్లుతోదకే, తావాన్ సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః" చుట్టూనీళ్ళునిండిన నూయి ఎంత ఉపయోగమో జ్ఞానియగుబ్రాహ్మణునికి అనగా వేదాంత బ్రాహ్మణునికి వేదములయందు అనగా స్వర్గాపేక్ష దేవతలపూజించు కర్మభాగమునందు అంతేయుపయోగము. యీవేదము కులమను సంఘమునకు చెప్పబడినది. దీనినిగైకొన్నవాడు వేదబ్రాహ్మణుడు. మిగిలిన క్షత్రియ, వైశ్య, శూద్రులు వేదోక్తమార్గస్థులే అయియున్నారు. వీరందరు సకామమార్గస్థులు. యివి జగము జరుగుటకు అంగములుగా కృష్ణుడు చెప్పి నిష్కామకర్మము బ్రహ్మత్వసిద్ధి, సర్వజాతులవారు పొందదగుననియు, వారు వేదాంతబ్రాహ్మణులనియు, కులాతీతులు, సంఘాతీతులు, మతాతీతులని చెప్పెను.

డిటో 3 అ:- 30శ్లో॥ నేనుచెప్పిన వేదాంత బ్రాహ్మణమతము, లేక లోకైకమతము. ఆచరించువారు కైవల్యము గాంతురనియు, యీమతమన్న నిందించువారు, చెడుదురని శ్రీకృష్ణుడు చెప్పెను. యీలోకైకమతము భారతీయులకు క్రొత్తదిగాదు. పూర్వులాచరించినదే అయియున్నది. పాశ్చాత్యులకుమాత్రము క్రొత్తదిగానుండును. పైబ్రాహ్మణాది నాల్గుసంఘములు, దుష్టపక్షము, సాధుపక్షమని, రెండు

పక్షములుగా శ్రీకృష్ణుడు చెప్పెను. తలిదండ్రులు దుష్ట పుత్రులశిక్షించి, సాధుపుత్రుల వృద్ధిచేతురు. గురువు దుష్ట శిష్యులశిక్షించి, సాధువులకు సాయపడును. రాజుదుష్టుల శిక్షించి సాధులకు సాయపడును. అధర్మప్రజల, ధర్మజ్ఞులు గర్హించి సాధువులకు సాయపడెదరు. యీదుష్టులు స్థూలము విడిచినతరువాత. సూక్ష్మశరీరులుగా నున్నపుడు యముడు శిక్షించును. సాధువులకు యిందిరుడు సాయపడును. అన్ని లోకములును, దుష్టులశిక్షించుచు, సాధువుల భగవంతుడు రక్షించుచుండును. భూలోకమున పుట్టినదాది దుర్మార్గము అన్నిచోట్లశిక్షింపబడుచు నేయున్నది. సన్మార్గము సుఖము చెందుచునే యున్నది. యిందుగొప్పదియగు నిష్కామ సన్మార్గ భగవత్పూజ బ్రహ్మత్వమిచ్చుచునేయున్నది. అనుభ వముపై వీటిశక్తులు తెలియబడకమానవు. గాన దుర్మార్గ మున మానవులు ఎన్నడును నడవరాదు. సత్కర్మమార్గ మునగాని, నిష్కామమార్గమునగాని నడచుట ఒకదాని కన్న ఒకటిగొప్పఫలమిడునవి. వీటిఫలములు నీవుచూడ వలయునన్న ఒకనిని కారణములేక కొట్టిన-చో అందరు నిందిం తురు. తిరిగి వాడు అపకారముచేయును. యిదిదుర్మార్గము. ప్రత్యుపకారముగోరి ఒకనికి ఉపకారముచేయుము. తిరిగి అతడు కొలదికాలములోనే స్నేహభావమున ఉపకారము చేయును. యిది సకామసన్మార్గము. నిష్కామముగా ఒకనికి ఉపకారముచేయుము. అతడు నీకులొంగి అనేక సెవ

కారములు చేయును. గాన భగవంతుని నిష్కామసన్మార్గ
మున సర్వకర్మఫలార్పణ జేసి పూజించిన అతడనేక ఉపకార
ములు చేయగలడు.

గాన లోకైకమత్యము సర్వజనులు ఆచరించుటకు తగి
నది. పురాణదంపతులు, స్వాంత్రులు, స్వాయంభువులగు పర
మేశ్వరీ పరమేశ్వరులే భగవంతుని రాజ్యసృష్టి ప్రథమ
మున నేగలరు. అతనిజూచియే, రాజు, ప్రజలు, రాజ్యస్థాపన,
గృహరాజ్యమును, భార్య భర్తలధర్మము, భూలోకప్రజలు
నేర్చిరి. రాజుధర్మజ్ఞుడైన ప్రజలు ధర్మజ్ఞులగుదురు. (దుష్టు
డైన దుష్టులగుదురు) అట్లే గురు, జననీ, జనకులు దుష్టు
లైన శిష్యులు, పుత్రులు దుష్టులగుదురు. భగవంతునకు
యీ రాజ్యనిమిత్తమేమిఅని పల్కరాదు. అతడుస్వాయంభువై
రాజ్యముస్థాపించెను. అతని శాసనముప్రకారము జీవులు
నడవదగునేగాని, యెదురుప్రశ్న వేసిననూ లాభముండదు.
ప్రస్తుతము కాంగ్రెస్ వారు రాజులైరి. రైతుకు రాజుకుమధ్య
ఉపరాజ్యములు, జమీందారులు యుండరాదనిరి. అయ్యో
పూర్వమునుండి ఉన్నామనిరి. మాకిష్టములేదని శాశించిరి.
భయపడివదలుకొనిరేగాని యెదిరించిరా? వకవేళ యెదిరిం
చిననూ లాభముండదుగదా! అటులే భగవంతుని శాసన
ధిక్కారము చేసిన అతడుదుర్మార్గమున నడువరాదనెను.
నడచిచూడుడు, నానాకష్టముల పాలయ్యెదరు. రావణహిరణ్య
కశ్యపులకన్న గొప్పదుర్మార్గులుపుట్టరు. వారే ఆమార్గాన

నాశనమొందిరి. యిక అల్పగుష్టులమాట లెక్కింపదగునా. భగవంతునికీగొడవయేమిటన్న అతడురాజుగా యున్నపుడే గొడవ యుండవలయునుగదా! రాజులేకున్న నీయిష్టము వచ్చినట్లు దుర్మార్గము సాగింపవచ్చునుగదాయని నీభ్రాంతి కదా! దుర్మార్గముమానమన్న నీకంతకష్టమేమి. ఓ మనుష్యుడా! సామాన్యుడవు నీప్రశ్నలకు జవాబుచెప్పగలవారున్నారు. గాని నీతోవాదించిన నిష్ఫలవాదమగునని మానుదురు. దాన నీవుగర్వముతో దిరుగుచు వార్ధక్యమునకు అనుభవముచెంది సన్మార్గమున నడపనైతివిగదా అని యేడ్చెదవు. నీకు వాదమెందుకు? ప్రథమజననియగు ప్రకృతి మాతదరిచేరి చూడుము. ఆమె చీకటి వెలుతురుగలిగించును. చీకటివాసమె దుర్మార్గము. యిందు వసించునవి రాక్షసులు పిశాచులు, దొంగలు, తేళ్లు, పాములు మొదలగు దుష్ట జంతువులు. నీవు పగలు మూలదాగి రాత్రిచీకటిలో కొంత కాలమువశించిన దానిఫలము నీకు తెలియును. కాంతిలో పగలువశించిచూడుము. అందు మనుష్యులు, గోవులు మొదలగు సాధుజంతువులు చరించును. వారికిగల్గుసౌఖ్యమే నీకు గల్గును. చెట్లు ఫలములిడి, సూర్యుడు చంద్రుడు కాంతి నిచ్చి నిష్కామోపకారము చేయుచున్నారు. ఆచెట్లచుట్టు ప్రజలుదిరుగుచు వాటికి తగుసహాయము చేయుచున్నారు. సూర్యచంద్రుల హిందువులు, మహమ్మదీయులు, క్రైస్తవులు గౌరవముగా నమస్కారములు చేయుచున్నారు.

వారులేనిచో జగముచీకటియై, నాశనమగునని భయముతో వారు నిత్యముండగా ఋషులు ప్రార్థించుచున్నారు. గాన వీరినిచూచి నిష్కామకర్మప్రకారము పరులకుచేసిచూడుము. ఫలము తెలియును. దాని చూచియేదిమంచిదో నీకు తెలిసి మంచి అభ్యసింతువు. ఆవు నీకుపాలిచ్చుచున్నది. ప్రత్యుప కారము నీవు అది తిరగనక్కరలేకుండా అదిజీవించుటకు తగిన ఆహారాదులు, నీళ్ళు దానికాళ్ళదగ్గిర పుంచుచున్నావు గదా యిదే సత్కామసన్మార్గము.

నిష్కామ సత్కామసుఖము, దుర్మార్గకష్టము, ప్రకృతివలననే నీవు తెలిసికొనగలవు. వీటినే ఋషులుపుస్తక ములుగావ్రాసిరి. తెలిసికొనకుండుట నీతమోగుణవృద్ధియే కదా దానిని రజోగుణమువిడిచి సాత్వికగుణవృద్ధి నీవుచేసి కొనిన సర్వసత్యము నీదరిజేరి తెలియబడును.

## రాజ్యపాలన

దేవుని రాజ్యపాలనముజూచి రాజ్యము పాలించుట మొదలుపెట్టిరని నాయూహ. రాజు దేవునివలె నిష్కామ సన్మార్గుడై ప్రజలకు నిత్యకళ్యాణముచేయుటజూచి ప్రజలును అతనివలె గృహరాజ్యమున, నిష్కామసన్మార్గులై తమపాలన ప్రజలకు నిత్యకళ్యాణము చేసిరి. రాజశాసనముచూచి భయ పడి అందరు ధర్మమున నడచుకొనిరి. యిందురాజుపై ప్రేమతక్కువ. భయమెక్కువగలదు. అతడుభార్యను పర

పురుషసంబంధములేని అంతఃపురమునసుంచి సత్సంతతిగను వారు. అట్లే ప్రజలును పరపురుషుల సంబంధము భార్యకు లేకుండాచేసి సత్సంతానముగని బాగుపడిరి.

స్త్రీలకు పరపురుషసంపర్కముదక్క మిగిలిన ధనాది స్వాతంత్ర్యము భర్తతోపాటు భార్యకునూ పూర్ణమే గలదు. ఇదికొత్తగాను. పరపురుష సంబంధముతో స్త్రీలు చెడుదురనియు, దుష్టసంతతివృద్ధియగునని, గృహస్థాశ్రమ భంగమగుననియు, గ్రహించునది. నేమనూ అట్లుచేసిన భూలోకము బాగుపడగలదు.

## గృహరాజ్యపాలన

పరమేశ్వరీ పరమేశ్వరరూపుడగు భగవంతునిచూచి భార్యాభర్తలు నడువసాగిరి. భర్తనుదేవునిగా, భార్యను లక్ష్మిగా చూచుచు నిష్కామసన్మార్గమున లోకకళ్యాణముచేయుచు, భగవంతుని అపరరూపులగు యీశ్వర దుర్గల, విష్ణుల, లక్ష్ములవంటి బలవంతులగు సత్పుత్ర సత్పుత్రికల కనుచు, భగవదర్చనచేయుచు తుదకిద్దరు బ్రహ్మర్షిత్వము అనగా పరమేశ్వరీరూపము భార్యయు, పరమేశ్వరరూపము భర్తయుపొంది సర్వసుఖములందు చున్నారు. వీరు మొదటిరకము భార్యభర్తలు. దైవీసంపద భార్యయైనచో దరిద్ర ధనవంతముల వొకరికొకరుసాయము చేసికొనుచు భగవంతునిపూజించి సత్సంతానముగనుచు బ్రహ్మత్వముచెందగలరు. యోగ్యమగుభార్య, భర్తగత

జన్మకర్మమునబట్టి దొరకును. పీరు రెండవరకపు భార్యా భర్తలు.

మొదటివారు దేవకీవసుదేవులు, వశిష్టారుంధత్యా దులు. రెండవవారు నలదమయంత్యాదులు. యిక ఆసురీ సంపద భార్యాభర్తలు మూడవరకపువారు. ఒక రాజ్యమున పీరిని లేకుండాచేసిరిగాని భూలోకమంతయు జరుగలేదు. పీరు భూలోకమున ధర్మనాశనముచేయుటకై పుట్టుటసహ జము వీరికి వ్యభిచార మెక్కువప్రీతి. భూలోకమానవజన్మ ముచే వీరు బాగుపడదగినది. గాన వారు పైవారివలె నడి చిన వీరును బాగుపడుదురు. లేనిచో వీరితరులను చెరిపి తాము నానాకష్టములపాలయ్యెదరు. రాముడుసీత, నలదమ యంతులు, పాండవులు ద్రౌపతివలె భార్యాభర్తలునడచు కొనుటకే రామాయణ భారతములు వ్రాయబడినవి. అవి తప్పని ఆసురీసంపదవారందురుగాని వానిలోనున్న ధర్మ ముల ఆచరించినచో వారాపల్కులు పల్కరు. భారత మున పూర్వము పరపురుషుడుచేరిన పిల్లలు భార్య చెడుదు రని అల్లునికిపెండ్లి చేసినవెంటనే ఆపిల్లను భర్త వెంటపంపి నట్లు వివాహాదిమంత్రిలనుగలవు. రాముడుసీత — ద్రౌపది పాండవులు పెండ్లిఅయ్ని వెంటనే కూతుండ్ల అల్లుండ్రవెంట పంపిరి. గృహస్థుడు కూతుండ్రి భార్య వ్యభిచారముకను గొనుట కష్టముగాన పరపురుషుల చేరకుండాచేసిన జరుగ దని వారియూహా. నేటికిని భారత దేశమున పతివ్రతకున్న

గౌరవము వ్యభిచారిణికి లోకమేమన్ననైనను లేదు. పతి వ్రత భర్తతోనే ధర్మార్థకామప్రాప్తిగలిగినను లేకున్నను అతనిని విడువక సాయపడుచు సేయుచుండును. వ్యభిచారిణి పరభర్తతో కామతృప్తి చెందినవో భర్తనువిడిచి పరుని చేరును. ధనాదులు నాశనమగును. పిల్లలరక్షించువారుండ రని వ్యభిచారమున్న భారతీయులు కృతయుగాదినుండి గర్హించుచునేయున్నారు. దుష్టునకు పిల్లనివ్వరాదు. దుష్టకన్యను పెండ్లాడరాదని ఋషులునొక్కివ్రాసిరి. భారతదేశగృహస్థ ధర్మస్థితి భూలోకవాసులు చూచి, సత్సంతానముగనుచున్న దుష్టులు బహుస్వల్పమై ధర్మమార్గముసాగ సుఖపడుదురు. ఆర్యా - తమరు చక్రవర్తిని ఎందుకుకన లేదని నన్నొక యం. ఏ. ప్రశ్నించెను. ఆర్యా నాకు ఆడపిల్లలుపుట్టుచుండ మొగపిల్లలు కనుట కేప్రయత్నించితిని.. మొదట సామాన్య నమ్మకముతో చేసితిని. మగవాడు పుట్టెను. మరలమరల చేసితిని మరిద్దరు మగపిల్లలు పుట్టిరి. సత్యమార్గముగాని నడచుచు నమ్మకము లేకున్నను సత్యఫలమే గల్గును. దీనితో యెక్కువనమ్మకముగల్గి గొప్పవారి నేపుట్టింప యత్నించితిని. గాని సంతానమాగెను. అపుడాలోచించి భారతశాస్త్ర ప్రమాణములు గొప్పవని లోకములో సాధువులగు గొప్ప వారెవరికిపుట్టిన తలిదండ్రులకు పరులకు ఉపకారముజరుగు నని యెంచి లోకకళ్యాణసంతానరాజము, లౌకికకళ్యాణ గృహస్థుడని రెండుపుస్తకములు లోకకళ్యాణము సత్సంతా

వశమువల్ల నేగాని యితరమున స్వల్పలాభము గలదని గట్టిగా వ్రాసితిని.

పాశ్చాత్యసైన్ను రాళ్ళురప్పలపై చేసిన త్వరలో ప్రత్యక్షమగును. యిది 2, 3 యేండ్ల కొకసారి సంతానము గలుగును. అందు భార్యాభర్తలిద్దరేకమైన వ్రతముననున్న గాని యీసత్సంతానము గనలేరు. గాంధారి, కోపాసూయలచేత మర్యాధనాది దుష్టులగనెను. భార్యాధనాపేక్ష మైన తిరస్కారాదులిచ్చి శాంతిగలదానినిచేసి అగస్త్యుడు లోపాముద్రయందు సత్సంతానము గనినట్లు గనవచ్చును. పూర్వమందనేక ఋషులు నొక్కి వ్రాసిరి. నేనును చాల మందికి నొక్కి చెప్పితిని. దాన మంచిజాతకులు పుట్టినట్లు చెప్పిరి. భార్యవ్యభిచారిణియైన ధర్మముతప్పును. లేనిచో ధర్మముజయించును. వ్యభిచారిణినిగూడా రెండవపురుష సంబంధము లేకుండా చేసి సంతానముగనిన మంచివారేగల్గుదురుగాని పతివ్రతసంతానముతో తుల్యులుగారు. గాన నీవెల్లను సంతానమును ముసలితనమునకు సహాయమునకు కన కమానవు. నేనుచెప్పినది సత్సంతానమైన నీకుమరింతసుఖము గదానిచెప్పుటతప్పా? గృహస్థధర్మములు సత్సంతానవిషయములు బ్రహ్మవిద్య సంస్కృతములోయున్నట్టు ఆర్యా! తమరు చదివిన "యం. ఏ." యింగ్లీషుపుస్తకాలలో లేవు. గాన తమకు నేజెప్పునది నిజముకానట్లున్నది. ఆచరించుము ఫలము గనుమని చెప్పగా మరుమాట చెప్పక జరిగినచో

గొప్ప పేగదా! అని వెక్కిను.

వైద్యశాస్త్రము, మంత్రశాస్త్రము, వేదాంతాదిఫల శాస్త్రములు ఆచరించినచో ఫలము తెలగలదు. తప్పన రాదు. ఫలముగలుగకున్న మరల అర్థముచెప్పి నడిచిన సత్యము తెలియును. శాస్త్రవిమర్శఅన్న నాకుచాలసంతోషము. ఆయుర్వేదము నేను నా 20 వయేటనుండి కృషిచేసితిని. పాశ్చాత్యవైద్యము సామాన్యము అనినాయూహ. దానిలో రసగంధకతాళకమణిశిలలు, లోహాదులు 6 అభ్రకము ముఖ్యము. యివి మృతభస్మములు సుధకావలెనని గలదు. గంధకాదులలో భస్మమువేసి రోగాలపై నడిపితిని. ఫలముకొద్దిగలదు యిట్లుపోనుపోను కొన్నియేండ్లకు మృతభస్మమనిన ప్రాణవాయువు మూటఅనియు సుధ అనిన సున్నమనియు అర్థముచేసితిని భస్మముకరిగిన మరల దానిరూపము చెందకున్న మృతమనియు, అర్థముచేసితిని. సున్నములో విషక్రిములుచచ్చును. భస్మములో దుష్టవాయువునశించి ప్రాణవాయువువృద్ధియై దుష్టకఫపిత్తవాతములు హరించునని తెలిసికొని 1, 2 చేయగల్గితిని. నేనుచేయు మధ్యస్థ భస్మములలో కుష్టుమచ్చలు, దగ్గులు మొదలగునవి నూటికి 50 మందికే తగ్గుచున్నవి. పైరీతి భస్మములుచేయువైద్యుడు భూలోకేతరవైద్యముల నొకమూలకుత్రోసి ఆయుర్వేద చంద్రుని చూపించగలడని నాయూహ. చేతగానిమధ్యస్థ వైద్యులు అట్లగుట రసవాదమునకని గోలపెట్టి తమగొప్పను

కాపాడుకొనుచుందురే గాని సత్యము గ్రహించరు. యిట్లన్ని
శాస్త్రముల సత్యము గలదని నాకు నమ్మకమెక్కువై
సంస్కృతభాషపై యీ వ్యాఖ్యానము వ్రాసి గొప్పతనమును
పరిహారము చేయుచున్నాను. ఇప్పటికి 4 వేలేండ్ల క్రిందట
నుండి పై చెప్పిన మహాపురుషులవంటి అనగా రామాయణ
భారతములలో చెప్పిన మహాపురుషులను ధర్మయుక్త గృహ
స్థుడు గృహరాణి యేకమై సౌఖ్యక కనగలరని భూజగములో
నీతివాక్యములతో నైన వాదించి ఒప్పించగలననియు, జగత్కల్యా
ణమునకు మూలమగు సత్ప్రజావృద్ధిమార్గము కనుగొంటి
ననియు సంతోషించుచుంటిని. ఈ సత్సంతానమువలనను,
దేవుని పూజించుట వలనను యీ రెండుమార్గములు నేను
చెప్పినట్లు నడిచినవాడు లోన బయిట సంతసించకమానడు.
యీ రెంటివల్లనే జగమంతయు బాగుపడగలదని నానమ్మకం.
గృహస్థ రాజ్యపాలన, దేశ రాజ్యపాలనకన్న ఎన్నోరెట్లు
గొప్పది. రాజు శాసనముచే పరుల దండించును. ధర్మగృహ
స్థుడు భార్యను పిల్లల సేవకుల ఎక్కువ దండించిన తనను విడు
తురని భయము. తక్కువ దండించిన వినరు. గట్టిగా కొట్టిన
చచ్చెదరని భయము. రాజభటులను రాజు చంపిన శిక్షలేదు.
రాజునకు కష్టములేదు. గృహరాజ్యమున భార్యకు భర్తకు
పిల్లలకు శతృత్వ మితృత్వములు వచ్చుచుండును. పోవుచుం
డును. శతృత్వకాలమున ఆమెనుచంపిన తనకే నష్టమగునను
కొని పిల్లలచూచి చంపలేక చావలేక మిత్రత్వము చెందు

చుంటాడు. మద్యస్త్రీహింస సుష్ఠుభార్య విపాకులు వృత్యాసులు, తగవులాడీ చమ్యుటి అక్కడక్కడ యున్ననూ అవి అపాత్రలక్షణము. ధర్మగృహస్థమార్గము. ఎక్కువ ప్రేమతోనూ భయాములతోనూ కూడగపూన జరుగుచున్నది. దానిలోనే ధర్మార్థకామమోక్ష సిద్ధిగలదు. ధర్మమార్గమునవిడిచి సత్సంతతిని గని వార్ధక్యమునందైన విష్ణుమార్గమును బాగుపడునేగాని గృహస్థధర్మమెరుగని బ్రహ్మచారుల నొకానొకడు బాగున్ననూ చాలమంది అధర్మముల పాలుకాగలరు. గాన మానవుడు బాల్యమున సత్యముగ శాస్త్రవిద్యలనేర్చి గృహియై పూర్వము చాలమంది బాగుపడిరి. నేడట్లుండుచు గృహస్థులు కూడా బాగుపడగలరు.

## లౌకికమతము

యిది బాగున్నదని రాజ్యాకాంక్షులు సంఘములుచేర్చి రాజ్యము సంపాదించుటకన్న సర్వలోకపాలకుడగు భగవంతుడుగా మార్పుచెందు బ్రహ్మర్షియగుట గొప్పదనియెంచి సంఘముల చేర్చక యేవృత్తిలోనున్ననూ యెట్టివాడయ్యినూ యొంటరిగా దేవుని పూజించి బ్రహ్మర్షియగుటకే పాటుపడుట ఉత్తమమార్గమని నొక్కిచెప్పుచున్నాను.

రాజ్యధనములు. భుక్తి గౌరవముల నిచ్చునేగాని మోక్షమివ్వవు. ధర్మముతప్పిన, "రాజ్యాంతే నరకం ధ్రువం" అని గలదు. దీనికి భయపడి జనకాదులు ధర్మమునపాలించిరి. గృహస్థులగు ఋషులు దరిద్రులై కందమూలాదులు తినుచు

పొందను గృహస్థులై భోగభాగ్యముల ననుభవించుచున్న వారు బ్రహ్మర్షులైరి. బ్రహ్మ విద్వాంసులైన జనకుడు సీతా[illegible] అనేక రాజులు తనపైకి వచ్చిన యుద్ధముచేసెనేగాని పరరాజ్యముపై దండెత్తిపోడు. తన రాజ్యము [illegible] యుండెను సన్న్యాసిహింసల నీ రాచరింతురుగాని పరాపకారంబు చేయుట కిష్టపడరు. బ్రహ్మర్షి రాజులచేతను పూజింపబడు వాడు. అతని గొప్పమార్గమును ధనాదులకు, రాజ్యమునకు విసర్జించుట సామాన్యజనమార్గముగాన పవిత్రనాగు నివిద్యానుష్ఠమార్గమున నడపక నపకారము చేసె. పిల్లలు స్త్రీలు, వార్ధక్యులు, ఒంటరిగా భగవంతునర్చించి ఫలముపొంది బ్రహ్మిష్ఠులవగుచున్నారు. భగవంతుని సాలోక్య, సామీప్యములు భార్యపుత్రులవల్ల తన వల్లగల్గ వచ్చునుగాని, సారూప్య సాయుజ్యము లెన్ని రాజ్యములెంత ధనము ఆర్జించినను గల్గవు. తనంతటతానే చేసుకొని పొందదగినవి—

గీత॥ ఆత్మైవ వైరి పురాత్మనః అట్లు చేసుకొనకున్న నీకు నీవే శత్రువగుదువుగదా!

నీవు బ్రతుకుటకు ప్రతినాడు రెండుపూటలూ అన్నము సంపాదించుకొని తినునట్లే, దేవుని రెండుపూటలా ప్రార్థింపదగును. రాజ్యములోను, గృహరాజ్యమున నీకు సుఖములేని కాలాన దేవుని రాజ్యమన దేవుని ప్రార్థించువాడవయిన సర్వత్రా సుఖముగలదు. లోకమంతయు ఒకటే మతము అయిన తగువు లెక్కడగల్గును. అన అందరు ఒకే దేవునే సర్వేంద్రియములతో ఒంటరిగా భగవంతుని పూజించుట

యత్నము చేయుటకు, ధనధాన్యములు లేక పేదలకు. ధనవంతులు, సమానముగానున్నది. సత్యాహింసాది ధర్మస్వరూపములున్న జగములో సుఖముగా తిరగవచ్చును. ఇదేగదా లోకైకమతాభిప్రాయము. వేదాంతసిద్ధి మెట్టవేదాంతులు చెప్పినట్లుగాదు. అంటెట కేర్పరుకున్నంతగాన మనము దేముడేగాన పూజారులెందుకు అందును. యీ మార్గము చరింపదగినది కాదు.

మేము చెప్పినదదిగాదు. పూర్వస్థులను అగస్త్య విశ్వామిత్ర వసిష్ఠాదులు సిద్ధపురుషులు. వారికి సర్వసంపదలుగల్గి నిగ్రహానుగ్రహశక్తితోనుండుట కావలెనన్న భోగభాగ్యములతోనుండుట, వారికిష్టములేకున్న తపోధనాదులతో దరిద్రమనుభవించుట అనగా సర్వశక్తివంతులై యుండుటగాని ప్రస్తుతపు మెట్టవేదాంతులవలె మొగుడ్డకట్టి స్త్రీలను చెరచుచు భోజనము సంపాదించుటగాదు. పూర్వస్థుల చరిత్రలు చదివి వారివలె శక్తివచ్చువరకు దేవునిగూర్చి తపస్సుచేయుటె యీమార్గము. దేవుడని అసురీ సంపదవారు లోనను, దైవీసంపదవారు బైటను అంగీకరించువరకు విశ్వామిత్రునివలె దేవుని పూజించినగాని బ్రహ్మర్షిగాడు. యీదివ్యరాజ్యమిచ్చుసంపదలకన్న మిన్నయైనది సర్వసంపత్కారణమైనది. శక్తిగలది. ఆరోగ్యమిచ్చునది. ఆయుర్వృద్ధిగలది. ధర్మార్థకామమోక్షసిద్ధిగలది. నిత్యవిజయమైనది. లోకకల్యాణము చేయశక్తిగలది. ఇదియిది అననేల సర్వసుఖాస్పదమైనది. సర్వదుఃఖరహితమైనది, అవతారాది సంతతిగనశక్తినిచ్చునది.

రాజులచేత, సేవకులచేత, ఋషులచేత, పూజింపబడెను. యిట్టివిద్య ప్రాగ్భవ్యులు నిష్కల్మషముగ చేసిరి గాని వారు రసాయనములుతిని చాలకాలమునుండి సిద్ధిగాంచిరి. శ్రీ సేవ చేసినగలుగగలదు. భూలోకములో అనేక విధములుగా యుద్ధములు వచ్చుచునేయుండును. అవి మతములవల్లనేగాక అనేకమార్గాలవచ్చును. కారణము దుర్మార్గులు, సన్మార్గులు ఎల్లప్పుడున్నయుండును. దుర్మార్గులు లోకములో కలహా ములు యుద్ధములు కల్పింతురు. ఉదా:— ధర్మరాజు సర్వ మిత్రుడు. అతని జూచి దుర్యోధనుడు ఓర్వలేక గదా యుద్ధముచేయుట, యిందేమతముగలదు? రాముని భార్యను రావణుడు అన్యాయముగా చెరబెట్టుటవలనగదా యుద్ధమగుట. యిందేమతముగలదు? దుర్మార్గకారణము గాని, మతము కారణముగాదు. భిన్నమతస్థుల ఔరంగజేబుబాధించి తనమతమున ధనాదులిడిజేర్చెను యిదియుదుర్మార్గమేగదా. తనమతమైన సంఘవృద్ధి తనరాజ్యము శాశ్వతమగునని వాని తలంపు, అదిసల్పెనగదా! దుర్మార్గమగుట మొదలంట నశించి నది. ప్రస్తుతము ధనికులకు పేదలకు కొన్ని రాజ్యముల యుద్ధములు గల్గినవి– గల్గుచున్నవి– యిందేమతము గలదు? స్వలాభ దుర్మార్గముల కలహములు వచ్చెను. రాజు రాజ్య ముల యుద్ధములు గల్గినవని ప్రజారాజ్యములు మంచివనిరి. యిందులో ప్రపంచ యుద్ధములు రెండైనవి ప్రస్తుత ప్రపంచ నాశయుద్ధము జరుగునని భూలోకస్థులందరు భయపడుచు

న్నారు. దీనమాత్రము సుఖమేమి. యీబ్రహ్మ విద్యాభ్యా సకుడు యింద్రియ విజయయుద్ధము చేయునేగాని పరుల ధనాదులు గొనయుద్ధము చేయడు. యింటిలో కూర్చున్నను పాండవులపై యుద్ధమునకు లేచిన దుర్యోధనాదులతో తమ ప్రాణరక్షణకు ధర్మరక్షణకు యుద్ధము చేసిరేగాని పరరాజ్య ధనకాంక్షులై హానిచేయలేదు. అట్లు తనను చంప వచ్చిన వారితో తనప్రాణ రక్షణకు యుద్ధము చేసి తప్పించుకొనుట ధర్మమని పూర్వులు వ్రాసిరి. నానా విధమగు విత్తులుచల్లిన పంటను యజమాని పొందుట యెంత కష్టమో వ్యభిచారిణి యైన భార్య వివిధ ధర్మలగు సంతానమును గనిన వారి వలన సౌఖ్యము చెంద గృహస్థుని కెంత కష్టమో వివిధము లగు దేవతల నర్చించిన వాడు అంతే ఫలము నొందును. ఒకేవిత్తనము చల్లిన చేనుపంట పతివ్రత యగు భార్య సం తానమున యెట్టి సుఖమును యజమానులు పొందుదురో సర్వేశ్వరుడగు భగవంతునొక్కనినే శరణు పొందినవాడు సర్వసౌఖ్యము చెందగలడు. దుర్మార్గము యుద్ధాదులకు కార ణము దానిని విడిచిన కాలమున కలహములు రావు. బలా త్కారముగా మతము గొనమనుట, ప్రజల ఆస్తులు రాజు గైకొనుట గల రాజ్యములు త్వరలో నశించినవి.

పాశ్చాత్యులకు పూర్వచరిత్రలు లేవు. గాన వారు క్రొత్తత్రోవలు త్రొక్కుచున్నారు. వారి ధర్మముల మంచి గొన దగునేగాని భారత చరిత్ర విరోధ ధర్మములు గొన

రాదు. వారి ధర్మము మొదట సుఖముగా యున్నను పెను వాలి కష్టములు గలుగక మానవు.

స్త్రీ పురుషులు మానవులైయున్నను కామాభి వృద్ధి స్త్రీ కెక్కువ గలదు. పురుషుని కామము అస్త్ర కామము చూచును అప్పుడు కామముగల్గిన దేహమంతయు నైన బొందును. అట్లాగుక కామము గల్గిన స్త్రీ లేచినో తనయందే కామమును భరించును. గాన పురుషుడు బలవం తుడు స్త్రీ చెడిన దుష్టసంతతి వృద్ధియగును. స్త్రీ చెడనిచో మంచి సంతతి వృద్ధి యగునుగాన ప్రతిగృహస్తుడు భార్యకు సర్వ స్వాతంత్రము యింటియందిచ్చి పరపురుష సంబంధము లేకుండా చేసినమంచి సంతతి వృద్ధియై దానదుర్మార్గము తక్కువై భూలోకము సుఖ పడగలదు. గానగృహస్తుడు సన్మార్గ వర్తనుడై స్త్రీని రక్షించుకొనుచు సత్యాహింసా దులతో దేవుని నిష్కామముగ పూజించుచే లోకైకమ తము, దాన యుద్ధములు లేక సర్వసుఖములు గల్గును. మాన వుడు ధర్మార్థకామ మోక్షముల ఆయా కాలముల సంపా దించ దగునేగాని కాలము దాటిన అంతసౌఖ్యముండదు.

అనగా దేవుని పూజించుచు బాల్యమున సర్వధర్మములు నేర్చుట వయస్సున అర్థము సంపాదించి సత్ప్రజల గల్గించుట వార్థక్యమున సర్వముపై భ్రాంతి వీడి భగవంతుని కృప గాని, అయిక్యసిద్ధి గాని చెందదగును. దేవుని పూజ లేనివానికి ధర్మాధర్మములు తెలియక శాంతి లేకపోవుట నిశ్చయము.

మద్యపానమాంసాహారవృద్ధిపొందెను. యిది సహజము. ప్రస్తుతము యింగ్లీషువారు భూలోకములో అనేక దేశము లేలిరి. కొంత కాలమునకు ఆపాలనంతయు తగ్గిపోయి బలహీనులయిరి. యిప్పుడు వారెంత ప్రయత్నించినను మరల అన్ని దేశాలనేల గలరా? ఏలలేరు గాని ఋషిధర్మముల వలె వారిపాలనలో వారిధర్మము లేమైన నిల్చియున్నవా? స్వలాభమగుటచే వారి ధర్మములు వారినే చెందినవి. నిష్కామపాలన చేసిన ప్రాచీనుల (శ్రీ)రాముని ధర్మములు నేటికిని ప్రజలాచరింతురు. యింగ్లీషు వారి ధర్మములెవ్వైన ఆచరింపదగినవిగలవా? యీ పాశ్చాత్యధర్మములు దేవుని చేర్చవు. మద్యాహారము పొట్టకు గల్గి స్వల్పసుఖము రోగము లెక్కువగల్గి అధర్మమార్గము ధనార్జనము చేయుట దుష్టసంతతినిచ్చుటగల్గునే గాని ఎక్కువ లాభముండదు. గాన పాశ్చాత్య ధర్మములలో ధర్మార్థకామమోక్షములను పురుషార్థసిద్ధులునాల్గుగల్గుటకునై యున్నది. యీజన్మమున బ్రహ్మర్షి గాకున్నను పరాపకారము లేక సన్మార్గమున నడుచుటకైన వేదాంత బ్రాహ్మణధర్మము నేర్పగలదు. ప్రతిమానవుడట్లున్న యుద్ధములు కలహములు రావు. గాన యీ వేదాంత బ్రాహ్మణ ధర్మమొక్కటే అనగా లోకైకమతమొక్కటే భూలోకమున యుద్ధములు కలహములు, అధర్మములు, వ్యభిచారములు లేకుండా చేయునది గాని యితరముగాదు.

"సన్యాసమునగాని మూసవ కామసిద్ధిగాదు"

సన్యాసమనగా విడుచుట. భగవత్ సన్యాసమన దుష్కర్మ సేయక సత్కర్మముల ఫలము భగవదర్పితము చేయుచు అంతటను దేవునిచూచుచు లోకకళ్యాణము గాచేయుచు యితరముపై భ్రాంతి విడిచి భగవంతుని సర్వ విధములా శరణ్యము పొందిన కాలము.

అట్లు కొంతకాలమున్నగాని భగవత్కృపగాని ఐక్య సిద్ధిగాని గొనలేదు. అదిఫలించిన బ్రహ్మర్షియై సర్వ లోకకల్యాణము చేయశక్తివంతుడై సర్వ సంపదలతో సర్వసుఖములతో జీవించి అంతమున బ్రహ్మత్వము జెందును. యీ మార్గము భగవంతునికై సన్యశించుట అనునది యగును. "కైతుసన్యాసము" యితరకర్మములు సేయక పొలమునే నమ్మి దానికేమంద మరమ్మత్తులు చేసి రెండవవారితో సంబంధము మాని సకాలమునో మొదట తనడబ్బు అనేక మందికి వెదజల్లి వారిసాయమునవృద్ధిచ్చి దానిచుట్టూ దిరుగుచు రెండవవానిని శాసీయకున్న దానిఫలమును చెందుచున్నాడు. యింతవరకూ చేను విడిచిన దానిఫలము వానికి దక్కదుగదా. మరియు యిట్లున్నను, గాలిపాటు సరిగాలేక ఫలించదు. అట్లనిమానునా? మరల మరల పండువరకు చేయుచున్నాడు. అనగా తన కాలము చేనుక్రింద వ్యయము చేసినగాని ఫలము గల్గుటలేదు. అట్లేభగవంతుని దయకై తనధనము సాధువులకు దానధర్మములు, చేయుచూ పదసంబం

భమును వదలి భగవంతుని పూజించువాడు తప్పక భగవంతుని కృప పొందగలడు.

## విద్యాసన్యాసము

ఒక క్షురవాడు M.A. చదువుటకై ప్రయత్నించి మొదటనుండి తనచేతిలో డబ్బువ్యయముచేయుచు ఒంటరిగా నుండి తల్లిదండ్రుల అందరిని విడచి M. A మీద భ్రాంతి పడి యితరధర్మములు మాని 14 యేండ్లు అభ్యసించినగాని నెగ్గుటలేదు. జాతకము సరిలేనిచో మరికొంత కాలము పట్టును గదా. యిట్లునెగ్గినతరువాత గదా రాజసేవకులలో పెద్దవాడై సుఖ పడుట. అదినెగ్గనిచో రాజసేవకత్వము గల్గదుగదా. రాజసేవకుడయ్యి గౌరవసుఖముల నొందుచు తనసేవకా ప్రాంతమున యశోవంతుడగును. అట్లే భగవంతునికై గృహస్థుడైన ప్రతివాడు కొంతకాలమును బ్రహ్మచర్యమున కొంత ఎక్కువకాలమును; గడిపినచో దానినెగ్గనిచో వాన ప్రస్థ యత్యాశ్రమ కాలమంతయు యితర భ్రాంతివిడిచి దేవుని పూజించి అతనికృప గాని ఐక్యసిద్ధిగాని పూర్వర్షులు చెందిరి. అట్లేనేడును పొందదగును. కొందరు గృహస్థులై యుండియే నెగ్గిరి. ఉ దా:— వశిష్ఠాదులు.

## వివాహసన్యాసము

పుత్ర పుత్రికావివాహముగువరకు మానవుడు యితర పనులు విడిచి దానికై యేకముఖముగా ప్రయత్నించిననాడు

వివాహమగును. అట్లుకానిచో తగ్గి మరల మరల ప్రయ త్నించి వేయునేగాని మానివేయకుగదా. యెంత ప్రయత్నించి ననూ కానిచో ఏడ్చి దాక్కై బెంగపెట్టుకొని పరసహాయము చెంది క్రొత్తమార్గమున ఎట్లోచేసికొనును. గాన మానవుడు ప్రతికర్మఫలము జూచుచుండెన్న దానికి ఏకముఖమున కొంత కాలము యితరము పై భ్రాంతి విడిచి చేసినగాని ఫలితము బొందడు. అట్లేమానవుడు సన్యాసిగా అనగా సర్వసౌఖ్య సర్వ సంపదల జెంద ప్రయత్నించువాడై యున్నాడని అర్థముగాని, భార్యాబిడ్డలవిడిచి కూడు కుమ్మి దినక యేఫలము జెందక ఒకమూల కూర్చొనుట సన్యాసముగాదు. సన్యాసమన:— తప శ్చరణమునకు అర్థము. దేనిపై యేకముఖముగా మానవుడు న్యాయముగా తపించునో కొంతకాలమునకు ఆకర్మఫలము తొందరగాగాని, ఆలస్యముగాగాని చెందగలడు. అని అర్థము. అన్ని సన్యాసములకన్న భగవం తుని గూర్చిన సన్యాసము గొప్పదగుట అదియెక్కువగా ప్రసి ద్ధిప్రదమైనది. గానయెర్రగుడ్డ వేసినవాడల్ల సన్యాశి అనవల శివచ్చినది. దీనలాభము లేకపోవుటచూచి యీవేదాంత శాస్త్రమును హీనముగా చూచుచున్నారు. అదిచదివిన ధనా దులు అన్నిపోవునని కొందరు భయపడుచున్నారు. అల్పజ్ఞులు హీనులు, వేదాంతమార్గముగాని శుష్కవేదాంతులగుటచే యీశాస్త్రము హీనత చెందుచున్నది. ఆచరించిన ఫలము గల్గు అర్థముచెప్పగల వేదాంతశాస్త్రజ్ఞులవలన ప్రకాశము చెందుచున్నది. యిట్లేదేవతాసన్యాసము.

స్త్రీ సన్యాసిని పురుషునివలె బ్రహ్మర్షి స్థితి పొందు వరకు దేవుని పూజింపవలెను. వ్యభిచారిణి వ్యభిచారము మాని అహల్యవలె భగవత్సన్యాశినియైన బ్రహ్మర్షిత్వము చెందగలదు. కొన్ని దేశముల రాజ్యమేలు పక్షస్థులు సర్వసుఖముల ధనాది భోగములనందుచున్నారు. ప్రజలు మాట్లాడ వీలులేదు. వారు చెప్పినదే వేదమైయున్నది. గృహస్థులు భోగ భాగ్యములనుభవింప వీలులేదు. అట్టితరి ఆప్రజలు సత్సంతానముగనుచు లోకకళ్యాణము చేయుచు బ్రహ్మర్షిత్వముచెంద భగవత్సన్యాసము చెందుట పరమోత్తమమగును. దీనబాధ లుపశమించును. ఉ:- దేవకీవసుదేవులు ప్రజలు రాజ్యమేలు వారు ధర్మస్థులై భోగభాగ్యములనుభవించు రాజ్యమే సత్యమగు ప్రజారాజ్యముగాని యితరము యమరాజ్యము. అనగా ఔవీధులు సర్వసుఖముగనూ దక్షిణవీధి నానాకష్టములుగలదిగ నుండునది యనిభావము.

## లౌకైక మతము

స్త్రీలు, పురుషులు, బాలురు, బాలికలు ఆచరించిన దోషము లేనిదియైయున్నది. గాన మానవజన్మము దుష్టకాంక్షల బడికాలము వ్యయపరచక ప్రతివాడు భగవంతునికై కొంతకాలము సిద్ధిగల్గువరకు వ్యయము చేయుటే లౌకైకమతము.

ఆంధ్రపత్రిక బుధవారం 15 సెప్టెంబరు 1954 (యోగ విద్యాచార్య శ్రీ స్వామికైవల్యానంద) పాశ్చాత్యవ్యాయా

మవిద్య ప్రసాదించలేని కొన్నిలక్షణాలు యోగాభ్యాసము ద్వారాగల్గునని డాక్టరు సి. పి. రామస్వామిఅయ్యరుగారు స్వామిశివానంద షష్ఠిజన్మోత్సవాన అధ్యక్షులై చెప్పిరి. సందేశములుపంపినవారిలో రాష్ట్రపతి, ముఖ్యమంత్రులు గలరు. యోగవిద్య నభ్యసించి దేహపటిష్ట ఆత్మనిగ్రహము మంచినడవడి గల్గుననిరి శాస్త్రీయముగా యోగవిద్య ప్రచారము చేసినందుకు ఆనందమని అభినందించిరనిగలదు. యిట్టి స్వామిజీని ద్రోణాచార్యునివలె పాఠశాలలో గురువునిగా జేసి పిల్లలకు నేర్పించుట మంచిమార్గము. భగవధ్యానము ఫల జల వాయుభక్షణ మార్గములు బోధింప తగినవి. దానశరీరము మానశికబలవృద్ధి గల్గును. భగవధ్యానము లేని ఫలాది భక్షణ శరీర బలమేగాని మానశిక బలమివ్వదు.

పూర్వర్షుల మార్గములకన్న మిన్నమార్గములుండవు. వాటిని తెలిసికొని ఆచరించి ఫలము పొందుటే మానవుల పని. వారొక్కొక్కరు దానిని సొంతముగా రెండవవాడు పాటు పడనక్కరలేకుండా విమర్శించి ఆచరించి ఫలముపొంది అట్లు వ్రాసిరి.

భారతము:— శాంతిపర్వము, మోక్షధర్మపర్వము, 198 అధ్యాయము 23 శ్లో॥ జాపకైస్తుల్య ఫలతా యోగానాం నాత్రసంశయః జాపకానాం విశిష్టంతు ప్రత్యుత్థానంసమాహితం॥ జపముచేయువారు కుంభకాదియోగ భగవధ్యానపరులు సమానఫలము గలవారై యున్నారు.

తెలుగుభారతము.— "జాపకులకు యోగులకును సమ మెపుణ్య గతివిశేషమున జాపకులు నిర్భరోద్ధత్రాన శక్తి నధికులని గలదు" అన, జపయజ్ఞము చేయువారు శ్రేష్ఠు జపము అక్షరయుక్త శబ్దములుగలది. యిది "ఆకాశం శబ్దగు ణకం" పృథమ భూతము ఆకాశభూతమున శబ్దముగలదు. దాన యితర భూతసంపర్కము లేదు. కుంభకము. ఆకాశవా యుభూతమిశ్రమము గాన దానికన్న శక్తిలో శాంతతక్కువ గలదియగును.

గీత— "యజ్ఞానాం జపయజ్ఞోస్మి" యజ్ఞములలో జప యజ్ఞము భగవంతుడు నేననెను. అది అహింసాపూర్ణమైనది. నిష్కామముగాగాని సకామముగాగాని భగవన్నామము లనొకటి లేక కొన్ని కొన్ని అతనిరూపము చూచుచు స్మరిం చుట జపమనబడును. అదివాచిక, ఉపాంశు, మానసికములని 3 తెరగులు.

ఆగ్నేయపురాణము:- "జపః ఆధిర్వ్యాధిర్నాస్తి" జపముచే శరీరమానసిక రోగములు నశించును. యిది సత్యమన దగును. "నాబాల్యమునుండి నేను ఉదయసాయంత్రములు జపము చేయువాడను. నాకు 63 యేండ్లు గలవు. ముందె ట్లుండునోగాని యింతవరకు మనశ్శాంతి ఆరోగ్యము బాగుగ నున్నది. యిది నాస్వల్పానుభవము." "ఆకాశాద్వాయుః" ఆకాశ భూతమునుండి వాయువు పుట్టెనుగాన యిందు ప్రాణ వాయువు వృద్ధియై మనోశాంతి శరీరరోగశాంతి గల్గించు నన

దగును. "మనోనాధస్తు మారుతః [illegible]" ప్రభువు ప్రాణవాయువు. చెడుశబ్దములు జపించుట [illegible]టచే విషవాయువు పుట్టి మానవునికి అపకారమే జరుగును. గాన శుభశబ్ద జపము శ్రేష్ఠమైనదని తెలినది. [illegible] శ్రద్ధగలవారికి పూర్ణఫలము జపమిడ గలదు. అందరికి రాజసేవ, వర్తకసేవ, రైతుసేవ చేయుమార్గములు పాఠశాలలో నేర్పిన తగిన పనులు దొరుకక రాజ్యములో నిరుద్యోగసమస్య యెక్కువకాగలదు. గానపాఠశాలలో భగవంతుని కృపనిచ్చు బ్రహ్మవిద్యాబోధకములగు గీతలు, ఉపనిషత్తులు, వేదాంతము తెల్పుదర్శనములు, ప్రతివాడు చదువునట్లు శాసించిన ప్రకృతి విద్యలచే భోజనాది సౌఖ్యమున్నా, బ్రహ్మవిద్యచే బ్రహ్మర్షిగ గాని మారుట గల్గును. గానకొందరు భగవత్సేవకులై వర్తకాది వృత్తులనున్న నిరుద్యోగసమస్య యుండదు. భగవత్సేవకులగు వారికి సత్యాహింసాది మార్గములు చెప్పబడును. వీరురాజసేవ, వర్తకసేవాదులనున్న రాజ్యమున సౌఖ్యము కల్గచేతురు. గాని రాజర్షి మహర్షి బ్రహ్మర్షులగుమార్గములుభూలోకములో ప్రస్థుత పాఠశాలలలో లేనేలేవు. యిది భారత పూర్వ పాఠశాలామార్గముధర్మరాజు 21 దినములు వాయుభక్షకుడై సూర్యునారాధించి అన్నవృద్ధి చెందెను. దీని పరీక్షింప నొకడైన ప్రస్తుతమట్లు చేయలేడు. ఆమార్గములు, మారినవిగాన తప్పులనుచున్నారు. గానభగవద్ధ్యానముతో గూడిన కుంభకములు శ్రేష్ఠమైనవే గాని వట్టికుంభకము శరీరారోగ్య మిడగలదు. మోక్షమీయ

జాలము, మనుష్యుల పంట పండించుటలో సాధుసంతతిని వృద్ధి సేయుటను ఆసురీ సంపదను విడుచుటయు శాస్త్రములు చదివిన తర్వాత అనుభవము పొందదగినది. అనుభవము సరిగా నిచ్చో తనదే తప్పనవలెను. గాని శాస్త్రములు తప్పనరాదు దైవీసంపద భార్యాభర్తలు సత్యము కనుగొనగలరు. ఆసురీ సంపద భార్యాభర్తలు సరిగా చేయక గ్రంథములు తప్పని వాపోవుచుందురు. తలిదండ్రులు భర్త పురుషులకన్న మానవులపంట మార్గము స్త్రీలకు బోధించిన వారు కొ నిముషాలలో దైవీసంపద సంతతిని దేశదేశాలలో నిండింతురు. అట్టి వారే రాజర్షి బ్రహ్మర్షిత్వములకు పాటుబడువారు. రాజ్య వర్తక వ్యవసాయాది వృత్తుల సత్యాహింసాది మార్గముల నడుపగలవారు అగుదురు. దుష్టస్త్రీ పురుషులెక్కడే సంఘమున చేరుదురో అదిధర్మము తప్పి బలహీనమై దాని గౌరవము పోగొట్టుకొనును. వీరుశాస్త్రములు చదివిన జగన్నాశన మార్గము నేకనుగొందురు గాని మంచిమార్గము కనుగొనరు. గాన కులాతీతము, మతాతీతము, సంఘాతీతమగు బ్రహ్మ విద్యాభ్యాసియైనగాని వేదాంత బ్రాహ్మణత్వమున రాజర్షి, ఋషి, మహర్షి, బ్రహ్మర్షిత్వముల నొకటి సిద్ధిపొందలేడు. సర్వజాతులలో వేదాంత బ్రాహ్మణులగువారు అనుభవ పూర్వకముగ నిర్ణయించి ధర్మగ్రంథములు వ్రాసిరి. వాటిని చదివి, రాజులు వేదోక్తముగా నడచు బ్రాహ్మణ క్షత్రియ వర్తక శూద్ర సంఘములు ఆచరించి బాగుపడినారు. నేమనట్లాచరించిన

ఆంగ్ల శుభఫలములు గలుగగలవు. భూలోక సర్వజనక్షేమ మునుగూర్చి భగవంతుని పూజించు క్రియాదులాచరింపుడని చెప్పునదే లోకైకమతము. ప్రజారాజ్యము స్థిరమైనది. గాన ప్రజలు భోజనములుచేసి తిరుగుటకుగాదు, సత్సంతతి వృద్ధిచేయుచు దేవుని పూజింపనై యున్నది.

భారతదేశము ఉన్న ప్రజారాజ్యములవలెగాక, సౌమ్యమార్గముల, పండిత నెహ్రూజీ, పండిత రాజేంద్రప్రసాద్ జీలచే పాలింపబడుచున్నది.

యీకాలము గృహస్థులందరు భగవద్ధ్యానసిద్ధి గాంచుటకు సత్సంతతిని వృద్ధిచేయుటకు తగియున్నది. అట్లుచేసి ఆఫలమనుభవింపుడు. యిట్లు భూలోకమునగల ప్రతిప్రజారాజ్యము ప్రజలాచరించిన వారును కులమత జాతికలహములులేక ఒకేమతములో నుండుటచే స్నేహముగల్గి సత్సంతతి వృద్ధిచేయుచూ భగవత్కృపకల్గి సర్వసౌఖ్యము లనుభవింపగలరు.

యీ లోకైకమతమున సత్యము పలుకుట ధర్మమునచరించుట సాత్విక తపస్సుచేయుట శమదమములు గల్గియుండుట అనగా సర్వేంద్రియములతో భగవంతుని పూజించుచు పరులకపకారము చేయకుండుట లేక సాధూపకారము చేయుట, సాధువులకు దానమిచ్చుట, సత్సంతానము వృద్ధిచేయుట, జపయజ్ఞాది యజ్ఞములు వృద్ధిచేయుట, దేవుని మానసికోపాసన ప్రతిదినము చేయుట, భగవత్సఖ్యము చెందుట అనగా భగవంతుని కృపకై లేక బ్రహ్మర్షియగుటకు కొంతకా

లను ప్రతివాడు ప్రార్థన ధ్యాన జపాదులు భగవంతునిగూర్చి నిష్కామముగా చేయుట భూలోకమున ప్రతి మానవుడు అభ్యసించుచు పరులకు బోధించిన తప్పక యిహసుఖము చెంది కైవల్యార్హులగుదురు.

ప్రారబ్ధము మంచిదిగాని నాడు భగవంతుని సేవించిన అతనికి తగిన జాతకస్థితిలో మ్రెరసీటిని మంచినీరుచేసినట్లు మార్చి మంచి ఫలమతని పురుష ప్రయత్నమున ఫలించినట్లు చేసి భుక్తి ముక్తులు రెండునూ సర్వలోక సార్వభౌముడగు భగవంతుడిడగలడు. రాజసేవ, వర్తకసేవ, రైతుసేవల మంచి పురుష ప్రయత్నముకలవాడైనచో భుక్తి స్వేచ్ఛగా జరుగగలదు. గాని ముక్తిగలగదు. గాన భగవంతుని సేవించు సత్యమార్గము తెలిసికొని పూజించుచు మంచి పురుష ప్రయత్నములో తమయిష్టమువచ్చిన వృత్తినున్న యిహలోక సుఖము, పరసుఖమన బ్రహ్మజ్ఞాన సుఖముగల్గునని బోధించునదే లౌకికమతము. ప్రతివాడు లోకైకేశ్వరుడగు భగవంతుని ప్రతినాడు ఉషఃసంధ్యా ప్రాతః కాలముల సేవింపదగినది. యనియు యితరకాలమంతయు ధర్మముగా గృహస్థ ధర్మభుక్తికై పాటుపడదగుననియు యిట్లు భూలోక ప్రజారాజ్యములు తమరాజ్య ప్రజలందరికి శాసించుట పరమోత్తమ మార్గమనియు సాధుదుర్మార్గ పక్షములలో సత్యాహింసా క్షమ, శమ, దమాదులుగల రాజుగాని ప్రజాపక్షముగాని రాజ్యమేలతగుననియు, అసత్య, హింస, అక్షమ, అశమ, అద

మూఢములతో సాధువుల హింసించు దుష్టరాజుగాని దుష్ట ప్రజా పక్షము, అట్టిసేవకులు రాజ్యమేలరాదని చెప్పునది లోకైక మతము. ఏకాలమునను అరాజకత్వము భూలోకమున నుండకుండా భగవంతుడు కాపాడునుగాక. అరాజకరమైన, ఎవని భార్య, ఎవనిబాలము, ఎవనివృత్తి యేదియూ లాభములేక నానాకష్టములు ప్రజలకుగల్గును గాన భూలోకమున యింగ్లండునలె రాజు రాజ్యముగాని ప్రజా రాజ్యముగాని లేనిచో గృహస్థుని ధర్మములు సాగవు. వృత్తిధర్మములు సాగవు.

భగవన్మతస్థులు ఏవృత్తినున్నను భుక్తికిమాత్రము ధర్మముగా సంపాదించుటయని యెరింగి పరుల నన్యాయము చేసి ధనార్జనచేయుటమాని భగవంతుని దయకెక్కుడు పాటు పడుదురు గాని రాజ్యవర్తక రైతు, ఆదివృత్తులలో నెక్కువ సుఖపడగోరరు. అనగా ఇహ సుఖము స్థిరమైనది కాదని భగవంతుని కృపగల్గిన నాడే స్థిరసుఖముగల్గునని వారియూహ. రాజ్యాది సర్వవృత్తి పక్షస్థులు యెవరికివారే ఒంటరిగా తమ యింటనే లేక తనకిష్టమగుతోట మొదలగుచోట్ల భగవంతునర్చించుమని చెప్పునది భగవన్మతము. దీనికి సంఘము పనికిరాదని చాలాసార్లు వ్రాసినాను. రాజ్యమునకు వర్తక, వ్యవసాయాది వృత్తులకు సంఘములున్నగాని జరుగవు. ఒకనివల్ల ఆధర్మములు సాగవు. దేవుని ధర్మము ఒకడున్న నిర్మలముగా సాగును. (భార్య పిల్లలుదక్క) యితరులున్న నిర్మలత్వము చెడును. గాన ప్రతివాడు భగవంతుని దయకై దేవుని పూజిం

చుటయనియు భుక్తికై రాజ్యసేవ వర్తకసేవాది వృత్తుల నిగ్రహించుటే లోకైకమతము. పూర్వ కులములు నేటిసంఘములు సమాన ఫలమిడున వేగాని సంఘములులేకుండా రాజ్య వర్తకాదులు సాగుటెంత నిజమో సంఘముగాజేరి భగవంతు నిపూజించువారికి అంతేఫలము గల్గగలదు. అనగా యెట్టిలాభములేక స్త్రీ పురుషులు అధర్మమార్గముల గూలుదురు. దానితో ధర్మము చెడునని తలంచి పూర్వార్యులు భగవంతుని; ఒకడుగావుండేపూజింపదగునని వ్రాసిరి. గాన భగవంతునికృపగల్గ నవానికి రాజ్యవర్తకాది లాభముల భ్రాంతితక్కువయై ధర్మముగా జీవించుటకే పాల్పడును. డాంబికమతస్థులే రాజ్యవర్త కాది లాభము పైభ్రాంతిగల్గి మతముపేరిట సంఘముజేర్చి రాజ్యములేలిరి. ఉదా:- ఔరంగజేబు, శివాజి. హీనులు, దుష్టులు, కార్మికులు, రైతులు అధ్యక్ష ప్రజలు బ్రహ్మవిద్యా మార్గమున దేవుని విడువక ప్రతినాడు భక్తితో పూజించు చున్న వారివారి జాతకములకు తగినట్లు మంచితో మరింత మంచియు; చెడుకాలమున పాండవులు ఆపదలనుండి దాటు నట్లు సౌఖ్యముగా జయముతో అన్నవస్త్రాదులకు లోటులేక యుండును. బ్రహ్మవిద్య తామున్నస్థితిలోనే తృప్తినిచ్చును. ధర్మమార్గమున నడుపును. ఎంతసంపాదించినను భుక్తికే గదా అనినిశ్చయముగల్గి ధర్మముగా అర్థము సంపాదింపజే యును. తనదేహము పారబ్ధమువలన వచ్చినది గాన దానిఫల ముగల్గ అనుభవింపజేయును. దుష్టకష్టముల సుఖముగానుండు

నట్లు చేయును. బ్రహ్మర్షి పరులకు మాత్రము దయగల్గి
వారికి మహోపకారము చేయగలడు. కోపము గల్గిన శాప
వాక్యము చేతనే వారి ప్రారబ్ధబలమును తొలగించ శక్తివం
తుడై యుండును. సత్సంతతిని వృద్ధిచేయును. యిట్లు నిత్యా
నందుడై అంతమున బ్రహ్మత్వము చెందును.

ఉదా:- గజేంద్రుడు, ద్రౌపది, సక్కుబాయి, రామ
దాసు, వేదములన: ఋగ్యజుసామాధర్వాదులు, స్వర్గమార్గ
మున్ను ఖురాన్, బైబిల్, యివి సత్యధర్మ అహింసాదుల
బోధించును. పై వాటిని కాదనువారు వృద్ధియైన ఆనాడను
భగవంతుడు వచ్చునని భాగవతమున గజేంద్ర మోక్షమున,
ప్రహ్లాదచరిత్రలోను గలదు.

చక్రవర్తికెంత అనందమో బ్రహ్మవిద్య అతిపేదకు తన
స్థితి యందు అంతేఅనందము. ఉదా:- జనకుడు మహారాజు
యితని రాజ్యమున, బోయవాడు వీరిద్దరు సమసంతోషము
ననుండిరి. నాస్తికులు బాగుపడుట:- దేవునియందు నమ్మకము
లేని వారైనను సత్యాహింసా క్షమశమాది సద్గుణములను
వాటిఫలము గల్గువరకాచరించుచు మెలగుచు సూర్యుడు,
చంద్రునివంటి సంతానముగాని, మంచిఋతుకాల సంగమ
ముచే గొప్పసంతతి గాని వృద్ధిచేసిన యిహపరముల సుఖపడ
గలరు. యీ మార్గమును విడిచిన ఆస్తికనామధారకులు
నాస్తికులు, యిహపర సుఖముల బడయక పరాపకార

మెక్కువ చేయుచు అగౌరవము కలహాదులతో నానాకష్ట భయములతో కాలము గడుపుచుందురు.

## రామాయణ భారతమార్గములు.

యీ మార్గమే రాజ్యపక్షస్థులుగాని, రాజుగాని వీరికి తోడు గురువులనగ జననీజనక గురువులు గాని సద్బోధలగృహస్థులకు సాధువుగా బోధించిన (శాసనములచేగాదు) యే దేశమునకా దేశము బాగుపడుట గల్గిన భూలోకమంతయు బాగుపడును. అట్లుబోధించినను దుష్టసంతతి వృద్ధియగుచున్న బాల్యవిద్యాభ్యాస కాలమునే పాఠశాలలో సన్మార్గ విద్యల నభ్యసింపచేయునది. దీనికి మిగిలిన దుష్టులరాజు, శిక్షించుచున్న వారిలో చాలమంది సన్మార్గులగుదురు. పూర్ణదుష్టులు యీవిద్యనభ్యసించినను, రాజుశిక్షించినను, దేవుడు చెప్పినను వినక తనతోపాటు తాను అనేకులనశింపచేయును. ఉదా:— దుర్యోధనుడు, యితడు దుష్టగృహస్థుడు, దేశమును శాసించు రాజగుటచే తాను అనేకులు చచ్చిరి. యిట్లే జర్మని హిట్లరు నాశనమయ్యె. రాజుగాని యిట్టి దుష్టగృహస్థుడగు వాల్మీకి పాపములకు భయపడి దిక్కులేక సాధువై బ్రహ్మర్షియయ్యె.

కులవాదము:— పూర్వ భారతమున మనువు జనుల సంఘముచేసెను. అవిస్థిరమైన కులములుగ మారినవి. కులవాదములలో యుద్ధములు జరిగినవి. యివీసంఘములే. పూర్వము రాజు వీటిని పోషించువాడు. నేడది లేదు. పైగా వాటిధ

గ్రమము శూన్యమైనది గాన వాటితో యుద్ధములు రావుగాని చిన్నితగువులు గల్గినను తగ్గిపోవుచుండును.

## మతము లు.

యితర దేశాల భారతమున బౌద్ధమత ప్రారంభము నుండి జైన, శంకర, రామానుజ, మాధ్వ, క్రీస్తు మహమ్మదీయ హిందూమతములలో అనేకయుద్ధములు గల్గినవి. వాటిని రాజు పోషించినపుడే యుద్ధములు గల్గినవి. నేడారాజులుతగ్గిరి గాన మత యుద్ధములు గల్గవు. నేడన్ని దేశాల సంఘములుగా జనులు జరుగుచున్నారు. రాజ్యమును సంఘ మేలుచున్నది.

గీత: పరిత్రాణాయ సాధూనాం వినాశాయచదుష్కృతాం
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే॥

భగవంతుడు సర్వప్రభువు. అతడు అసత్యాధర్మాహింస మార్గస్తుల రక్షించుటకు, అసత్య, అధర్మ, దుష్టహింసాత్ముల నశింపజేయుటకు పుట్టుచుండుననెను. అదే రామాయణము, భారతము సాధుపక్ష మొకవైపున దుష్టపక్షమొకవైపున నిల్చి యుద్ధములుచేసి దుష్టులు నశించిరి. దుష్టులు భూలోకానఎక్కుడు వృద్ధియైననాడే అతడు వచ్చి దుష్టుల హతమార్చును. సత్యముగా భగవంతుని పూజించు పతివ్రతను సాధుపుంగవుని (డాంబిక పతివ్రతల డాంబిక సాధువులగాదు) అసత్య అధర్మలు, హింసాయుక్తులు బాధించిన వారినుండి వారిని విడిపించును. దుష్టుల నశింపజేయును.

భగవత్గీతలో యీ సత్య, ధర్మ అహింసాది సద్గుణములలో నడుచుటే సర్వవేదమతము. లౌకైకమతము. గాని పుస్తకభేదములు చేయరాదు. అన్నిమతగ్రంథములు సత్యాది మార్గాలు మంచివని బోధించుచునుగదా చిన్నధర్మము లేమత్ భేదమున్ననూ సత్య ధర్మ అహింసాది పెద్దధర్మములు అందరికీ ఒకటిగానేయుండును. ప్రస్తుత ఈ వేదమార్గము సత్కామమార్గము గాన జగములో కొంతసుఖమిచ్చి పరమున స్వర్గమిచ్చుగాని వేదాంతమార్గమువలె మానవుని బ్రహ్మర్షిగా చేయలేదు. భారతమున స్వారాజ్య సంపాదనలో మహమ్మదీయులు హిందువులు సత్యాహింసాది మార్గాలనడిచి వచ్చిన తర్వాత మతరాజ్యము కావలెనని జిన్నా వగైరాలు సత్యాదిమార్గములుబాసి హిందూగృహస్థుల ననేకుల నాశనము చేసిరి. దానితో వారు విడిపోయిరి. హిందువులు కాంగ్రెస్‌లో తామన్నట్లు సత్యాహింస మార్గము విడువక మహమ్మదీయుల హిందువుల నన్నిజాతులవారిని యితరమతస్థులనందరిని సమముగా పాలించుచున్నది. పాకీస్తాన్ నేటికి మతరాజ్యము విడువలేదు. యిట్లెపుడూ భూలోకమున యుండక మానవు. ఎప్పటికపుడే సత్యాహింసాది ధర్మస్థాపనకై దేవునివలె రాజుగాని రాజ్యపక్షస్థులు గాని, గృహస్థులు గాని చేసుకొనుచునే యుండవలయును. విడిచిననశించుటే గల్గును. దుష్టులసృష్టినుండి స్థితినుండి వృద్ధి కాకుండా (పండుచేనులో కలుపు నేరినట్లు

నిత్యము యేరుచుండుటే పని) యేమాత్రము విడిచిన వృద్ధి యగుచుందురు.

"భారతదేశములో హిందూసభ మతసంఘము"

కాంగ్రెస్ పక్ష భారతీయులు రాజ్యమేలుచుండగా హిందూమతము నశించునని వీరిభయము. వారే రాజ్యమేలిన హిందూమతము నశించదని వారియూహ. హిందూపన సాధు మనుష్యుడని పేరు గ్రంథమునగలదు. నేడు మన దేశ పాశ్చాత్య విద్వాంసులే ఎక్కుడుగా దీనిపాలించునది. హిందూసభ వారికి మతాభిమానమేగాని మతమన భగవంతుని పూజచే రాజర్షి, ఋషి, మహర్షి, బ్రహ్మర్షి త్వసిద్ధి చెందుటని అది వంటరిగానుండి సాధించునది యేయనియు తెలిసిన యీసంఘ ముండదు. భుక్తిముక్తినిచ్చు దేవుని పేరుతో భుక్తిని మాత్ర మిచ్చు రాజ్యస్థాపన వీరుచేయునదిగా తోచుచున్నది. భూలోకము సాధువులతో అసాధువులతో నిత్యము నిండుచుండును. అందు సత్యాహింసా శమదమ క్షమాది సద్గుణులై దేవునర్చించుచూ యేదో వృత్తితో భుక్తిగాంచువారే హిందువులు. సాధువులు, ధర్మాత్ములనిచెప్పబడుదురు. అసత్యము, హత్యలుచేయుట, దొంగతనము, దుష్టమధ్యపానము, పరస్త్రీల చేరటుట మొదలగు దుష్టవృత్తులు గలవారే అసాధువులు, అహిందువులు, అధర్మాత్ములయి యున్నారు. దీనింబట్టిహిందూమతము భూలోకమంతట చాలభాగము వ్యాపించి యేయుండును. కృతాదియుగములనుండి నేటివరకు సాధు

మార్గము సుఖమునకు అసాధుమార్గము కష్టములకు హేతువై నట్లుండవలెరింగిన దే. అయిననూ దుష్టరాజ్యములు పూర్వమున నేడునూ గల్గుచునేయుండుట భూలోక సహజము. దైవచిత్ర మనదగును. యీ రెండుమార్గాలకు యెడ తెగని విరోధమేగల్గి యుండును. హిందూమత గ్రంథాలలో దేవునిపూజ సత్యా హింసాది గుణములుగల్గి సాధు ప్రజల సృష్టించుచు దుష్టుల పుట్టింపరాదు. (అదెట్లనిన శాస్త్రములు చదివి నిర్ణయించు కొనునది.) సాధువుగా నడచువారికి, హిందూ, మహమ్మదీయ క్రైస్తవ బౌద్ధమతాది భేదములుండవు. ధర్మాధర్మనిర్ణయ ములగాని యుద్ధములుగల్గుటగాని యీ మతస్థులందరిలో సాధువు లోకపక్షస్తులుగాను. అసాధువు లోకపక్షస్తులుగా నూ చేరుచుందురు. మతము పేరిటనగా దేవుని పేరిట స్వలా భమునకై యుద్ధములుచేసి కొద్ది భూలోక సుఖములంది నశిం చిరి. నశించుచున్నారు. నశించగలరు. (ఔరంగజేబు, శివాజీ) (వీరవైష్ణవ, వీరశైవ భౌద్ధశంకరమతములు) మహమ్మదీ యమతములో క్రీస్తుమతములో భిన్నమతస్తులు రాజ్యము లకై యుద్ధములు చేసిరి. విశ్వామిత్రుడు భిన్నమతములను రాజ్యమువిడిచి కులాతీతము, మతాతీతము, సంఘాతీతమగు బ్రాహ్మణత్వసిద్ది వంటరిగా నానాకష్టములుపడి సంపాదించి, బ్రహ్మర్షి యనబడెను. అతడు మరల రాజ్యమునే కోర లేదు. రారాజుల దేవతలచే పూజింపబడుచు నిత్యానందము లో కాలముగడపెను. ప్రతిమానవుడు, భూలోకమున సుస్థిర

రాజ్యమున సుస్థిర గృహావాసము చేయుచు దేవుని పూజిం చుచు ధర్మమార్గమునున్న అనుభవము తెలిసి 55 యేండ్లు దాటిన తర్వాత వార్ధక్యమువచ్చును గాన మిగిలిన జీవితకాలమంతయు బ్రహ్మనిష్ఠసిద్ధికై పాటుబడుటే లోకైకమతము. భూలోకమంతటికి లోకకల్యాణదాయకమగు ఒకేమతముండిన దోషము లేదు. లోకైక భాషయున్న సర్వగ్రంథాలలోనున్న సత్యములు, ధర్మములు, ముఖాముఖిని తెలుసుకొందురు. రెండవవారు మార్పుచేయుటలో తప్పుచెప్పిన అధర్మవృద్ధియగుచుండును. గాన లోకమునకుగాని దేశమునకు గాని ఒకేభాషయుండుట అవశ్యకము. భూలోకమునకు ఒకే ధర్మరాజ్యము గాని అట్టిధర్మము నాచరించు భిన్నరాజ్యములుగాని యున్న భూలోక సుఖము పరసౌఖ్యములందవచ్చును. దేవుని పూజించు అంబరీషాది రాజులు రాజ్యము లేలలేదా! అన్న వారు పరరాజ్యాపేక్ష లేనివారు. తమరాజ్యమున ప్రజలందరికి సత్యాహింసాదిమార్గముల బోధించి శిక్షించి నేర్పువారు. రాజ్యముపై భ్రాంతిలేని నిష్కాములు. తాము బ్రహ్మనిష్ఠసిద్ధిచేసికొనుచు లోకులను ఆస్థితిని చెందనేర్పువారగుటచే రాజ్యభ్రాంతి లేనివారు తమపై పరులు దండెత్తిన వారి గర్వమున డంపశక్తివంతులయినవారు. నేడును అట్టి రాజుగాని రాజ్యపక్షస్థులుగాని అయినచో రామరాజ్య ప్రజలవలెనే సౌఖ్యములందగలరు. గాన ప్రకృతి విద్యతోబాటు బ్రహ్మవిద్యాభివృద్ధిచేసినగాని గ్రామము, పట్టణము, దేశము, లోకము బాగు

నడచును. అనేక పార్టీలు వృద్ధియగుచునే యుండెను. మత రాజ్యమగు పాకీస్థానములోనూ, సంఘరాజ్యమగు రష్యాలోను అధ్యక్షులు త్వరత్వరలో మార్పుచెందుటకు కారణము రాజ్య భ్రాంతియే అనదగును. దీని అమతస్థులు అసంఘస్థులు కొద్ది కాలము భుక్తిసుఖము గోని వారిలోవారికి కలహములు గల్గి అమతపక్షము, అసంఘ నామరూపములు లేకపోవుచుండును. ఇదిసహజము, గాన ప్రస్తుత పాకీస్థానములోవలెనే మన హిందూ సభవారి మతపాలన అంతః కలహములతో భుక్తిమాత్ర మిచ్చునదియని తెలియదగును. దేవుని పూజించుట సత్యా హింసాది సద్గుణఫలములు తామందువరకు ఆచరించుచు పరులకు నేర్పుట బలవంతులు సన్మార్గులగు సత్సంతతివృద్ధి చేయుటే లౌకైకమతము. హిందూమతరాజము. మహమ్మ దీయ మతములోవలెనే హిందూమతమునను అనేకభేదములు గలవు. గానతమకుహితమగు ఉపనిషత్తు, గీత, పురాణములలో గల భగవత్పూజ సత్యాహింసాది మార్గములనడచుచు సాధు స్త్రీల సాధుపురుషుల గనుటే లౌకైకమతము. సర్వజనాదర ణీయ మతము. యిదేహిందూమత శ్రేష్ఠధర్మ వేదాంత బ్రా హ్మణమతము.

## "రామకృష్ణ పరమహంస- వివేకానందుడు- సంఘము"

రామకృష్ణ పరమహంస ఒంటరిగానుండి దేవినర్చిం చియు దేవునర్చించియు ధనాదులు లేకున్నను అధికవిఖ్యాతి

గాంచెను, యీస్థితిని ప్రతివాడును బీదవైన, ధనవంతుడయ్యి ఆచరించిన మంచిఫలము కలుగకపోవును. ఆయనతనమార్గములు కొందరికి చెప్పనగా వారాచరింపలేకపోయిరి. వివేకానందుడు మాత్రము ఆయనవలె ఒంటరియై హిమవంతమునకేగి ఆమార్గసిద్ధిచెంది అమెరికాదిదేశాల భారతమున ప్రసిద్ధి చెందెను. గానివివేకానందుడు గురువువలెగాక ధనమార్జించి సంఘము స్థాపించెను. యీసంఘస్థులకు రాజ్యభ్రాంతి లేదు గాని రాజసేవకులు కొందరుగలరు. భగవత్సన్యాసమన, భగవంతుని కృపకై కొంతకాలమును వ్యయముచేయుట ఒంటరిగా నుండియే చేయదగునని తెలిసియు వివేకానందుడు సంఘము స్థాపించుట కొందరికాహార తృప్తినిచ్చుటేగాని తనవంటి, తనగురువువంటి శక్తివంతులు అందు వృద్ధియగుటలేదని కొందరు నాతోననిరి. గాని వారిలోగూడ ఆహారతృప్తిచేసికొని ఒంటరిగా భగవధ్యానాదులు చేయుచున్నా రాజర్షి, ఋషి, మహార్షి, బ్రహ్మర్షి, పదవులంది జనులకు ఆదర్శకపురుషులు కాగలరు. లేనివో ఆహారతృప్తివల్లగల్గు సుఖమేపొందెదరు. క్రీస్తుమతమున మహమ్మదీయమతమున జనులు సంఘములుగా జేరిదేవుని ప్రార్థించుట గలదు. యిట్లేహిందూమతములోగల స్వర్గమార్గస్థులుగూడ చేయుచున్నారు. కైవల్యమార్గస్థులు ఒంటరిగానుండియే దేవుని పూజించవలయునని శాస్త్రము.

దక్షస్మృతి:— ఏకోభిక్షు ర్యథోక్తస్తు ద్వావేవ మిథునం స్మృతం, త్రయోగ్రామః సమాఖ్యాత ఊర్ధ్వంతు నగ

రాయాతే నగరంహి నకీర్త్స్యం గ్రామోవా మిథునంతథా,
యేతత్త్రయంతు. కర్మాణి స్వనగ్మాత్ చ్యవతే యతిః॥

భగవద్ధ్యానము చేయువాడే భిక్షువని, యతియని చెప్పబడెను. యిట్టివాడు ఒక్కడే వుండదగును. యిద్దరుండరాదు. యింత కలుస్తే మిథునమో, నగరమో, గ్రామమో అగును. గాన కూడనివి. వివేకానందుడు గురువు, అతనివున్న శిష్యులు, భిన్నులుగాక సమిష్టియైనవారలగుదురు.

పూర్వోక్తులు కొలది శిష్యులతో గృహస్థుడు పల్లలవలె ఒకాశ్రమాన నుండెడివారు. లేక గురువువద్ద అర్థము తెలిసికొని ఒంటరిగా ఆచరించువారు. లోకకళ్యాణము చేయు అందరూ గలసి జనులకు బోధించి మరల ఒంటరిగా నుండినట్లు గనుపించుచున్నది.

యజమాని సమిష్టిచేయువాడు భార్య పిల్లలు సేవకులు వ్యష్టి. వీరందరు యజమానితో సమిష్టి అగుచుందురు. యజమాని లేనిచో భిన్నులగుదురు. నిర్వీర్యులగుదురు. గాన యజమాని యుండగానే తగిన పుత్రులు యౌవనులై యున్న మరల యజమానత్వము గల్గి యింటినిసమిష్ఠిచేయును. ఇట్లే వృద్ధియై దేశకళ్యాణము చేయ సంఘమునకు కొన్ని చోట్ల ధనము నిల్వచేసెనుగాని వివేకానందుని తర్వాత వానివలెనే స్వదేశ విదేశములలో ప్రఖ్యాతులగువారందే కారణముననో బయలుదేరుటలేదు. కొందరు దేశములో యితర దేశములో తిరిగి ఉపన్యాసములిచ్చుచున్ననూ వివేకానందునంతటివిమిన్న

ప్రఖ్యాతి పొందలేదు. పూర్వభ్రాంతులు తీసి యూనసంఘాను ద్వారలో చేర్పుసి శక్తి సంపాదించి, రాజర్షి, ఋషి, బ్రహ్మర్షిత్వము సిద్ధిగాంచి లోకకళ్యాణము చేయుదురుగాక! హిందూ మహమ్మదీయ క్రీస్తుమతస్థులు దేవాలయములసంఘములుగా జేరి దేవుని పూజింతురు. దీని సామాన్య ఫలము ఇదని నా యూహ.

## భగవద్భక్తులకు రాజ్యముండదగునా?

పూర్వర్షులు తామేలకున్ననూ పరరాజులకు సత్యాహింసాది ధర్మములు తెల్పుట రాజ్యముండవలెననేగదా! అట్లే గృహరాజ్య ముండవలెననేగదా? కొందరు నైష్ఠిక బ్రహ్మచారులు అరణ్యవాసులై రేగాని యెక్కువగా గృహస్థులగు ఋషులకు, రాజునకు మిత్రత గలదు. సత్కామ నిష్కామ సన్మార్గరాజుల గౌరవించువారు. దుష్టరాజుల గౌరవించువారు కాదు. రాజ్యమున్న అనేకులు తరింతురు. అరాజకమున్న సమిష్టిచేయు రాజుగాని, రాజ్యపక్షముగాని, లేనిచో జనులు భిన్నభిన్నులై నశింతురు. అరాజకము సంధ్యకాలము వంటిది. వెలుతురిచ్చు సూర్య చంద్ర నక్షత్రాలు లేని కాలము. ఈ కాలాన సర్వ పశు పక్ష్యాదులు రొదచేయును. భయంకరముగ యుండును. ఇట్టి స్థితే అరాజకము. గాన భగవద్భక్తులగు వారికే సుస్థిర రాజ్యము, గృహరాజ్యముండవలెనను పూర్వర్షుల అభిప్రాయమే నా యభిప్రాయము. నేను చెప్పు లోకైకమతధర్మములు బొద్ధ

మతమునకు పై కాలపుఋషి, బ్రహ్మర్షి, మతధర్మములుగు గాను న్నవి. ఇవి కులాతీతములు. దుష్టమతాతీతములు. దుష్టసంఘాతీతములువారిధర్మములాచరించి రాజర్షి, ఋషి, మహర్షి, బ్రహ్మర్షిత్వము చెందిన రాజ్యమేలు రాజులు చాలమంది గలరు. దశరథుని రాజ్యమున ప్రజలు మహర్షులువలె ప్రకాశించినికలరు. పూర్వర్షులకు దుష్టరాజ్యములుండుటయిష్టము గాదు. గానిసూర్యచంద్రులు చీకటి నశింపచేయ రాత్రి పగలు ప్రకాశించునట్లు సాధువులు రాజ్యమేలుటయు, నిత్యము సాధుమార్గరాజ్యముండుటే ఎప్పుడు సాధుగృహరాజ్యములుంటే వారికిష్టమైనట్లు వారిగ్రంథములు చదివిన కనపడుచున్నది.

## లోకకళ్యాణ మెట్టిది?

దుష్టరాజ్యములో రాజ్యపక్షస్థులే సుఖముగాంతురు. రైతులు, వర్తకాది వృత్తులవారు నానా కష్టముల పాలై స్వాతంత్ర్యము లేక యుందురు.

ఉదా:— కంసాది దుష్టరాజులు, హిట్లరు.

తన్ను ధర్మమార్గమున రక్షించుకొనుచు, పరులప్రాణముల యుద్ధాదులనుండి కరువులు మొదలగు వాటినుండి కాపాడదలచుటే లోకకళ్యాణము. ఇదే లోకైకమతము. లోకైకమత మనేక రీతుల మీరు వ్రాసినారు. ఇందేది లోకైకమతమన్న సాధుమార్గములు నానా విధ శుభసౌఖ్యము లిహమున పరమున గల్గు మార్గము లన్నియు కలిసి లోకైకమతమగును. దుర్మార్గత్యాజ్యమే లోకైకమతము. అందు లోకే

శ్వరుడగు భగవంతుని రాజర్షి, ఋషి., మహర్షి, బ్రహ్మర్షిత్వము సంపాదింప సర్వేంద్రియార్చన చేయుచు తాను ఒంటరిగానే చేయుచు తన్ను ధర్మమున రక్షించుకొనుచు పరప్రాణరక్షణ చేయదలచుట మరింత సౌభాగ్యదాయకము. ఇదే లోకైకమతరాజము.

## బ్రహ్మవిద్య భూలోకస్థులందరికి అర్హత గలదా?

గీత– 9 అ. "మాం హి పార్థ! వ్యపాశ్రిత్య యేపిస్యుః పాపయోనయః। స్త్రియో వైశ్యాస్తథా శూద్రాస్తేపియాంతి పరాంగతిం। కింపునః బ్రాహ్మణాః పుణ్యా భక్తా రాజర్షయ స్తథా। అనిత్యమసుఖం లోకమిమం ప్రాప్యభజస్వమాం॥"
భూలోకమంతయు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులని 4 జాతులుగా నున్నది. తెలివిగల్గుటను లేకపోవుటను యీ 4 జాతులును, "అత్రిస్మృతి" 10 జాతులుగా నిర్ణయించెను. దేవ, ముని, ద్విజ, క్షత్రియ, వైశ్య, శూద్ర, నిషాదక, పశు, మ్లేచ్ఛ, ఛండాలురని చెప్పబడుదురు. అనగా గుణకర్మములచే ఒక్కొక్కజాతిలో 10 జాతులు గలవు. (ఇంకా యెక్కువ జాతులుగా కొన్ని స్మృతులందు గలదు). ప్రతిమనుష్యుడూ గుణకర్మముచే యేదో ఒకజాతికి చెందకమానడు. ఇవి కులములని చెప్పు భారతదేశములోను, సంఘములని చెప్పు పాశ్చాత్యదేశములోనూ ఫలానివారు, ఫలాని కుల, సంఘ, సంజ్ఞలు నామమాత్రములేగాని గుణకర్మముచే గల్గు ఫల

మునే, బొందుదురు. గాన పాపయుక్తులును, పుణ్యాయుక్తులగు సర్వమానవులు స్త్రీలు భగవంతు నర్చించిన, పుణ్యపాప బంధము విడనాడి బ్రహ్మర్షు లగుదురు.

గీత:- అక్షరాణామకారోస్మి 'అ' కారము భగవంతుడు. గాన అసుఖము అనిత్యమగు యీ లోకాన 'అ' అన బ్రహ్మనిత్యం ఎప్పుడు వుండును. భగవంతుడు నిత్యుడై యుండును. అతని నర్చించిన 'అసుఖం' బ్రిహ్మర్షిత్వసుఖము గల్గునని భావము. భగవంతుని పూజింపకున్న బ్రహర్షిత్వము లేక ఎంతధనాదులున్ననూసుఖాదులు లేకమనోవికల భయాదులతో కాలము గడచును.

## భారతదేశమున ప్రజారాజ్యము పూర్వమందే గలదు

ప్రజారాజ్యములు పాశ్చాత్యులకన్న భారతీయులు కృతయుగమున నే కనుగొనిరి. రాజురాజ్యముకన్న ప్రజారాజ్యమే మొదట స్థాపించబడినది. తరువాత రాజురాజ్యము. తరువాత కలిలో ప్రజారాజ్యము గల్గునని వ్యాసుడు రచించెను.

భారతము శాంతిపర్వము:- పూర్వకాలము ప్రజారాజ్యము సమిష్టిచేయు పక్షమొకటున్నగాని జనులు బాగుపడరని భిన్నులై నాశనమగుదురని భయపడి సన్మార్గపక్షమొకటి బయలుదేరి రాజు లేక రాజ్య మా పక్షము కొంత కాలమేలినది. ఆ యేలుకాలమున దుర్మార్గులు వృద్ధియై

సన్మార్గుల శిక్షించ మొదలిడినారు. బ్రహ్మను ప్రార్థింప మనువును సృష్టించి రాజుగా చేసి బ్రతుకుడనియెను. రాజు జనుల సమిష్టి చేయు శక్తిగలవాడని చెప్పెను. అతడు నిష్కామ సత్కామమార్గాలు, వేదాంతశాస్త్రప్రచారముచే నేతెను. అప్పటినుండి బలవంతుడగు రాజు, మంత్రులు శాసనసభలలో సేవకులతో బ్రహ్మవిద్య నేర్చి, కలిలో కొంతవరకు జనుల సమిష్టిచేసి పాలించినట్లున్నది. మొదట కృతయుగ భారత రాజ్యపక్షము, ప్రస్తుత పాశ్చాత్యులవలె సత్సంతతి వృద్ధి చేయక దుష్టసంతతి వృద్ధిచేయుటచే ఆపక్షము నాశనమై, మనురాజపాలనకు వచ్చినది. గాని బలవంతులగు సత్సంతాన వృద్ధి వారు చేసియుండిన ఆపక్షము నాశనముగాక అప్పటి నుండి నేటివరకు నుండెడిది. నేటి రాజురాజ్యము నశించినది. తర్వాత ప్రజారాజ్యము ప్రారంభమైనది. రాజు అను పేరే గాని యుండు మంత్రులు, రాజసేవకులు, శాసనసభాసేవకులు గలసిన రాజురాజ్యము నొకతెరగు ప్రజాపక్షరాజ్యమే కాగలదు. గాని పూర్వపురాజులు సృష్టిలో సామాన్యప్రజలకన్న వేలకొలది జనులనైనను యొక్కడే జయించగల శక్తివంతులయి గొప్పరాజయోగముగలవారై పుట్టింపబడిరి. (హరి వంశము:— కలిధర్మములు— రాజు రాజ్యము నశించి ప్రజలచే యెన్నుకొనబడిన ఒకబలవంతునిచే రాజ్యము పాలింపబడునని అనగా ప్రజారాజ్యపాలన కలిలో జరుగునని వ్యాసుడు ముందే రచించెను.

హరివంశము:— ఉత్తరభాగము 9 ఆశ్వాసము.

తే॥ గీ॥ కుటిల మన్నియుమమ్ము దమ్ము గూటున ప్రజ
పెద్దసేయగ నొకరాద పేరు దాల్చి
బలియు రేలెన రిరుల దూటులుగ ద్రుంచి
ధరణి దానుయేలికలుసు ఎన్నగలుగ॥

ప్రతిరాజు గొప్పసంతతిని గనుటకు చాల కష్టపడి సంతతి వృద్ధిచేసినట్లు గలదు. అతడు నిష్కాముడుగాని సన్మార్గుడుగాని యైననాడు జనులు సుఖించిరి. దుర్మార్గుడైన జనులును అతడును నానా కష్టములుబడి నాశనమైరి. దీన దుష్ట ప్రజా రాజ్యమైనను, దుష్టరాజైనను ఒకటే ఫలము. సన్మార్గ పక్షరాజ్యమైనను సన్మార్గరాజైనను ఒకటే ఫలము. సన్మార్గ పక్షము సమిష్టి యగుటచే అన వారందరొకమాట వారగుటచే ఒకరాజగుట హరిపాలనచే జనులు సమిష్టి యగుదురు.

## వ్యష్టి — సమిష్టి

ఒకగొల్లవానిచే గొర్రెలగుంపు సమిష్టియైసు ఖపడును. గృహమునగు సన్మార్గ యజమాని అయినచో అతనిభార్యా పిల్లలు సేవకులు సమిష్టియై సుఖపడుదురు. గ్రామాధికారి తాను బలమగు సత్యమగు సన్మార్గుడుగాని నిష్కాముడుగాని యైనచో గ్రామమున రెండవపక్షవృద్ధిలేక జనులందరిని సమిష్టిచేయగలడు. అతడు సరిలేకున్న భిన్నపక్షములా గ్రామమున బయలుదేరి నానా కష్టముల పాలగుచుందురు.

ఇటులే తాలూకాధికారి, యిటులే జిల్లాధికారి, యిటులే రాష్ట్రాధికారి, ఇటులే దేశాధ్యక్షుడు అయిన జనులు భిన్న భిన్నపక్షములుగాక సంతోషముతో సమిష్టి యగుదురు. సమిష్టి చేయువారున్న తర్వాత సౌఖ్యాధి మంచి ఫలములు పొందుట గల్గును. సన్మార్గమగు రాజ్యపక్ష మొకటి యున్న ఆరాజ్యప్రజలందరు (కొలదిమంది గాకున్నను) సమిష్టి యగుదురు. భూలోకస్థులు యింద్రాదులు బ్రహ్మలోను, అతడు విష్ణువున, అతడు శివునిలో, అతడు బ్రహ్మముతో గూడి సమిష్టి యగుదురు. అట్టి విష్ణు, శివ, బ్రహ్మముల పూజించిన వారు బ్రహ్మర్షులై సర్వసమిష్టిచేయగలరు. ప్రజాపక్షరాజ్యమన "ప్ర"=యెక్కువగా "జ"=పుట్టుకగల అనగా గొప్ప సన్మార్గ నిష్కామ సత్కామ సన్మార్గులగు రాజయోగ జాతకులు మిత్రతతో కలిసి ఒకేధర్మమున నడుచు పక్షము. యిట్టి పక్షమున సామాన్యజాతకులున్ననూ గొప్పరాజయోగ జాతకులు కొందరుందురు. వీరు సన్మార్గ రాజసమూహా మొక పక్షమై దుష్టపక్షముతో యుద్ధముచేయునట్లు తమరాజ్యమున గల దుష్టుల నేరి పార వేయుదురు. దాన సన్మార్గమెక్కుడై ఆ రాజ్యజనులు, రాజపక్షము సుఖమందును. భారత యుద్ధము:— పాండవులు సన్మార్గులు వీరితో ననేక రాజులు గూడి సమిష్టియైరి. భగవంతుడగు కృష్ణుడును వీరితో సమిష్టి ఆయెను. వీరందరు యేకమగుట యెట్టిదో అట్టిది ప్రస్తుత ప్రజారాజ్యమేలు పక్షము. ప్రస్తుత భూలోకమున ప్రతిదేశ

మందు స్థిరమైనచో దుర్యోధనాది దుష్టపక్షమును పాండవ పక్షము హరించినట్లు రాజ్యమున గల వ్యభిచార దుష్ట మద్య పాన దుష్టద్యూతాది దుష్టవృత్తులు తమ దేశమున లేకుండా చేయగలరు దాన జనులు బాగుపడుదురు. ఒకడే రాజైనను ఒకేరాజ్యపక్షమైననూ ప్రజాంగీకారము లేనిచో పాలన జరుగక అధ్యక్షులు గంటగంటకు ఫ్రాన్సులో వలె మారుచుందురు. దుష్టుడు నిరంకుశుడగు రాజొకడైననూ దుష్టనిరంకుశ రాజ్యపక్షమైనను పాలనకు వచ్చిన ఆరాజ్యప్రజలు నానా దుఃఖముల పాలగుదురు. కొద్దికాలమూ రాజ్య పక్షస్తులు సుఖపడిననూ అంతమున నానాబాధలు పడుదురు. ధర్మమునకు అధర్మమునకు పూర్వము నేడునూ ఒకేఫలము గల్గుచున్నది. దుష్టరాజ్యపక్షములో కొలది కాలమునకు భేదము గల్గును. అప్పటినుండి అంతర్గతముగ నారంభించును.

ఉదా:- ఇంగ్లండుదొరలు, భారతమున- మహమ్మదీయ పాలనకన్న ధర్మముగాను అనగా మతము విడిచిన పాలనతో తమ స్వలాభమెక్కుడు చూచుకొనుచూ జనులకు సామాన్యలాభములు గలుగచేయుచు పాలించిరి. ఇట్లుండ వారిలో దొరలు మొదట కొంతమంది హిందువులలో కాంగ్రెసును స్థాపించిరి. అది మెల్ల మెల్లగా వృద్ధియైనది. తర్వాత అన్నిజాతులవారు అన్నిమతములవారు గలసి రాజ్య సన్యాసమున రాజ్యము సంపాదింప తమకాలమును వ్యయము చేయుటకు ఆరంభించిరి. అది సత్యాగ్రహము, అహింసలతో

ఆరంభించిరి. ఈ పక్షములో కొందరు నిజమైన సత్యవ్రతులు సత్యముగా అహింసచేయువారు అయి యున్నారు. కొందరు రాజ్యము వచ్చుదాక ముక్కు మూసుకొంచామని కష్టముతో అపరితాదులుచేయదొడగిరి. వీరందరిని రాజ్యమేలు యింగ్లీషు వారు నానాబాధలు పెట్టిరి. దానికి వారు సహించిరి. దానిచే క్షమావ్రతమైనదని నా యూహ.

"భారతము—శాంతిపర్వము" — హంసగీత:— ఒకరు నిందించిన ఊరుకొనిన వారిపుణ్యము నిందింపబడువారు పొందుదురని కలదు. దుష్టులు బాధించునపుడు వారివంక జూచి అధర్మముగ దానిముక్కుతో యెక్కువగా "సోహం" మను చుండుట మానవసహజము. "సోహ"మన అతడు నేనే అని అర్థము. దాని వారియందు గల పుణ్యము, శక్తి వారి నావేసించును. ఇట్లు కొన్నియేండ్లు జరుగగా "సత్యమేవ జయతి" సత్యము జయించుచున్నది. క్షమలో వారిపుణ్యము, శక్తి వీరికి గల్గినదన్నట్లు యింగ్లండు దొరల నుండి భారతీయులకు స్వరాజ్యము వచ్చినది. అంత డాంబిక సత్యాహింసల బూనిన జిన్నా మొదలగు వారు రాజ్యము పంచ అనేకుల హింసించిరి, చంపిరి. దోపిడీలు చేసిరి. దానిలో కాంగ్రెస్ భిన్నమైనది. జనులు భయభ్రాంతులైరి. అప్పటి నాయకులు రెండుపక్షాల యేమిచేయునది తోచక నిర్విణ్ణులైరి. ఆ కాలమున పండిట్ నెహ్రూజీ, పటేలు, ప్రసాదజీలు ధైర్యస్థులై నిలవబడి రాజ్యము పంచి తమపక్షముకు సమిష్టిచేసిరి. పరపక్ష

భయము లేకుండా చేసిరి. అంతలో యీ పక్షములలోనూ పదవులకై అనేకపక్షములు గలిగెను. అట్లయినను వారు విడునక గృహస్థునకి క్షమ యుండదగును. వానికే రాజ్య పాలనకాలములో దుష్టుల శిక్షించుట సాధువులపై క్షమ యుండుటచే పంచమ వేదమగు భారతధర్మము నాచరించిరి. పాకిస్థాన్ కాశ్మీరు యుద్ధము చేసిరి. దీనితో రాజ్యము స్థిరమైనది. ఇప్పుడు కాంగ్రెస్‌కి వ్యతిరేకపక్షములున్ననూ దానిని ప్రస్తుతము కదల్చలేవు. జనాంగీకార మెక్కువున్నది. వీరు రాజ్యకాలములోను దుష్టుల బాధించిన రాజ్యము లేకున్న పుడుచేసిన అహింసవ్రతము మాని ఊరుకొందురని దుష్టులు విజృంభించి నాశన మొనరించి యుందువారు. పూర్ణదుష్టులతో యుద్ధము తప్పక చేసిరి. మాకు పర రాజ్యముపై భ్రాంతి లేదు. మాపై దండెత్తిన మాప్రాణమున్నంత వరకూ యుద్ధాదులలో వారితో పోరాడెదమని వెల్లడిచేసిరి. ఉదా:- పాండవులు ఒకరి ప్రమేయము లేక రాజ్యమేలు తరి అసూయచే దుర్యోధనుడు వారిని చంపవలెనని యుద్ధము చేసెను. ఆ దుష్టునికి 11 అక్షౌహిణులు, పాండవులకు 7 అక్షౌహిణులు సైన్యము చేరెను. 4 అక్షౌహిణులు ఓటు లెక్కువయున్ననూ పూర్ణ దుష్టుడగుటచే దుర్యోధనుడు ఓడి నశించెను. గాన దుష్టులకు ఓట్లు యెక్కువ గల రాజ్యము నానా కష్టములు పాలగును.

పర రాజ్య భ్రాంతి లేక పాండవులు పరిపాలించుకొను తరి

దుర్యోధనునితో యుద్ధము ప్రారంభించెను. ఆ యుద్ధమున అర్జునుఁడు, బంధువులు, గురువులు మొదలగు వారిని చంపిన దోషమని "నేను యుద్ధము చేయ"ననెను. అది చూచి కృష్ణుడు "ఒకరి ప్రమేయము లేకుండా రాజ్యము చేసికొనుటకు బంధువులు గురువులయినను దుష్టులై అధర్మ్యయుద్ధమునకు పైబడితే విడువక వారితో యుద్ధము చేసి తమ్మును ప్రజను రక్షించుకొనవలెననియు, యుద్ధము చేయు కాలములోనను శ్రీపురుషస్వాంద్వరూపుడగు భగవంతుని స్మరించుచూ యుద్ధ వీరులనందరిని భగవంతునిగా చూచుచు యుద్ధము చేసినను దాన పాపము లేదనెను. దాన అర్జునుడు సందేహము వదలి యుద్ధముచేసెను. ఆ కాలముననే 'భగవద్గీత' చెప్పబడెను. (అశోకుని తర్వాత బౌద్ధులు అహింసా వ్రతమును బూని దుష్టులు తమపై బడ యుద్ధముచేయ మానుకున్నందున వారు, ప్రజలు కష్టముల పాలైరి.) సారాంశము— యుద్ధములోనను శత్రువులను, తనవారిని, తన్నును భగవంతునిగా జూచుకొనుచు, తనహృదయమున భగవంతుని స్థాపించి, దుష్టులతో యుద్ధముచేయదగుననియు, దాన దోషము లేదనియు కృష్ణుడు చెప్పెను. ఈ కృష్ణుడు చెప్పిన దివ్యదృష్టి భగవత్స్మరణ పాశ్చాత్యయుద్ధాలలో యెంతమాత్రము లేదు. యోగ్యరాజ్యములో గృహస్థులు మాత్రము తమపైబడు విరోధులున్న రాజుతో చెప్పి శిక్షింపవలెనేగాని వారితో కలహములు పొందరాదు.

ఆర్యా! తమకు కాంగ్రెసుపక్షమున్న అభిమాన మే కున్నవగదా అన్న వట్టి అభిమానముతో చెప్పుదానిని మంచి దన్నను కాదుగదా. నాకు బాల్యమందే మా తలిదండ్రులు ప్రొద్దున్న సాయంత్రం భగవత్సన్యాసమున భగవంతునిగూర్చి జపధ్యానాది యజ్ఞములు సేయుటను అలవాటు చేసిరి. నాకు కొందరు బాల్యమున 20 యేండ్లలో గండమున్నదని చెప్పుటచే నేనొక్కడనే అగుటచే భయపడి దేవుని పూజించిన తొలగునని వారట్లు చేసిరి. అందుచేతనే ఆ గండముల బాధ నాకు గల్గలేదని నమ్మకము. బాల్యమునుండే విద్యాసన్యాసముచేసి కవినై గావనుడనైతి. 20 యేండ్లు దాటిన తర్వాతనే మావారు వివాహముచేసిరి. తర్వాత గృహస్థసన్యాసము వ్యవసాయసన్యాసమున బడియు, భగవత్సన్యాసము విద్యాసన్యాసము విడువలేదు. ఇట్లుండ 25వ యేట "హిమవత్పర్వతనివాసి" కోదండరామరాజావధూత భగవద్గీత, ఉపనిషత్తులు, పురాణాల గల బ్రహ్మవిద్యాసన్యాసము నేర్పెను. ఈకాలాన కాంగ్రెస్ విజృంభించినది. దానిలో ననేకులు జేరి సత్యాహింసలు ఆచరించుట సంతోషముగా నుండెడిది. నేనొక్కడనగుటయు మా తలిదండ్రులు వృద్ధులగుటయు నాకు భగవత్సన్యాసము, విద్యాసన్యాసము, కవిత్వసన్యాసముండుటయు వ్యవసాయ సన్యాసముండుట, గృహస్థసన్యాసముండుటచే నేనా పక్షమున చేరలేదు గాని కాంగ్రెస్ యేమగునో— దానిని గ్రంథమున చేర్పవలెనని

నాకు గలదు. నేడంటుచే సత్యమే వ్రాసితిని. పైగా మన పూర్వగ్రంథాల సత్యము వెల్లడిచేయవలెనని నా యూహా అగుటచే పద్య గ్రంథములు వ్రాయగలవాడనైనను అవి విడిచి ఆపద్యాదులకు, మూరు అర్థము చెప్పగలరని వచనము గానే యీ విమర్శగ్రంథమును వ్రాసితిని. నేను సత్యమని నమ్మినదే కాంగ్రెసువారు చేసిన ధర్మమార్గము విమర్శించితిని. గాని వట్టినే అభిమానమున వ్రాయు కవిని గాను. ధనమెంత సంపాదించినను భుక్తికే అను వాదములోని వాడను. గాన నిజమని తోచిన నమ్మమి లేకున్నమానుము. కాంగ్రెసువారిచే క్షమాసత్యఫలముల తేలినవనియు, పూర్వర్షుల వ్రాతలు నిజమనియు ఆచరించినవారు వ్రాసిన సర్వ శాస్త్రములు అర్థము తెలిసిన ఫలించునని సత్యమార్గములు వెల్లడించి వ్రాసితిని. నేను చెప్పునది శాస్త్రమార్గ సత్యార్థ నిర్ణయము చేయుట. ఆప్రకారమాచరించి చూచుటే. తప్పిన మార్గము చెప్పినవారు వ్రాసిన ఫలమందువరకు ఆచరించుటే పని యని నా యభిప్రాయము. పూర్వర్షుల గ్రంథములు తప్పులుగా వని నాయూహా. తప్పులని నీవు చెప్పు హీనమార్గాల నేను నమ్మను. గ్రంథములు వ్రాయను. గొప్పఫలమిడునవి జనోపకారమైన సత్యమార్గములు పూర్వర్షులవి వెల్లడించుటే నాపని. ప్రస్తుత పశ్చిమ దేశధర్మములు పూర్ణ ఫలమిడవని నా యభిప్రాయము.

ఉద్యోగపర్వము:— భారతము 2వ ఆ. 317 పద్యం॥

కం॥ ఎక్కడ నడచును సత్యం బెక్కడ ధర్మంబు బరగు,
నెక్కడ గలుగును జక్కటి నిలుచుం గృష్ణుం డక్కడ
నతిశుద్ధ మైన యగు జయ మధిపా॥

"సత్యంవద, ధర్మం చర" యీ రెండు సత్యం చెప్పుచూ మానవధర్మము నాచరించు వారిపక్షము దేవుడుండును. దాన జయమేర్పడును. ఒకపుడు దుష్టులు జయించినను సమూల నాశనముచేయును. భారతము 324 వచనము— దేవుడు యేకాగ్రచిత్తుడై యారాధించిన వారికి చేరువయగునని గలదు.

భారతము 327 పద్యము— "అతనిని పొందు నుపాయంబు నంతరంగ। నిగ్రహముగాక నార్యులను గ్రహింతు గోపి చిత్తవికారంబులు డిపి యేక, బుద్ధిగొలున ప్రసన్నత బొందు నతడు"— యివి ఒంటరిగా ధనాది వ్యయము లేక చేయుపని కదా. యిట్టి గొప్ప పని విడచుట గతజన్మ దుష్టకర్మ ఫలమనదగును.

మానవుడు దేనికై నిజమైన మార్గాన సన్యసించునో దానిని బొందగలడు. మార్గము దప్పినదేమోనని శాస్త్రములలోనూ విద్వాంసులలోనూ ఫలము రాకున్నపుడాలోచించి మరల నడచిన తప్పక ఫలము గాంచగలడు.

వృషభసన్యాసము:- ఎద్దుపై ప్రేమగలవాడై ఒకడు దానిని పోషించుచు నిద్దురలోను బైట దానిని చూచుచు దానిగొడవలోనే యున్న అజ్ఞానియగు యెద్దువంటి వాడగును

గాన గోదావరిదరి ఆంధ్రులిట్లు బండి. అగకత్తోలునప్పుడు ఎడ్లను 'హరి- హరి- హ- హ- హ-' అందురు. దానిదేవునిగా చూచి నడువుమని ఒకరికొకరు జ్ఞాపించుకొను వాక్యమై యున్నది. ఆ యెద్దునే దేవునిదృష్టితో చూచుట మంచిది అని తెలియు నగును.

రాక్షససన్యాసము (దుష్టసన్యాసము):- దుష్టగుణములు పరస్త్రీల చెరచుట, దుష్టమద్యాదులానుట, అబద్ధము అధర్మమున చరించినవారు రాక్షసులనబడుదురు. పుణ్యా పాప మిశ్రిలు నరులు. అందెక్కువ పాపులే రాక్షసులు. ఎక్కువ పుణ్యులే దేవతలు. వీరెప్పుడూ నుందురు. రాక్షసులవలె మానవులు కానలెనన్న యీ నడవడి గల్గిన వానిని రాక్షసులని జనులంగీకారముతో పిల్చుచుందురు, రాక్షసుల, సర్పముల నశింపచేయ పరాశరుడు జనమేయుడు యాగము చేసి విన్నము చెందిరి. గాన ఆ కులము పూర్తిగా నశించదు. ఈ గుణములు ప్రతివాడు మాని దేవునిగాని, దేవతలగాని పూజించుట మంచిది. ఈ రెండు అబద్ధమన్న సత్యము, అహింస, ధర్మ, క్షమ, శమ, దమాది సద్గుణములతోనున్నను మానవుడిహపర సుఖములు కొంత పొందగలడు. రాజ్యపక్ష సహాయము లేనిది ప్రజలెంత బాగుపడుదురో భగవంతుని విడిచిన సత్యాదులంత గొప్పగా ప్రకాశింపవని పూర్వర్షుల అభిప్రాయము. దేవుడు, దేవతలు లేడనుటలోనే నాయకుడు లేని రాజ్యమగును. దేవుడు సర్వలోకప్రభువు. దేవతలు

అవసి సేవకులు. వారిగ్గరు లేరనుటలో మానవుడు తానే రా[illegible] చరించి సత్యాహింసాదుల పూర్ణఫలము గల్గు వరకు ఆచరింపలేడు. దుష్టమార్గాలు త్వరలో ఫలమిడును. గాన వాసినే ఆచరించి జీవించి నానాకష్టముల, అగౌరవముల పాలగును. ఇతడే రాజైన దుష్టులచే కొంత గౌరవము, సాధ్వులచే అగౌరవము చెంది నాశనమగును. సత్యాహింసాదులు లేని గృహస్థుడెంత ధనికుడైననూ అగౌరవమేగాని గౌరవముండదు. సుఖముండదు. భయముతో చరించును. మానవుడు దేనికై సన్యసించిన ఆమార్గసత్యము తెలిసి నడిచిన దానినే పొందగలడు.

# రాజేంద్రప్రసాద్‌జీ సాధుసహకారము

(21—2—1956 ఆంధ్రపత్రిక)

అధ్యక్షునకు సాధువులు యోగి బిరుదులిచ్చిరి. దశరథునితో బోల్చిరి. సాధువులకు తుక్డోజీమహారాజు నాయకుడు. ఈ సాధువులలో యింజనీర్లు, వైద్యులు, ఉపాధ్యాయులు గలరు. రాష్ట్రపతి వారితో సాధువులే ఆధ్యాత్మిక విద్య వ్యాపింపచేయాలి. ప్రజలు భౌతిక సుఖాల కెక్కువ అలవాటు పడినారు. ఆధ్యాత్మికచింత ఉండుట మంచిదనియు, దైనికజీవితములో భౌతిక ఆధ్యాత్మిక వాదనలు మేళవింప

చేయగలిగితే భారత దేశము తనకు తానే నాయకత్వము
వహించుటగాక శాంతి సౌఖ్యముల నైపు ప్రపంచ ప్రజల నడి
పింపగలదు. సాధు సేవక సమాజ్ వంటి సంస్థ అవతరణకు
వేచియున్నానని నేను. దీనింబట్టి జూడ వీరికి అధ్యాత్మ విద్య
యందెక్కుడు ప్రీతి గలదు. దీని అభ్యాసము గూడ గలిగి
యుందురు. అంబరీషునివంటి యిట్టి అధ్యక్షుడు భారత దేశ
మున గల్గుట గొప్పభాగ్యము. భూలోక పర దేశాధ్యక్షులు
స్థిరముగాని భౌతికసుఖాపేక్ష తాము పొందుచు ప్రజలకు
చేయుచున్నారు. వీరు భౌతికాధ్యాత్మిక సమ్మేళన ప్రజల
చేసిన యిహ పర సర్వసౌఖ్యములు ప్రజలందగలరనుట దీని
బలము కొంత తెలిసినగాని పల్కలేరు. గాన భారతీయ సర్వ
జనులు సంఘము విడచి ఒంటరిగా అధ్యాత్మ విద్యాభ్యాస
మును ప్రతినాడు కొంతకాలము చేసిన సర్వసౌఖ్యము లంద
గలరు.



# వినోబాజీ

"ఆంధ్రరాష్ట్రము - పశ్చిమ గోదావరి జిల్లా - తణుకుపట్టణమునఁ"

బోర్డు హైస్కూలులో కొవ్వలి గోపాలరావు, బెజ
వాడ - పడమటలంక నివాసి గోపరాజు రామచంద్రరావు
యమ్. ఎ. గార్లతో కలిసి వినోభాజీ సాన్నిధ్యముచెంది నేను

వ్రాసిన పుస్తకములు కొన్ని వారికిచ్చి గీత 10 వ అధ్యాయమున "మచ్చిత్తా మద్గతప్రాణాః" అను శ్లోకమును చదివి దీని ఆచరణమార్గమెట్లని ప్రశ్నింప, ప్రేమతో గల్గునని ద్విభాషిప్రభాకరజీద్వారా చెప్పిరి. దాన నేను తృప్తిపడకుండుట జూచి, సాయంకాలము రమ్మనమనిరి. సాయంకాలము వెళ్ళగా ప్రభాకరజీ లేనికారణాన మాట్లాడుట జరిగినది కాదు. గాని ఆయన చేయు భూదానయజ్ఞములో ఒక సెంటు అయినను తీసుకొనక నిష్కాముడై మెలగుట గొప్పమార్గము. ఆభూములు సాధు బీద పోషణక్రింద నుపయోగపడవలెనని పండిత కవుల అభిప్రాయమైనను దుష్టులకు తిండియున్న దొంగతనము మొదలగు దుష్టకర్మములు మానుదురని వారియూహ యగుటచే పేదవారగు కార్మికులకే యివ్వదగునని వారి అభిప్రాయము. వీరిలో సాధు బీదలు యెక్కువ సన్మార్గమున చరింతురు. దుష్టులు కొందరు సన్మార్గులగుదురు. కొందరు మరింత దుష్టలగుదురు, పూర్ణదుష్టులు నిత్యాపకారము చేయుదురు. వీరి సర్వోదయమతము, వీరి నిష్కామత్వ భూదాన యజ్ఞముచే లోకప్రఖ్యాతి గాంచినది. వీరినిష్కామమార్గము సర్వజనులు గైకొని పరోపకారముచే చరించిన లంచగొండితనము మొదలగునవి నశించి సత్యమార్గమున బడుదురు.



# బుద్ధునిగురించి నా అభిప్రాయము

ప్రస్థుతబుద్ధమతము శంకరాదులు పేర్కొన్నట్లు నాస్తికమెక్కుడు బోధించుచున్నదని నా యభిప్రాయము. బుద్ధుని తరువాత నాస్తికులు, దుష్టులు, శుష్కవేదాంతులు అందు జేరి ఆమతమును నడిపించుటచే అది నాస్తికమతమని పేరొందినది. ప్రస్థుతమున్న బుద్ధమతాచరణ సరియైనదిగాదని నా యూహ. దీనిని మరల సత్యమార్గమున లేవదీసినచో ఉత్తమవేదాంతమార్గమే యగుచున్నది. "గౌతమబుద్ధ" అను గ్రంథము- చిరుకూరి వీరయ్యగారు యమ్. ఎ., బి. యల్., బెజవాడ. బుద్ధుడు వేదాంతాది సర్వశాస్త్రజ్ఞుడై అందు వేదాంతసిద్ధి యగువరకు "యురువేలారణ్యమున" ఘోర తపస్సుచేసి బ్రహ్మమునకు తనకు అభేదభావనచేసి బ్రహ్మత్వసిద్ధిజెంది (కృష్ణుడు, రాముడు, శివునర్చించి అతనిసమత్వము చెందినట్లు) యితడు బ్రహ్మర్షి లేక అవతారపురుషుడు అయెనని నా యూహ. ఇతడు బ్రహ్మోపాసకుడు. స్వర్గమునకన్న నిర్వాణము గొప్పదని వాదించి జనుల మెప్పించినాడు. గీత॥ 18 అ. కృష్ణుడు- సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ- (అర్జునా! అన్నిధర్మములు విడిచి నన్నే శరణుబొందుమన్నట్లు- "బుద్ధం శరణగచ్ఛామి" ధర్మం శరణగచ్ఛామి- సంఘం శరణగచ్ఛామి" అనగా తననే శరణుబొందమనియు- అట్లే ధర్మ సంఘముల శరణు బొందమనియు

దాన కైవల్యము గల్గునని బోధించినాడు. ఇతని మత మున శివకేశవాదులు లేరు. బుద్ధుడే దేవుడు. ఇతడు ఆప స్తంభస్మృతి– ఆత్మవత్సర్వభూతాని। పరదారాణి మాతృ వత్। లోష్టవత్ పరద్రవ్యాణి యః పశ్యతి సపశ్యతి॥ సర్వభూ తముల బ్రహ్మైక్యము చేసిన తనవలె జూచుట. (లేక తనున్ని పరులను భగవంతునివలె చూచుట) పరస్త్రీలను తల్లివలె చూచుట, పరద్రవ్యమును మట్టిబెడ్డవలె చూచువాడు చూచువారు. తక్కినవారు అంధస్నములు. బుద్ధుడు బ్రహ్మై క్యముచేసి తనవలె సర్వభూతముల చూచు దివ్యదృష్టి సిద్ధుడు. పరస్త్రీ. పరద్రవ్యవిముఖుడు. గాన ఆత్మమతస్థాపకు డయ్యెను. దానిలో ఆకాలమున అనేకులు చేరిరి. ఎప్పుడు రాక్షసులు, దుష్టులు, హీనులు వృద్ధియై మతముల రాజ్య ముల ఆశ్రమముల జేరుదురో, వాటిధర్మములు కూల్చుచుం దురు. గాన ఎప్పటికప్పుడు జనులు గొప్పఫలమిడు వేదాంత మార్గమును, ఇతర సచ్ఛక్తిమార్గములను ఫలహీనములగు దుష్టరాక్షసుల మాటలు విని అభ్యసింప మానరాదు. శుష్కవేదాంతు లెట్లుందురన్న అంతటనూ భగవంతుడు. మనమునూ భగవంతులమే. వ్యభిచారాదుల దోషములేదు. సత్యాహింసలవల్ల లాభము లేదు. దేవుడు లేడు. ఇక అతని ఐక్యముచేయుట యెందులకు? మన యిష్టముల చొప్పున యెటుపీలైన అటు నడువవచ్చు. శుభ్రముగా భుజించుటే సౌఖ్యమార్గము. "ఋణం కృత్వా ఘృతం పిబేత్" నేయి

తాగిన రోగము లుండవు. దాన దీనిని ఋణము చేసియైనను త్రాగదగును. స్త్రీ పురుషులే సృష్టికి మూలము. స్వర్గాదులు లేవు. ఇదే కైవల్యమార్గమని చెప్పుచూ పరధన, పర స్త్రీల అపహరించుచు చరించువారు.

బుద్ధుడు:- సమ్యక్కగు దృష్టి, వచన, కర్మ, జీవిక, కృషి, సమాధులు ప్రతివాడు పొందదగునని బోధించెను. సత్యాహింసాది ధర్మముల నడువుమని బోధించె. తాను దేవుడనియు, తననే సర్వవిధముల పూజించి, తనదయ పొందదగునని, దాన కైవల్యము గల్గునని కృష్ణుడు అర్జునునకువలె ప్రజలకు బోధించెను. బుద్ధుడు ఒకనాడు కాస్యపుని యజ్ఞశాలలో ఘోరవిషసర్పము నెదుర్కొనెను. తనయోగదృష్టిచే దాని బలము హరింప ఒకకుండలో జేరెను. తనవలె జగత్తంతయు జూచువాడు గాన ఈదృశ్యము చూచి వేద మత బ్రాహ్మణులగు కాస్యపాదులు యీతనిమతమున జేరిరి. అది విని కాస్యపాదులు పశుయజ్ఞముల జేయుచు రాజులకు రాజులకు యుద్ధములు గల్పించి జగన్నాశనము జేసెడివారు. ఇట్టి దుష్టులకు అతని దివ్యదృష్టి సోకినంతనే అతని ఆజ్ఞలకు లోనైరి. భాగవతము 5 వ స్కంధము:-

ఉ॥ "భారతవర్ష మందు హరి బల్మరు పుట్టుచు ప్రాణికోటికిన్
ధీరతతోడ తత్వముపదేశము చేయుచునుండు" అని

గలదు. యితడు నిష్కామముగా బ్రహ్మవిద్యాదానము ప్రబోధచేయుటచే విష్ణ్వంశజుడగుఅవతారమూర్తి యనుటకే

సందియము లేదు. ఆదివ్యదృష్టిచే రాక్షసమార్గము బంధించెను. గాన నేటి బుద్ధమతనాస్తిక్యము వదలి, బుద్ధమతాపేక్షపరులు సర్వమును, తనను, బుద్ధునివలె చూచుచు, ఆతని పూజించుచూ, సత్యాహింసాదిమార్గముల చరించుచు బుద్ధుని వంటి శక్తివంతులు తామగువరకు తా మొంటరిగా తపస్సు చేయువారు యిహపరసుఖము లందెదరు. రామావతారమున కృష్ణావతారమున, బుద్ధావతారమున ఒకటేమార్గము అగు వేదాంతమే బోధింపబడెనని నా యూహ.

వ్యాసర్షి – శాంతిపర్వము – భీష్మస్తవము

శ్లో॥ దానవాంస్తు వశేకృత్వా పునర్బుద్ధత్వమాగతః।
సర్గస్య రక్షణార్థాయ తస్మై బుద్ధాత్మనే నమః॥

రాక్షసులు జగదపకారమగు నామ ధారక యజ్ఞములు చేయుచు, దుర్మార్గమున చరింప వారిని తమ ఆజ్ఞతో బంధింపజేసి తిరిగి జ్ఞానమార్గము స్థాపించి జగత్కళ్యాణము చేయు బుద్ధునకు నమస్కారమని భీష్ముడు స్తుతించెను.

భాగవతము 1 స్కంధము:- 3వ అధ్యా. 23 శ్లో॥—
తతః కలౌసంప్రవృత్తే సమ్మోహాయసురద్విషాం।
బుద్ధోనామ్నా జినసుతః కీకటేషు భవిష్యతి॥

కలిలో ప్రవృత్తిమార్గస్థులగు రాక్షసుల బుద్ధినాశనముచేయ బుద్ధుడనుపేర జినసుతుడై కీకటదేశమున అనగా మధ్యగయాప్రాంతమున పుట్టగలడు. కొందరు యీతడవతార బుద్ధుడు కాడని వాదింతురు. గాని వ్యాసునిప్రాత తరువాత

పుట్టిన బుద్ధుడితడేగాని మరియొక బుద్ధుడు లేడు. అని "భవిష్యతి" అను క్రియాపదమునుబట్టి తెలియదగును.

తిక్కన సోమయాజి ఆతని నాస్తికుడని గాబోలు బుద్ధావతారశ్లోకమునకు తెనుగు వ్రాయలేదు. పోతరాజు మాత్రము రచించెను. శంకరునికాలమునాటికి యీ మతము యెక్కువ నాస్తిక్యము, దుష్టత్వము పెరుగుటచే దానిని భారతమునుండి తరిమివేసి మరల బుద్ధునివలె వేదాంతమార్గమును స్థాపించెను. ఎన్ని అవతారములు, బ్రహ్మర్షులు పుట్టినను దుష్కర్మ, నరకము- సత్కర్మ, స్వర్గము. నిష్కామకర్మ కైవల్యమిదునని బోధింతురు. బైబిల్. ఖురాన్, హిందూ వేదములు స్వర్గమును- భారతదేశ వేదాంత మొక్కటే కైవల్యమార్గము బోధించుచున్నది. దీనినే అవతారులు బోధింతురు. శంకరమతమునను నాస్తికులెక్కుడై ఆ మతధర్మము లాచరింపమానిరి. దాన అదియు నామమాత్రమైనది. రాక్షసులగు శుష్కవేదాంతులు యీ వేదాంతము నుపదేశింతురు. వీరు చెప్పునది శక్తిహీనమై, పొట్టపోషణకు మాత్రము హేతువై యుండును. భక్తిలేని కుంటి, గ్రుడ్డివారు "నారాయణ-రామ" అంటేనేగాని పొట్ట జరుగుటకు ధనము రాదని నామమాత్రము పల్కునట్లు దేవుడు నేనే- నన్ను పూజించుడని శిష్యులకు చెప్పును. దేవునివంటి సర్వశక్తివంతుడు మాత్రమతడు కాడు. ఆశక్తి ఒక్క బ్రహ్మర్షుల యందు అవతారములయందు గన్పించును. సద్భక్తులు నిష్కామము

గా సత్యమగు వేదాంతమార్గము ప్రచారముచేయుచుందురు.

# బౌద్ధమతము - సర్ రాధాకృష్ణజీ

(1956 ఫిబ్రవరి 7 వ తేది ఆంధ్రప్రభ,పత్రికలో)

సర్ రాధాకృష్ణగారు ప్రపంచశాంతి బౌద్ధమతము వల్ల గల్గునని ఉద్బోధించినారు. అన్నిమతముల మంచిగలద నియు, తమవేదాంతమతతుల్యములనియు భావించి పశ్చిమ దేశాలలో (అనగా రష్యాదేశాలయందు) రాధాకృష్ణగారు, వివేకానందుడు లోకకళ్యాణమునకై అమెరికాలో అన్నిమత ములలో గొప్పమతమని వేదాంతమతస్థాపనచేసినట్లు చేయ లేదు. బుద్ధునితర్వాత అందు నాస్తికులెక్కుడగుటచే శంక రాదులు నాస్తికమతమని పేర్కొన్న బౌద్ధమతవ్యాప్తి వీరు చేయునట్లు తెలియుచున్నది. బైబిల్, ఖురాన్,హిందూ వేదములు సత్కర్మమార్గమనగా స్వర్గమార్గమునే బోధించు చున్నవి. దీన జన్మసాఫల్యముగాదుగదా? ఒకవేళ వాటిలో కైవల్యమార్గమున్నదని వీరు చూపినను ఆ యా దేశస్థులు పూర్వమునుండి నేటివరకు కొందరైనను పుట్టి ఆచరించినట్లు కనబడదు. భారతమున యీ వేదాంతమార్గము నెక్కుడు గను- నేడు రామకృష్ణ- వివేకానందులవంటివారు పుట్టి దాని ఫలమును చూపువారు తక్కువగ నున్నట్లు చరిత్రలవల్ల తెలి

యుచున్నది. వేదాంతమార్గ మొకటి, బుద్ధునిమార్గ మొకటి యు గాదు. సర్వశాస్త్రపారంగతుడగు కృష్ణుడు గీతను బోధించినట్లు బుద్ధుడు సర్వశాస్త్రపారంగతుడై వేదాంతమతమునే తనపేర కైవల్యమిదు మార్గమని బోధించెనని నా యూహ. ప్రస్తుత బుద్ధమతములలో నాస్తిక్యము యెక్కుడుండుటచే నాస్తిక్యము నేనంగీకరింపలేదు. బుద్ధుని వేదాంత బోధ సత్యమైనదనే నా యూహ. దానిని నాస్తికులు మరుగుపరచిరి.

# పండిత నెహ్రూజీ - బౌద్ధమతము

వీరు లోకకళ్యాణము చేయవలయుననియు, యుద్ధములు పనికిరావనియు, ప్రతిదేశస్థులు శాంతి అహింసల నొందుట సుఖమార్గమనియు, భూలోకమున అనేక దేశముల ప్రచారము చేయుచున్నారు. మరియు జగమున ప్రజలు యే మార్గమున సుఖము చెందుదురా యని తలచుచు తనకు తెలిసిన మార్గాలలో శాంతి, అహింసలు మంచివని బోధించుచున్నారు. నేను రాజ్యకాంక్షుడను. రాజ్యసేవాకాంక్షుడను గాను. భగవత్సేవాకాంక్షుడను. అందుచే నాకు తెలిసిన భగవద్ధర్మములు మాత్రము ప్రచారముచేయ నుద్దేశము గలవాడను. శాంతి, అహింసలు బౌద్ధమతమున గలవని దానిపై నెహ్రూజీదృష్టిపడినది. గాని భగవద్దృష్టి లేని

శాంతి, అహింసలు సామాన్యఫలకిరుడును. భగవద్దృష్టితో గూడిన శాంతి, అహింసలు విశ్వవిజయమిచ్చును. భగవద్దృష్టి లేని అహింసావాది పూర్ణదుష్టులు యుద్ధమునకు వచ్చిన విజయము గొనలేదు. అట్టి యుద్ధము మధ్యమ సాధువులతో గల్గిన చాలకాలమునకు పూర్ణసాధువులతో త్వరలోను జయమొందగలదు. ఉ:- కాంగ్రెస్ వారు. మధ్యమ సాధువులగు యింగ్లీషువారితో భగవద్దృష్టిలేని అహింసాయుద్ధముచె కొన్నియేండ్లకు జయించిరిగదా! అట్లే పూర్ణదుష్టులగు పోర్చుగీసువారితో (ప్రస్తుతం భిన్నపక్షస్థులైనను) పూర్వపు కాంగ్రెస్‌వారు గోవాలో అహింసాయుద్ధమున అనేకులు నశించుట జూచి యుద్ధముచేయు జననష్టమని, కళ్యాణదాయకము గాదనియు నెహూ్రజీ మాన్పించెను. వారిని జయింప ననేక మార్గములు ఆలోచించుచున్నాడు. పాకీస్తానీయులు కాశ్మీరుపైబడ వారితో అహింసాయుద్ధము మాని, యుద్ధము జేసి, మరల యుద్ధమన్న యిష్టములేక ప్రపంచరాజ్యసభ యందుంచెను. అది యింతవరకు తేలలేదు. గాన భౌతిక అహింసాయుద్ధము పూర్ణదుష్టులదరి జయమిడదు.



# ప్రహ్లాదుడు - అహింస - భాగవతము

తనను కొట్టువానిని, సర్పమును భగవంతునిగా చూచుచు హృదయమున భగవంతునినిలిపి, భగవన్నామము చిత్తమున స్మరించుచు, తనను భగవంతునిగా చూచుచున్న ప్రహ్లాదునికే బాధ కల్గక, పూర్ణదుష్టులేమియు చేయలేక పోయిరి. పుత్రుని దివ్యదృష్టిలో పడుటచే కొంతకాలమునకు పూర్ణదుష్టుడగు హిరణ్యకశిపుడు నశించెను. సన్మార్గులపై యీ దివ్యదృష్టి పడిన మరింత సన్మార్గులగుదురు. మధ్యమాధమ పాపులు కొంత పాపరహితులై శాంతి చరింతురు. గాన భౌతిక అహింసా శాంతిమార్గముల ఆధ్యాత్మ అనగా భగవంతునితో మేళవింపజేసి అభ్యసించిన దివ్యదృష్టి ఆటం, హైడ్రోజన్ బాంబుదారులపై జూచిన సన్మార్గులగువారు శాంతులగుదురు. పూర్ణదుష్టులగు వారు చాల బలహీనులై రోగయుక్తులగుటయో, నశించుటయో అగునని నాయూహ. దూరముననుండిన వారిపై జూచుట ఎట్లన, మనోవేగము అన్ని వేగములలో మిన్నయైనది. గాన ఆటమాదులతో యుద్ధముచేయువారి దేశమును భావించి అందుగల ప్రజలను ఆటమున్నవారినిగా జూచి వారిపై దివ్యదృష్టి చూచిన వారు వెంటనే శాంతింతురు. పూర్ణదుష్టులైన బలహీనులగుదురు. భౌతికాధ్యాత్మికలకల్పినదివ్యదృష్టి కలపూర్వర్షులు అడవులలో నివసించి సన్మార్గ దుర్మార్గ జంతువులను చూచుటచే దుష్ట

మృగభయములేక సన్మార్గమ్మునోపయోగము పొందుటయు గల్గిరి. ఆ అడవుల వసించు చెంచు యానాదులు యీ దివ్య దృష్టిలేమిచే సన్మార్గమ్మునాపకారము చేయుచు మర్మార్గ జంతువులలో జయము, అపజయము గల్గి సుఖ మనునది లేక భయముతో జీవించుచున్నారు. భగవత్కాంక్షులు ఈదివ్య దృష్టితో భగవద్ధర్మములు ప్రచారము చేసిన అడ్డులేక సాగును. లేనివారు ప్రచారముజేసిన కొన్ని విఘ్నములు గలుగును. దివ్యదృష్టిగల కృష్ణ, బుద్ధుల ప్రచారములో జగముల అడ్డువారు లేక విశ్వజయము గాంచిరి. గీత॥— 8 అ॰ రాజ్యకాంక్షులు యీ దివ్యదృష్టితో యుద్ధము చేయదగునని పార్థునకు కృష్ణుడు బోధించెను. దాన జయమగునని భావము. ఈ దివ్యదృష్టిలేని వారికి జయాపజయములు వారిజాతకముల బట్టి జరుగుచుండును. గాన ప్రస్తుత నెహ్రూజీ గారి లోక కళ్యాణకాంక్ష భూలోకమున మరియొకరికి లేనట్లున్నది. ఆటం, హైడ్రోజన్ బాంబులున్నవారి సంబంధము లేక ఒంటరిగా నుండగలమనినొక్కి చెప్పుచున్నాడు. గాన ప్రహ్లాదునివలె భౌతికాధ్యాత్మికముల కల్పిన దివ్యదృష్టి సిద్ధిగాంచిన విశ్వ విజయము యుద్ధములేకయే చెంది, లోకకళ్యాణము చేయగలడని నాయూహ. ఉదాహరణ:— బుద్ధుడు, వామనుడు బలవంతులగు రాక్షసులను సత్యధర్మాహింసాది మార్గాలనడచుచు దివ్యదృష్టి చూచుటచే అనతికాలములో జయింపగల్గిరి.'

నెహ్రూజీ: ప్రారబ్ధమును జ్యోతిశ్శాస్త్ర జాతక భాగ

ములు నమ్మను. పూర్వార్షులు సత్యవంతులగుటచే సత్ప్రారబ్ధబలాదిక్యతను పురుషప్రయత్నము సిద్ధించునని అనుభవ పూర్వకముగా అనేకగ్రంధముల వ్రాసిరి. దాని నమ్మదగినదే యని నా యూహ.



# దివ్యదృష్టి

గీత:- ౭ అ. వేలకొలది జనులలో ఒకానొకడు నన్ను వేదాంతముచే తెలియగోరును. అట్టి వారిలో ఒకానొకడు మాత్రము ఆదేవుని (అనగా సర్వము దేవునిగా చూచుట) దివ్యదృష్టిసిద్ధి గాంచును. గాని ఈదృష్టి అందరికి త్వరలో తేలికగా సిద్ధించునదిగాదు. గొప్పజాతకుడైన సంకల్పసిద్ధి త్వరలో నగును. అతడు లోకకళ్యాణము చేయగలడు. అసత్య, ధర్మ, అహింస మార్గస్థుడగు నెహ్రూజీ గొప్పజాతకుడు గాన ఈ దివ్యదృష్టిత్వరలో సిద్ధిగాంచగలడు. దాన లోకమంతటికి త్వరలో సత్య, ధర్మ, అహింసాది ధర్మ మార్గ స్థాపన జేసి కళ్యాణము చేయగలడు. తక్కువ జాతకులు ఈదివ్యదృష్టి గలిగినచో వారున్న ప్రదేశముననే కళ్యాణము చేయగలరు. ఉదా:- రామకృష్ణ పరమహంస గొప్పజాతకుడు. వివేకానందులు దేశ దేశాల లోక కళ్యాణము చేసెను. ఈదివ్యదృష్టి ఫలము- పూర్వము జరిగినది- జరుగుచున్నది- ముందు జరుగగలదు- తక్కువ జాతకుల

కి దివ్యదృష్టి చాలకాలమునకుగాని కల్గదు. తక్కువ జాతకులకు, గొప్పజాతకులకు ధనాదులలో, ఇహ సౌఖ్యాదులలో భేదముగా నుండును గాని ఉభయులు కైవల్యార్హు లగుదురు. పూర్వర్షులు పేదవారు. రాజర్షులు (పూర్వమున క్షత్రియులు సైనికులుగా నుండువారు. వారుగాక రాజ్యమేలు కుటుంబము వారు తప్పక వేదాంతశాస్త్రము చదివి యీదివ్యదృష్టి ధర్మమార్గము గల్గి పాలించువారని గీత 4 అ.లో గలదు) ధనవంతులు వీరుభయులు సఖ్యతతో మెలగినట్లు రామాయణ భారతాది గ్రంధాల కలదు. రాజ్యాధిపతులు త్వరలో దేశదేశాల తిరగగలరు. అందుకు తగిన సౌకర్యములు వారికి గల్గియుండును. ఇతరులు గొప్పసిద్ధిగాంచిన వారైనచో హితమైన దేశదేశాల తిరిగి లోకకళ్యాణము చేతురు. లేనిచో తామున్న ప్రదేశమున మాత్రము చేయగలరు. కార్మికులు, రైతులు, వర్తకులు, రాజకీయోద్యోగులు, భగవత్సేవకులు, యీ దివ్యదృష్టిగాంచిన వారున్న ప్రదేశముల లోకకళ్యాణముచేయుచుందురు. కైవల్యమందరు గాంతురు. యుద్ధము సేయు సైనికు లీ దివ్యదృష్టిచే తప్పక జయముగాంతురు.

పీలగునట్లు సత్యధర్మాహింసాది మార్గాల చరించు పాశ్చాత్యులు ఆటమాదులు గలవారు పాకిస్థాన్, పోర్చుగీసువారితో కలసి యెందునా చేరని భాగతీయులు యుద్ధమున నోడింతురని చాలమందికి భయము గలదు.

గీత 18 అ. సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ॥ అన్నిధర్మాలు విడిచి భగవంతునే దిక్కు పొందుమనెను. దాన అతడు రక్షించుననెను. గాన దుష్టుల సహాయముకన్న భగవంతుని సహాయము గొప్పది. అది దివ్యదృష్టిచే గల్గును. భగవంతుడున్న పక్షము తక్కువగానున్నను జయము గాంచును. ప్రత్యేకముగా దివ్యదృష్టి యను పుస్తకము యీ దృష్టిపరిభావము వ్రాసితిని, చదువుడు. రాజ్యమేలు వారు, సైనికులు యీ దివ్యదృష్టి అభ్యసించిన కొందరైనను నెగ్గగలరు. నెగ్గిన వాడొక్కడున్నను ప్రహ్లాదునివలె విశ్వవిజయము గాంచగలడు. యం. యల్. ఏ.లు, యం. యల్. సి.లు యీ దివ్యదృష్టిచే ప్రజలను సత్యధర్మాది మార్గాల నడపగలరు. నేనును భారతీయుడనగుటచే భారతకళ్యాణమున భాగస్థుడను గాన దానికి సాయముపడ, మద్గురూత్తముడు, హిమవన్నివాసి, వాయుభక్షకుడు, సర్వశాస్త్రభాషా పండితుడగు కోదండరామ రాజావధూత వారి పాదసన్నిధిని నేర్చిన వేదాంతశాస్త్రమార్గములలో నొకటియగు దివ్యదృష్టిని లోకకళ్యాణము గోరి వెల్లడించితిని. రాజ్యకాంక్షులు తమరాజ్యరక్షణకు, తమరాజ్యమున పూర్ణదుష్టులు బలహీనులగుటకు యీదృష్టి ఉపయోగింతురు. "మనోఽణురూపః" మనస్సు అణురూపము. ఇది బద్ధలైనగాని యీదృష్టిగల్గదు. పంచభూతములు మనస్సున లయమగుగాన పంచభూతాదులచే గల్గు ఆటమాదులశక్తి యీదృష్టి నశింపచేయును.

అమేరికావారు అణువిజ్ఞానము చెప్పిన యెంతో శ్రద్ధతో విని చేయుదురు. ఇదియు అట్టిదేనని పరీక్షించుడు. భగవతాంశులు లోకమంతట సన్మార్గవృద్ధి, పూర్ణదుష్టనాశనము గోరుదురు. వారు ప్రత్యేక మొక దేశరక్షణచేయరు. లోకస్థులందరికి యీ దివ్యదృష్టి చెప్పగలరు. దాన పూర్ణ దుష్టులు నశించుటే లోకక్షేమమగునని వారి భావము. అట్లు భూలోక రాజ్యస్థులందరు చేసిన భూలోకము వైకుంఠముగనే ప్రకాశించును.

హరిః ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః





# తప్పొప్పుల పట్టిక



| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- |
| 4 | 17 | సాయుద్య | సాయుజ్య |
| | 22 | ద్వేషంకొను | ద్వేషించుకొను |
| 7 | 8 | దేవునిడయు | దేవుడనియు |
| | 12 | బ్రహర్షి | బ్రహ్మర్షి |
| | 13 | విపులముగా | విపులముగా |
| 8 | 15 | దేముడని | దేవుడని |
| 11 | 12 | దేహసుఖము | దెహసుఖము |
| 12 | 5 | తత్పలము | తత్ఫలము |
| 16 | 9 | యజాదుల | యజ్ఞాదుల |
| | 13 | పంశుద్ధ | పరిశుద్ధ |
| | 14 | పుణ్యభూపుల | పుణ్యభూముల |
| | 22 | అమారము | అమార్గము |
| 19 | 9 | వదియై | వృద్ధియై |
| | 15 | మార్గాలేలోకాన | మార్గాలీ లోకాన |
| 21 | 9 | కొందదు | కొందరు |
| | 20 | స్వసౌఖ్యములు | సర్వసౌఖ్యములు |
| 27 | 5 | ద్యూతాతి | ద్యూతాది |
| | 13 | యితనికి | ఇతనికి |
| 28 | 5 | పాపముల బాసి | పాపముల బాపి |
| | 19 | పూర్ణి | పూర్ణ |
| 32 | 4 | మతముతో | మతములో |
| | ,, | ఐక్యమనదగు | ఐక్యమవదగు |
| 34 | 18 | పశ్చిమదేశీ | పశ్చిమదేశ |
| 37 | 4 | బిక్షతో | భిక్షతో |
| 38 | 6 | దేవునిగా ద్రౌపతి | దేవునిగా చూచి ద్రౌపతి |

290



| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| [illegible] | 7 | తప్పుకొనినది | తప్పుకొనునది |
| 33 | 1 | వాడు వాడు | వాడు |
| 44 | 11 | బ్రహ్మాండమునే | బ్రహ్మాండములో |
| | 20 | ప్రత్యే | ప్ర్యత్యే |
| 46 | 9 | భగవత్శక్తి | భగవశ్శక్తి |
| 48 | 20 | యోసంగము | సంగమము |
| 53 | 22 | కలియుక | కలియుగ |
| 54 | 22 | వేముడు | వెవుడు |
| 56 | 2 | వర్తకులు | వర్తకులు, శూద్రులు |
| 64 | 9 | మైత్రేయుద్యు | మైత్రేయుణ్యు |
| 65 | 18 | జూపధ్యానాదులు | జపధ్యానాదులు |
| 66 | 10 | గలదు | గల్గదు |
| 70 | 2 | ధనవతులు | ధనవంతులు |
| 71 | 17 | ధ్యానులు | ధన్యులు |
| 76 | 1 | ప్రహ్లాదునితో | ప్రహ్లాదుడు |
| | 2 | నరసింహుడు | నరసింహునితో |
| | 12 | రాతి | రాత్రి |
| 78 | 16 | త్పఉత్తి | ఉత్పత్తి |
| | 20 | డాంభికులగు | డాంబికులగు |
| 80 | 16 | బ్రాహ్మణి | బ్రాహ్మిణి |
| 82 | 4 | చేరిని అతిథిని | చేరిన అతిదిని |
| | 14 | వానివాల్ల | వానివల్ల |
| 83 | 17 | మండవచ్చు | నుండవచ్చు |
| 88 | 8 | డిభకులను | డింభకులను |
| 90 | 14 | పుణ | పుణ్యా |
| 91 | 14 | స్నాతులు | స్నాతుడు |
| 92 | 6 | బిక్షువు | |
| 105 | 5 | పూర్ణముగా నిండును | పూర్ణముగా నిడును |
| 109 | 20 | పెట్టబుద్ధి | పెడబుద్ధి |

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 111 | 5 | వేలేండ్లుండు | పదివేలేండ్లుం |
| 116 | 2 | లెక్కరుండురు | లెక్కడుండుదు |
| | 20 | సత్సంతత | సత్సంతతి |
| 118 | 18 | దేముడు | దేవుడు |
| 124 | 16 | అజపతాంపర | జపతాంపర |
| 134 | 18 | కలయుగ | కలియుగ |
| 138 | 10 | ఉత్తరగ్రహములు | ఉత్తరగృహములు |
| 140 | 15 | నెప్పినటులే | చెప్పినటులే |
| 141 | 2 | రార్జన | రాధన |
| | 7 | పితస పిఎచి | పనత నిపిచి |
| 143 | 3 | గగ్గరగ | వగ్గరగ |
| 146 | 6 | దీనిని సిరి | దీనిని వరి |
| | 11 | వ్యాదనార్జన | వ్యాధనార్జన |
| 152 | 10 | వాదించలేరు | వారించలేరు |
| 156 | 10 | మతిస్మృతం | మితిస్మృతం |
| 160 | 4 | తొంతరగా | తొందరగా |
| 164 | 16 | విదలు | విధులు |
| 165 | 18 | ॥గీ॥ | ॥సీ॥ |
| 166 | 2 | గాంచుచుండె | గాంచుచుంటి |
| | 8 | యనవిద్యతే॥ | అయనాయ విద్యతే॥ |
| | 14 | భగవంతుని | భగవంతునివలె |
| 172 | 7 | పాలించిన | పాలించి |
| 174 | 1 | పొందనవానికి | పొందని వానికి |
| 180 | 7 | గన్నది | గనునది |
| 186 | 21 | సత్యమును | నిత్యమును |
| 188 | 3 | రాజములు | రాజ్యములు |
| 191 | 20 | కవిః | రవిః |
| 200 | 8 | సంఘకులకా | సంఘములకా |